# కళారాధన

చరిత్రాత్మక మగు నవల


రచయిత

కొండూరు వీరరాఘవాచార్యులు

ఆంధ్రోపన్యాసకుడు

వి. యస్. ఆర్. కళాశాల, తెనాలి.



ప్రకాశకులు

ఆంధ శిల్పకళా పరిషత్తు

నాలి

శ్రీ

# కళారాధన

కళారాధకుఁ డగు వీరబల్లాలుఁడు, స్థాపత్య తపస్వి యగు జక్కన, దివ్యవిగ్రహ స్థాపనచే భక్తిని నిలిపిన శ్రీమద్రామానుజులు: వెరసి — 'కళారాధన' అను ఈ నవల. కళాజీవనముచే నీతి మొదలుకొని నిశ్శ్రేయసము వఱకుఁ గల దివ్యవస్తువులను బడసి దివ్యులైపోఁగల మను యాథార్థ్యమును కన్నులకుఁ గట్టినటులు చేసిన యీ గ్రంథ మందఱును జదువఁ దగినది. మఱియు నిది స్థాపత్య రహస్యములకు చందుకా పెట్టె. తమ సంగతి మఱచిన విశ్వబ్రాహ్మణు లకును, విశ్వబ్రాహ్మణుల వృత్తము మఱచిన పెఱవారికిని ఇది కనువిప్పు.

చిరివాడ
కృష్ణా
18–5–61

వేలూరి శివరామశాస్త్రి



కృతిపతి

శ్రీ నల్లపాటి సుబ్బారావుగారు

బి. ఇ., ఎం. యం. ఐ. ఇ.

చార్టర్డు ఇంజనీరు.

# కృతిసమర్పణము

ఇది యనుకోని సంఘటన, మేమి విచిత్రమొ! ఈశ్వరేచ్ఛగాఁ
బొదలిన యట్లు తోఁచు; మనపూర్వభవార్జితమైత్రియేదొ యి
య్యెదనునఁ బక్వమై కృతిసమర్పణ రూపము దాల్చి తీయనౌ
యెదల నపూర్వ బాంధవము సృష్టియొనర్చుటఁ జేసి నెచ్చెలీ!

వేద ప్రస్తుతులౌ మహర్షుల జగద్విఖ్యాత వంశంబు నం
బ్రాదుర్భావము పొంది, వాస్తుఘటనా ప్రాగల్భ్య మార్జించి, ర
మ్యోదాత్త ప్రథమాన కావ్యకళ లభ్యూహించి, శ్రీ విశ్వకృత్
పాదాంభోరుహ బంభరంబవగు నీ ప్రాగల్భ్య మగ్గించెదన్.

ఎందఱు లేరు వేలు గడియించిన నేర్పరు లంధ్రభూమి? వా
రందఱు యోగ్యకార్యముల కర్థము గుప్పుచు నున్నవారె? ఈ
చందమునన్ బరోపకృతి సల్పుచు గణ్యత కెక్కినారె? నీ
డెందము మంచిదౌటను గడించితి విత్తముతోడఁ గీరితిన్.

ఈ వొక గుప్తదాత వయి యిచ్చితి వర్థము లర్థికోటి వాం
ఛావధులఁ గ్రహించి; కరుణార్ద్రిఁడ వౌట సహింపలేవు క
ష్టావళి గ్రుంగు మానవుల యాపదలఁ లవలేశ; మిట్టి నీ
భావము నాచికొన్న దనవద్యగుణో త్తర! నాదు చిత్తముఁ.

ఆస్తికత మీఱ దేవతోపాస్తి చిరము
దివ్యదీక్ష నొనర్చి త ద్దేవతా ప్ర
సాద సంసిద్ధి వడసిన చతుర మతివి;
భానుమన్మునిగోత్ర పావన చరిత్ర!

గుణ వయో రూప శీలానుకూల యైన
యట్టి వరలక్ష్మి గృహలక్ష్మి యై యొకంటఁ
గొదవ రానీదు సుంత నీ సదనమునకు;
ఈ సుకృతమున కే పూజ చేసినావొ!

అనుఁగుంజెల్లెలు నాకు నీ గృహిణి; బావా! సద్గుణోదార య
వ్వని తారత్నము భార్యయౌట గృహముఁ వంశంబు ధన్యంబులై
తనరెఁ, నోములు పండె, లోకమున నుద్యత్కీర్తి నిండారె; మేల్
గొనముల్ గల్గిన పత్ని చేకుఱినఁ గోర్కుల్ పండి దైవాఱవే?

చేసినట్టి ప్రతిన చెల్లించుకొని బుధ
స్తుత్య చరితుఁ డైన సత్యమూర్తి
విశ్వకర్మనిభుఁడు విశ్వజనీనక్రి
యాచణుండు జక్కణార్య శిల్పి—

తనరె రామానుజ ప్రాణ దాత యగుచు
విష్ణువర్ధను రాజ్యంబు విస్తరించె
మతవిరోధము లెడలించి, మర్త్య జగతి
దివ్యతా భూతి సాధించి తేజరిల్లె.

అతఁ డనంత శిల్పముల నందియ వేసిన చేయి, శాస్త్ర వి
ద్యాతతబుద్ధి, తాత్త్వికుఁ, డహంకృతిదూరుఁడు, రాజనీతి వి
ఖ్యాతుఁ, డుదారతాఖని; తదద్భుత దివ్య చరిత్ర మిద్ది; నీ
వే తగు దన్న దీనిని గ్రహింపఁగ నీవును శిల్పి వాటచే.

ఏవంవిధ గుణ శీల
శ్రీవాల్లభ్యమున, లోక సేవా నిరతిన్
బావనుఁడవు; నీ కీ కృతిఁ
గావించితి నంకితంబు; గైకొను దీనిన్.

అస్మదీయ కళారాధనాఖ్య కృతికి
నేత వీ వాటచేత, నా చేత మెంతొ
తృప్తి గన్నది; మణి, సువర్ణాప్తి కతన
సార్థకము గాదె; మధుర ప్రసన్న హృదయ!

నీదగు మైత్రిపెంపు వరణీయము; బాంధవ మత్యుదార మా
వేద హిత ప్రవర్తనము విశ్రుత; మంచిత తత్త్వదృష్టి యా
హ్లాద విధాయి; యన్నిట సమర్థుడ వౌదువు; శిల్పకావ్య క
న్యాదయితా! యొనర్పవె! కళాభ్యుదయప్రతిపాదక క్రియల్.

నీ నల్లపాటి వంశము
నానా విద్యా కళా సనాథంబై, వి
జ్ఞానైశ్వర్య సమగ్ర
శ్రీనిధి యగుఁగాత విశ్వశిల్పకు కరుణన్.

నల్లపాటి వంశ నాయకుండౌ సుబ్బ
రావు "నింజనీరు" జీవితేశుఁ
గా భజించి, కీర్తి కర్పూర పరిమళ
శ్రీల నింపు దెసల కృతికుమారి!

# కళారాధన

## ౧

అది "హాసన్" నగరములోని యొక విశాలమగు నుద్యానవనము. దానినడుమ నొక పెద్ద మేడ. దాని చుట్టును పెక్కు చతుశ్శాలలును, శిల్పశాలలును గలవు. మేడకు కొంత దూరమునఁ బడమరదిక్కున నొక దైవమండప మున్నది. దానిలో నొక దివ్యసుందర విగ్రహము కలదు. ఆ మూర్తి ఐదు శిరస్సులతోడను, పది చేతులతోను నొప్పుచుండెను. నాలుగు దిక్కుల కభిముఖముగా నాలుగు ముఖము లున్నవి. అయిదవ ముఖ మూర్ధ్వమున నీశాన్య దిశాభిముఖమై యున్నది. దశబాహువులలో రెండు వరదాభయములు. తక్కిన వానిలో నా యా పరికరములు, నాయుధములును గలవు. ఆ దివ్యమూర్తి యేదో సృష్టి రహస్యమును జాటుచున్నట్లుండెను. ఆ మూర్తి కెడమప్రక్కనే యున్న మఱొక గర్భాలయములో నైదు మోములు వరుసగాఁ దీర్పబడియున్న యొక స్త్రీ దేవతామూర్తి త్రిజగన్మోహనాకృతి యలరారుచున్నది.

ఆ దేవాలయమునకు నూఱడుగులదూరములో నున్న యొక చిత్రశాలలో నొక సుందరాకారుఁడు తదేకదీక్షతో చిత్తరువునకు రంగులు తీర్చుచుఁ గూర్చుండి యున్నాఁడు. ఆతని చేతి కుంచెనుండి జాలువాఱుచున్న పలు రంగులవలన

నా చిత్రము కొలఁదికాలముననే కళావిలసితమగు మానవాకార మయ్యెను. ఇంక నాతఁ డేదో రంగులో కుంచియ ముంచి దిద్దఁబోవుచుండ రాజపురుషుఁ డొకఁ డట కరుదెంచి సాగిలఁ బడి మ్రొక్కి యిట్లు విన్నవించుకొనెను.

"మహాచార్యస్వామీ! నేఁటి జయంత్యుత్సవము నకు హొయసల సామ్రాజ్యాధిపతులు వీరభల్లాళ మహా రాజులుంగారు కానుకలు పంపినారు. దయతో స్వీకరింప వేఁడుచున్నాను." అని దంతపు బరణుల మూఁత లెత్తి చూపించెను. ఆ బరణులలో ముత్యాల హారములు, రతనాల సరములు, వజ్రాల పేరులు, బంగారు గొలుసులు, పచ్చల పదకములు, ఏకావళులు, బన్నసరములు, చంద్రహారములు ఎన్నెన్నో దేదీప్యమానముగా వెలుఁగుచుండెను. అటు పిమ్మట నాభటుఁడు "స్వామీ మహారాణి శ్రీమతి శాంతలాదేవి గారు గాయత్రీమహాదేవికి రత్నఖచిత కిరీటమును తమ సేవగా సమర్పించినారు." అని యొక వెండిడబ్బాను దెఱచి కిరీట మును జూపి దాని నాచార్యునకు సమర్పించెను. తరువాత నా భటుఁడు "ఇవి గాంగరాజంపిన కానుకలు. ఇవి కీర్తిమతిగా రంపిన యుడుగరలు. ఇవి మహామంత్రిగారి యుపదలు. ఇవి రాజోద్యోగులు సమర్పించిన యుపాయనములు." అని తాను దెచ్చిన వాని నెల్ల నా శిల్పాచార్యునకు సమర్పించి యిట్లనెను. "ఇంకను పట్టు వస్త్రములు, సరిగంచు చీనాంబరములు, దువ్వలువలు, సాలువులు, చీరెలు, రవికలు మున్నగునవియు, సుగంధద్రవ్యములును, తక్కుంగల సంభారములును ఒంటెల

మీఁదను, ఏనుంగులమీఁదను వేసి పంపినారు. వానిని పదిల పఱుపఁ దగువారి కాజ్ఞ యిండు.''

అనునంతలోనే దేవోజు శిల్పాచార్యుఁ డట కరుదెంచెను. జక్కణాచార్యుఁ డాతనిఁగాంచి ''దేవోజూ! ఈవస్తువు లన్నియు నేఁటి జయంత్యుత్సవమునకు వీరభల్లాళుల వారంపిన కానుక లఁట. వీనిని నిన్న చోళభూపాలుఁ డంపిన యుపాయనము లుంచిన భవనముననే యుంచి పూజావేళ కాలయములోనికిఁ బంపు నేర్పాటు చేయుము.'' అనెను.

దేవోజు ''చిత్తము, అట్లే. తమకుఁ జెప్ప వీలు కాలేదు. నిన్న సాయంకాలము తాము వాహ్యాళి కేఁగిన సమయమున పాండ్యరా జంపిన కానుకలనుగూడ భటులు తెచ్చి యున్నారు. వానిని మన అనంత కీర్తిస్థపతి చోళుల వస్తువు లుంచిన భవనముననే పదిలము చేయించినాఁడు. కావున వీనిని దక్షిణాగారమున నుంచి వలసినప్పు డాలయమునకుఁ బంపు నేర్పాటు చేసెదను.'' అనెను.

''సరే, కానిమ్మ''ని కార్యదీక్షలో దేవోజున కలక్ష్యముగా సమాధానము చెప్పి యాకళామూర్తి మఱల తన చిత్రరచనలో మునిఁగి పోయెను. ఇట్లొక గడియ కాలము గడచునప్పటికి దరిదాఁపు డెబ్బది యేండ్ల ప్రాయముగల యొక వృద్ధుఁ డచ్చటికి వచ్చి ''నాయనా, పగటి రెండవ జాము ముగియ వచ్చినది. ఈ మధ్యాహ్నమునఁ బూజ ప్రారంభించినఁ గాని మూఁడవ జామునకుఁ గార్యకలాపము

ముగియదు. ఇదేమి! ఇప్పు డేదో చిత్రరచన చేయుచున్నట్లు న్నావు.'' అనెను.

''నాయనా! ఈ మహానుభావుఁడు మన పరమ గురు పాదులు బమ్మోజు శిల్పాచార్యుఁడు. ఆయన మూర్తిని జిత్రింపవలయునని నిన్ననే పని మొదలుపెట్టితిని. ఇంక కొంచెము కొదువ యుండఁగా నిప్పుడు తీర్చుచున్నాను. విశ్వకర్మభగవానునితోఁ బాటీ కలియుగ విశ్వకర్మనుగూడ నర్చించి నేనును మన శిష్య శిల్పిగణమును కృతార్థులము కావలయు నని నా వాంఛ.'' అని జక్కణాచార్యుఁడు తన చిత్రరచనోద్దేశ్యమును దండ్రికి కెఱింగించెను. కుమారుని యీ మాటలకు నాగలింగస్థపతి యెంతయు నలరెను. ప్రాచీనాచార్యుల యెడ తనయునకుఁ గల భక్తి గౌరవముల కాయన సంతోషపడినాఁడు. అతని కను లానందబాష్ప స్విన్నము లాయెను. ఆతఁడు తనయుని సమీపించి తల నిమిరి రెండు మూడు కన్నీటి బిందువులతో నాతని శిరస్సును దడిపెను.

జక్కణాచార్యుఁడు నాగలింగస్థపతి యేకైకపుత్రుఁడు. ఆయన పుట్టిననాఁటిపేరు విశ్వకర్మస్థపతి. కన్నడదేశమున సుప్రసిద్ధి నందిన శిల్పిబ్రాహ్మణ కుటుంబము వీరిది. వేద ప్రసిద్ధుఁ డగు ప్రత్నబ్రహ్మఋషి వీరి గోత్రకర్త. ఈ కుటుంబము వారు మొదటినుండియు మంత్రశాస్త్రమున సాటిలేని వారని పేరందిరి. మంత్రశాస్త్రములో దక్షిణాచారము, వామాచారము నని రెండు సంప్రదాయములు గలవు. అందు

దక్షిణాచారమున కీ వంశము పట్టుఁగొమ్మ యయినందున వీరికి దక్షిణాచారమువారనియు, దక్షిణాచార్యులనియుఁ బ్రసిద్ధి తరతరములనుండి కలిగినది. ఈ వంశములోని ప్రతి శిల్పికిని దక్షిణాచార్యబిరుద ముండును. విశ్వకర్మస్థపతి తన పదిరెండవయేటనే బాలాత్రిపురసుందరి నుపాసించి, తద్దేవి సాక్షాత్కారము నంది శ్రీవిద్యాసిద్ధిచేఁ బ్రకాశించినాఁడు. అందుచే విశ్వకర్మస్థపతి యను పేరికంటెను మంత్రోపాసనా మహిమనుబట్టి దక్షిణాచార్యనామమే లోకములో నాతనికి రూఢి యయ్యెను. దక్షిణాచార్యుఁడు సామాన్య జనోచ్చారణములో జక్కణాచార్యుఁ డయినాఁడు.

జక్కణాచార్యుఁ డసమాన మేధాశాలి. ఆడుచు పాడుచు నాతఁడు తండ్రిగారి శిల్పవిద్యా గురుకులముననే వేదాది విద్యలు నేర్చుకొనినాఁడు. శిలాశిల్పము, చిత్రకళ, వాస్తువిద్య, ఆలయాదిరచనము, నగర నిర్మాణము నాతనికి వెన్నతోఁ బెట్టిన విద్యలుగా నలవడినవి. ఆతఁ డెఱుంగని శాస్త్రము లేదు. ఆతని వలవని కళ లేదు. చతుష్షష్టి కళలలో నాతఁడు సిద్ధహస్తుఁడు. మంత్రశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము నాతనికి మిక్కిలియు నభిమాన పాత్రములు. ఈ విద్యా కర్మసిద్ధులకుఁ దగిన ట్లా యాసుగుణములును ఆతనిని వరించినవి. ఆతఁడు పితృభక్తిలో శ్రీరామచంద్రుఁడో, భీష్ముఁడో! తా నిన్ని కళలలో నింత దిట్టయైనను గర్వ మన్న దాతనికి లేనే లేదు. ఇరువది యైదేడులు నిండీ నిండకమునుపే యింతవాఁడైన కుమారునిఁ గాంచి యే తండ్రి

హృదయ ముప్పొంగదు! ఈ సంపదకంతటికిని దగిన ట్లా శిల్పికి దగిన భార్యయు దొరకినది. సౌపర్ణీదేవి హైందవ సతీమతల్లు లగు సీతా సావిత్రీ చంద్రమతులఁ బోలిన సాధ్వీలలామ. విద్యాబుద్ధులందును, శీలసంపదయందును ఎట్టిలోటును లేనిది. ఆ యాల్మగల దాంపత్యము పూవుఁ దావులవలె శోభించు చుండును. ఆ యువదంపతులు పచ్చపచ్చగా, ముద్దుముద్దుగా గృహస్థధర్మమును నిర్వహించుట వృద్ధాచార్యునకుఁ గనుల పండువు; మనోమోదము. కాని యిట్టి సత్పుత్రుని గని యాతని యభ్యుదయమును కనులారఁ గాంచ నోఁచక మర ణించిన తన ధర్మపత్ని తలఁపునఁ దోఁచినపుడెల్ల నాగలింగస్థ పతి కన్నులు చెమర్చుచుండును. అపుడాయన ఒండు రెండు కన్నీటి కణాలు జారవిడుచును.

నాఁడు చిత్తానక్షత్రముతోఁ గూడిన పూర్ణిమా భాను వారము. చిత్తానక్షత్ర మా పూర్ణిమనాఁడు వచ్చుటచేతనే యా మాసము చైత్రమైనది. చిత్తకు అధిదైవతము విశ్వకర్మ. ఆ కారణముననే చైత్ర పూర్ణిమనాఁడు విశ్వకర్మజయంతి జరుపుదురు. ఆ పూర్ణిమ సూర్యుఁ డధిదైవతముగాఁ గల యాదివారమునాఁడు వచ్చుటచే దాని ప్రాశస్త్య మింకను రెట్టించినది. ఆ నాఁ డొక్క కర్ణాటమునందే కాదు. ఆంధ్ర, కళింగ, చోళ, పాండ్య, కేరళాది దేశములందును ఉత్తర భారతమునందును విశ్వకర్మ జయంత్యుత్సవములు మహా వైభవముగా జరుపుచుండెడివారు. దేశము నలుమూలలం గల శిల్పాచార్యులు, చిత్రకారులు, వడ్రంగులు, కర్మారులు,

కాంస్యకారులు, కుంభకారులు, వస్త్రకారులు వారు వీరన నేల కళారాధకులగు నెల్ల శిల్పులును, చేతిపనులచే జీవించు జను లందఱును విశ్వశిల్పి యగు విశ్వకర్మభగవాను నారాధించి తమ శిల్పకళాయోగమును బెంపొందించుకొనుచు జన్మములను సార్థక మొనర్చుకొందురు.

శిల్పకళారాధకులును, కర్మకళాపోషకులును నగు హొయసలరాజుల పరిపాలనములో విశ్వకర్మజయంతుల వైభవము చెప్పఁ దరము గాదు. పల్లీ పట్టణములం దెల్లెడల వాడవాడల ఇంటింట ఆ జయంతి మహోత్సవములు నానా విధముల జరుగుచుండును. కళాకారులు కళాదేవుఁ డని యా భగవాను నారాధించుచుండ, భక్తులు, ఉపాసకులు, సాధకులు, వేదాంతులు, జ్ఞానులు ఆ భువనశిల్పి మోక్షప్రదాత యనియు సృష్టిరహస్య జ్ఞానదాయకుఁ డనియు నారాధించి తరింపఁ జూతురు. ఇట్లా విశ్వకర్మజయంతి సర్వమానవులకును ఆచరణీయమగు గొప్ప పండుగగాఁ బరిణమించెను. శైవ వైష్ణవాది హైందవ మతశాఖల వారే గాక, బౌద్ధ జైనాది మతముల వారును ఆ యుత్సవములో పాల్గొని ఆ దేవదేవుని యనుగ్రహము నంది ధన్యు లగుచుందురు. ఇది యెంతయో యుక్తము. ఏ సృష్టి కర్తయొక్క సంతానముగా జీవరాశి భూమిపై నవతరించెనో, ఆ జగత్పిత నారాధించుటకు మానవులు కల్పించుకొన్న క్షుద్ర భేదములను బాటించుట యజ్ఞానము గాదా! కావున నాఁటి విశ్వకర్మజయంతి ఆబాల గోపాల మొక గొప్ప పండుగయై యొప్పుటలో వింత లేదు.

పదునైదు గడియల ప్రొద్దెక్కినప్పటికి భగవత్పూజ ప్రారంభించినారు. అనంతకీర్తిస్థపతి ప్రధానాధ్వర్యుఁడుగా వేదమార్గమున నాలయములో గాయత్రీ విశ్వకర్మల పూజా కార్యము సాఁగుచున్నది. శాంతలాదేవి సమర్పించిన నవరత్న స్థగిత మకుటముతో గాయత్రీమాత శిరస్సు నలంకరించిరి. పాండ్యభూపాలుఁ డంపిన సువర్ణపాదుకలతో విశ్వకర్మేశ్వరుని పాదారవిందములను భూషించిరి. ఇంక తక్కిన రతనాల హార ములతో బంగరు సరిగంచు పట్టువస్త్రములతో దేవతా మూర్తుల నలంకరించినారు. హోమములు, జపములు, సహస్ర నామార్చనలు, షోడశోపచారపూజలు జరిగిపోయినవి. మంత్ర పుష్పానంతరము సౌపర్ణీదేవియు జక్కణాచార్యుఁడును వృద్ధా చార్యుఁడగు నాగలింగస్థపతికి సాష్టాంగ నమస్కారము లాచరించినారు. ఆయన తన మనోవాంఛ నెఱిఁగించు చున్నాఁడో యనునట్లు "సుపుత్రావాప్తి రస్తు" అని దీవించెను. ఆ యాశీస్సునకు సౌపర్ణి చెక్కిళ్ళలో మధుర లజ్జాంకూరము తారాడినది. ఇంతవఱకును "విద్యాభివృద్ధి రస్తు." అని యాశీర్వదించు తండ్రి కళత్రవంతుఁడగు తన్ను ఆ నాఁ డట్లాశీర్వదించుటచే పితృహృదయమును జక్కణా చార్యుఁడు గుర్తించినాఁడు. కాని ఆతని మోములో మాత్రము అలఁతి యని చెప్పుటకును వీలుగాని మృదుతర మందహాస లేశముతో నొప్పు గంభీరముద్రయే తళ్కొత్తినది. తరువాత తక్కిన శిష్యులును వృద్ధాచార్యునకు నమస్కరించి దీవెన లందుకొనిరి. పిమ్మటఁ దండ్రి యనుమతిపై విశ్వకర్మస్థప

ఛాత్రగణమునకును దక్కిన శిల్పిలోకమునకును నిట్లు సందేశ మొసంగెను.

"సోదరులారా! శిల్పముయొక్కయు, శిల్పియొక్కయు పవిత్రోద్దేశ్యమును మీా రెన్నఁడును మఱువవలదు. ఈ విశ్వకర్మ జయంతి మనలను స్వధర్మపరాయణులను జేయుటకే యని గుఱుతుంచుకొనుఁడు. జగత్పితయగు విశ్వకర్మ యెట్లు విశ్వశిల్పమును వెలయించుచున్నాఁడో, అట్లే ఆతని సంతానమగు మనమును లోకకల్యాణ కాంక్షతో ప్రజాహితైక వాంఛతో శిల్పయోగమును నెఱపవలయును. యెట్టి స్థితిగతులయందును స్వార్థపరుఁడును, భోగలాలసుఁడును గాఁగూడదు. కుల మత భేదముల కతీతుఁడై రాగ ద్వేషములు లేక మెలంగవలయును. జగచ్ఛిల్ప తత్త్వజ్ఞుఁడును విశ్వకర్మ పరాత్పరారాధకుఁడును నగు శిల్పీశ్వరుని దృష్టి యెంతయో విశాలమైనది. లోకమున నెన్ని మతము లుదయించినను అవి యన్నియు నీ విశ్వకర్మ తత్త్వమున అంతర్భూతములు గావలసినవే. ఆయా మతములతో శిల్పతత్త్వజ్ఞున కెట్టి విరోధమును లేదు. మీాఁదుమిక్కిలి వాని నెల్ల శిల్పవేత్త ఆత్మ సంతానములుగనే భావించి ప్రోదిసేయుచుండును. ఈ విషయమున మన పరమ గురుపాదులు బమ్మోజు శిల్పాచార్యులే మన కాదర్శప్రాయులు. ఆయన జైన, బౌద్ధ, వైదిక శిల్పములను వెలయించి ఆయా రాజవరేణ్యులచే ఘనస్తుతు లందినాఁడు కదా. తుట్టతుదకు తాను నిర్మించిన దేవతామూర్తికే నేత్రోన్మీలన సంస్కారము చేయుచు సమాధిదశలో తద్దేవతా

సాక్షాత్కారము వడసి మోక్షప్రాప్తుఁ డయినాఁడనియు మీ రెల్ల రెఱిఁగియే యున్నారు.

మన ఈ శిల్పకళ ఇంద్రియ సంతృప్తిని సంపాదించునది మాత్రమే కారాదు. బాహ్యేంద్రియ సంతర్పణముతోఁ బాటు మానవుని మానసికాభిరుచులను సంస్కారములను ఉన్నత స్థాయికిఁ గొంపోయి పరమాత్మ సాక్షాత్కారమున కిది సాధనమైననాఁడే శిల్పికిని, శిల్పమునకును, లోకమునకును కృతకృత్యత గల్గును. కావున విస్మృతమగు శిల్పహృదయమును మీ రవగతము చేసికొనుటకు నిరంతరము ప్రయత్నింపుఁడు. నేఁటి వివిధ మత, సాంఘిక, రాజకీయ పరిణామములకును జన సమూహములోని సామ్య వైషమ్యములకును లోఁబడక మేరు ధీరులై మీరు మీకర్తవ్యమును నిర్వహించుచు ధన్యులు కావల యును. మన దేశమున శిల్పకళలును, చేతి వృత్తులును ప్రజల కందఱి కాచరణీయములై వారి కుటుంబములను సంపదతోఁ దులఁదూఁగఁ జేయవలయును. అట్లైననాఁడే దేశము సుభిక్షము కాఁగలదు.''

పిమ్మట జక్కణాచార్యుఁ డా యా రాజులంపిన వస్త్రాభరణా ద్యమూల్య వస్తువులను పూజాకార్యమున మిగిలిన వానిని బీదలకును, అనాథులకును, సాధులకును దానము చేసి వేసెను.

నాగలింగస్థపతి దొక మహా శిల్పవిద్యా గురుకులము. బమ్మోజు శిల్పాచార్యుని గురువగు పదోజుస్థపతి నాఁటి

నుండియు దానికి సుప్రసిద్ధి యున్నది. నాగలింగస్థపతి జన్మ స్థానము కై దాళగ్రామము. అది రాజధానికి మిక్కిలి దూరమం దుండుటచేత జక్కణాచార్యుఁడు పుట్టిన పిమ్మట నాతఁడు తన శిల్ప గురుకులముతోఁ గూడ స్వనివాసమును హాసన్ నగరమునకు మార్చెను. ఆ స్థపతివర్యుఁడు తన కాలమున ఆ యా దేశముల యందలి రాజాస్థానములలో శిల్పకళా కౌశలమును వెలయించి సంపాదించిన ధనరాశులు, భూములు, అగ్రహారములు మున్నగు సంపద యెంతయో యున్నది. ఆయన గురుకులమునం దెప్పుడు చూచినను వందల సంఖ్యలో శిల్పులు శిక్షణ మందుచుందురు. ఒక్క శిలా శిల్పమే కాదు. అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణ శిల్పము లైదును, చిత్రకళాది విద్యలును, తక్కుంగల యుప శిల్పకర్మ లును, ఆ యా చేతిపనులును ఆ శిల్పవిద్యాలయములో నా యా శాఖలుగా విభజింపఁబడి నేర్పఁబడు చుండును. ఈ కళల యభివృద్ధికి రాజులయు, ధనవంతులయు, ప్రజలయు తోడ్పాటు పోషణమును వలసినంతగా లభించుచుండెడిది.

ఇట్టి సంపన్న కుటుంబములోఁబుట్టిన జక్కణాచార్యున కేమి లోటుండును! దానికిఁ దోడాతనికి ధనాశ లేశమును లేదు. తన విద్యను, ధనమును, కళాకౌశలమును లోకారాధ నమునకు ధారవోసి ప్రజాక్షేమమును సంపాదించుటే యాతని యాశయము. ఆతని యభిప్రాయమును బలపఱుచు కళత్రమే ఆయనకు దొరకినది గదా! రతిమన్మథులను బోలిన ఆ దంప తుల నడత, సౌశీల్యము, సుగుణములు, ప్రజాసేవానురక్తి,

భూతదయ, విద్యాప్రబోధము, మతాచార పరాయణత పౌరుల కొజ్జబంతులై వెలయుచుండెడివి. నగరములో నెవరికే సహాయము కావలయునన్నను, ఎవరికే సందేహములు తీఱవలయునన్నను, ఎవరికే శుభముహూర్తములు నిర్ణయింపఁబడవలయు నన్నను ప్రతి దానికిని జక్కణాచార్యుని యిల్లే శరణము. వైద్యము, జ్యోతిషము, వాస్తువు, శిల్పము, ధర్మప్రబోధము గృహనీతి మొదలగు ననేక విషయములకు వీరి భవనము క్రీడారంగ మగుటచేతను, ఆర్జించిన ధనరాశులు బీదసాదుల సాయమున కుపయోగించు నౌదార్య ముండుటచేతను వీరి భవనము ఆశ్రిత కల్పవృక్షమై యొప్పినది.

ఈ వంశమున కున్న పూర్వప్రసిద్ధినిబట్టియు, జక్కణాచార్యుని కళాప్రతిభలనుబట్టియు నాతని తమ తమ యాస్థాన శిల్పాచార్యునిఁగా జేసికొనవలయు నని నాఁటి రాజులు చూచుచుండిరి. కాని అది యాతని కిష్టము కాదు. ఆతని మాతృభూమి కన్నడదేశము. అందును రాజధాని కనతి దూరమున నే గల హోసల పట్టణ మందే యా యాచార్యుని శిల్పవిద్యా గురుకులము తేజరిల్లుచున్నది. తన జన్మభూమిని, తన దేశపు రాజును గాదని ఆతఁ డన్యుల నెట్లాశ్రయించును? ఒకరి యాస్థానమున నుండుటే యాతని కిష్టము కాదు. తాను స్వతంత్రుఁడై యెవ్వరి కేపను లక్కఱ యైన వాని నెఱవేర్చుచుండుటే యాతని కిష్టము. జక్కణ్ణ యీ సంకల్పమున కనుకూలముగనే నాఁటి మత రాజకీయ స్థితిగతులు నుండెను. చోళాది మండలములలో శైవ వైష్ణవాది మతములును,

కన్నడమున వీరశైవ జైన బౌద్ధ మతములును ప్రజాదరణ పాత్రములును రాజాదరణపాత్రములును నై యొప్పుచున్నవి. ఇట్టి స్థితిలో ఏ పక్షమును వహింపక కూటస్థునివలె వారి వారికి తగు మార్గములు చూపుటే సమన్వయ వాది యగు నా శిల్పి మార్తాండునకు కర్తవ్యముగాఁ దోఁచెను. చరిత్రనుబట్టి చూచినను జగత్పూజ్య మగు శిల్ప మెప్పుడు నొక మత పక్షము నవలంబింప లేదు. అన్ని మతముల వారికిని ఆరాధనీయ మైన దానినిగా సనాతన శిల్పయోగులు శిల్పమును బూజించుచు వచ్చిరి. వారి సంప్రదాయము నా యాదర్శ శిల్పాచార్యుఁ డెట్లు చెఱచును! దానికిఁ దగిన ట్లా వీరభల్లాళ భూపతియు మత దురభిమానము వీడి శిల్పము నొక దైవముగా నారాధింప దీక్షఁ బూని యున్నాఁడు. అట్లు సేయువారి ప్రయత్నములకుఁ జేయూఁత నిచ్చుట తన కర్తవ్య మనియు జక్కణాచార్యుని యెన్నిక.

౨

హిందూదేశమునఁ బుట్టి పెరిగిన మతములలో వేద మతమునకుఁ బిమ్మట జైన బౌద్ధములు మిక్కిలి పే రెన్నిక గన్నవి. జైన మతమును ఇరువది నల్వురు తీర్థంకరులు ప్రచారము చేసిరి. వీరిలో మొదటివాఁడు ఋషభదేవుఁడు. ఈతఁడు కోట్లకొలఁది సంవత్సరములు జీవించె నని జైన గ్రంథములు చెప్పుచున్నవి. ఇరువది మూఁడవ తీర్థంకరుఁడు

పార్శ్వనాథుఁడు. ఇరువది నాల్గవవాఁడు వర్ధమాన మహా వీరుఁడు. ఈతనినాఁటి నుండియే యీ మతమునకు భారత దేశమున సాటి లేని ప్రశస్తి చేకూరినది. బౌద్ధమును శాక్య వంశ క్షత్రియుఁడగు బుద్ధదేవుఁడు నెలకొల్పి ప్రచారము చేసినాఁడు. ఈ జైన బౌద్ధములు వేదములలోని హింసాత్మక యజ్ఞములను ద్వేషించుచున్నవి. అయినను అందలి సిద్ధాంత ములు అహింసా సత్య శమ దమాది సద్గుణ ప్రధానము లగుటచేతను, వర్ణభేదమును నిరసించుటచేతను జాలవఱకు ప్రజాసమూహములో వ్యాపించి వారి మనస్సుల నివి చూఱ గొన్నవి. సుప్రసిద్ధు లగు చంద్రగుప్తుఁ డేమి, అశోకుఁ డేమి ఈ మతముల నాదరించి అవలంబించి ప్రచారము చేసినవారే. క్రూరాత్ముఁడగు నశోకుఁడు బౌద్ధమత రసాయనమును ద్రావియే అపర బుద్ధుఁడో యనఁ దేజరిల్లినాఁడు.

ఆ యా రాజు లీ మతములను జేరఁదీసి పోషించుటచేత నివి వారి వారి సామ్రాజ్యములతోఁ బాటు నేల నాలుగు చెఱఁగుల వ్యాపించినవి. రాజావలంబనమే కాక, మహా ప్రభావసంపన్నులగు మతప్రచారకుల ప్రచార బలము గూడ వీనిని ప్రపంచవ్యాప్త మొనర్చెనని తెలియుచున్నది.

జైనమతము దక్షిణదేశమున వ్యాపించుటకు మూల ముగా నీ క్రింది గాథను జైనగ్రంథములును, శాసనములును జెప్పుచున్నవి. మహావీరుని నిర్వాణమునకుఁ బిమ్మట జైన మతాచార్య స్థానము నవలంబించినవారిలో భద్రబాహు వొకఁడు. ఇతఁడు మౌర్యచంద్రగుప్తునికి గురువు. ఒకనాఁటి

రేయి భద్రబాహువు స్వప్నములో పండ్రెండుతలలుగల సర్ప మును-బుసలుకొట్టుచు మీఁది కుఱుకుచున్నదానిని గాంచెను. తెల్లవారిన పిదప నాతఁడు భిక్షార్థమై యొక గృహస్థు నింటికిఁబోయి "భిక్షాం దేహి" యని పండ్రెండు సారులు యాచించెను. ఆయింట నొక్కరును వానికి భిక్షపెట్టువారు లేకపోయిరి. అంతట స్వప్నవృత్తాంతమును, విధివిలాసమును స్మరించుకొని భద్రబాహువు "మగధదేశము ద్వాదశ వత్సర ముల వఱకు క్షామదేవతకు నిలయముకాఁగల"దని శపించెను. పిమ్మట ఈ వృత్తాంతమును చంద్రగుప్తున కెఱిఁగించి, యాతని తోడను, ద్వాదశ సహస్ర శిష్యులతోడను దక్షిణాపథమునకు వచ్చి మతప్రచారము సేయఁబూనెనఁట. ఇట్లు క్రీస్తు పుట్టుటకు ముందే యుత్తరదేశమునఁ బుట్టి దక్షిణదేశమున వ్యాపించిన యీ మతమునకు ముఖ్యముగా తమిళ కన్నడదేశము లండ దండలై నిలిచినవి. కర్ణాటదేశములోని మహీశూర ప్రాంత మున ఆనాఁడు జైనమతము మూఁడు పూ లాఱుకాయలై విలసిల్లెనన్న నాశ్చర్యములేదు. చంద్రగుప్త భద్రబాహులు "శ్రావణ బెళగుళ" నగరము నునికిపట్టుగాఁ జేసికొని తపస్సు చేసి యచ్చటనే నిర్వాణ సంసిద్ధి నందిరి.

నాఁటినుండియు దక్షిణాపథము నేలిన పెక్కురురాజులు జైనమతావలంబులు. ద్వారసముద్రమును ప్రధాన రాజ ధానిగాఁ జేసికొని కన్నడ రాజ్యమును పాలించినవారిలో నీ హొయసల వీరభల్లాళుఁడు జైనమతమునకుఁ బట్టుగొమ్మ. ఈ బిట్టిదేవ వీరభల్లాళచక్రవర్తి దేవేరులలో శాంతలాదేవి,

సహజాదేవి, లకుమాదేవి అనువారు సుప్రసిద్ధలు. వీరిలో లకుమాదేవిని కీర్తిమతి యనియు నందురు. శాంతలాదేవి తన భర్త జైనుఁ డైనను తానుమాత్రము వైదికమతమును వీడ లేదు. వైదిక మత సూత్రము లామె హృదయమునకు నచ్చి నవి. సనాతనమగు వైదికమతముకంటె నాధునికములగు తర్కనమతములు కొన్ని క్రొత్త గుణములతో నలరారు చున్నను అవి ప్రశస్తములు గావని యామె యభిప్రాయము. అట్టి వైదికధర్మ దీక్షతో నామె హిందూమతములోని శివ కేశవాది దేవతలనే యారాధించుచు తపో, యజ్ఞ, దానాదుల నాచరించు చుండెడిది. ఈ సందర్భమున నీ విశేషము మాత్ర మెంతయో ప్రశంసనీయము. భార్యాభర్త లిట్లు భిన్న మతము లకుఁ జెందిన వారైనను. వారిలో నభిప్రాయ భేదములకుఁ దావు లేదు. ఐకమత్యమునకుఁ గొఱఁత లేదు. అనురాగ బంధమునకు అంతరాయము లేదు. ఎవరి కిష్టమైన మతమును వా రవలంబించుటలో విరోధము లేదని వారు లోకమునకుఁ జాటము సెప్పువారు. వా రే యే మతములలో నున్నను ఆచర ణము పరోపకార ప్రధాన మైనందున ఒకరి కొకరు వైరులు కాక జీవయాత్ర సాగింపఁ జాలిరి. కాని ఏ సమయమునం దైనను, ఏ సంఘటనము కారణముగా నైనను తన భర్తను వైదిక మతాసక్తునిఁగాఁ జేయవలయునని శాంతలాదేవి హృదయములో నభిలాషాంకురము లేకపోలేదు. అట్లే వీర భల్లాళుఁడును తన ప్రాణప్రియను దన మతములోనికిఁ ద్రిప్పుకొనవలయునని సమయమునకు వేచియే యున్నాఁడు.

ఈ త్రిప్పుకొనుటలు నిర్బంధముచేతను, దౌర్జన్యము చేతను గాదు. మనస్సులను సమాధానపఱచియు, అభిప్రాయములను స్వేచ్ఛగా మార్చుకొన నవకాశము నొసంగియునే. అట్లు కాక నిర్బంధముచేఁ గలిగిన మార్పు శాశ్వతకాలము నిలువఁ జాలదుగదా!

వీరభల్లాళుఁడు పరాక్రమశాలియు, ధర్మమూర్తియు, మతాచార పరాయణుఁడును, ప్రజానురంజకుఁడు నగు రాజ మాత్రుఁడే కాఁడు. విశేషించి కళాప్రియుఁడు. కళామార్గముననే ప్రజాసమూహమును మతపరతంత్రమును ధర్మోన్ముఖమును జేయవలయునను నభిలాష గలవాఁడు. కళ, ధర్మము, సత్యము, మతము, సిద్ధాంతములు అనునవి వేని కవి వేఱుగా నుండ రాదనియు, హృదయమును రంజింపఁ జేసి యానందమును గూర్చు కళతో నవి కలసి మెలసి యున్ననాఁడే కళా ప్రయోజనమును మానవులు పొందఁగలరనియు నా రాజ చంద్రుని తలంపు. ఈ సంకల్పముతోడనే యాతఁడు జక్కణాచార్యు నాస్థాన శిల్పిగా వరింపఁ జూచినాఁడు. ఆ చార్యుఁ డందు కంగీకరింపక పోయినను కేవలము గౌరవార్థ మాపదవి నాయన కొసఁగి యమ్మహాశిల్పిచే లోకోత్తర శిల్పములను వెలయింపఁజేయ దీక్ష పూనెను. అందుకే జక్కణాచార్యున కేమి, ఆయన శిష్యవర్గమున కేమి, తదితర స్థపతుల కేమి, వారి శిల్పశాలల కేమి యా భూపాలుఁడు చేసిన యుపకారములు, ఒసంగిన యీవులు, కల్పించిన వసతులు వందలో, వేలో! ఆ నాఁడు ఉలిని బట్టనేర్చిన ప్రతిశిల్పియు, రంగులో కుంచెను

ముంచఁజాలిన ప్రతి చిత్రకారుఁడును ఇనుపగజ్జెలతల్లిని నేలఁ బెట్టి కాల రాచి ధనవంతులైనారు. ఏ గోపురమునేని, ఏ దేవాలయమునేని, ఏ విగ్రహమునేని నిర్మింపఁజాలిన శిల్పి మాత్రుఁ డెల్లను కనకాభిషేకములలోను, బిరుదావళులలోను మునిఁగి తేలెడువాఁడన్న నా రాజశిఖామణి కళారాధనాసక్తి యెట్టిదో యూహింపుఁడు. ఏ క్రొత్తను గనిపట్టిన పనివానికైనను, ఏ శిల్పశాస్త్రమునకు నూతనవ్యాఖ్య చెప్పు నాచార్యునికైనను భల్లాళరాజు కొలువు క్రీడారంగము. ఆయన దేశము మూలమూలల వెదకి వెదకి శిల్పిచంద్రుల రప్పించుకొనును. వారికి బొక్కసములోని రొక్కమును వెచ్చించి గౌరవభృతులను గల్పించి క్రొంగ్రొత్త శిల్పకల్పనములఁ జేయించును.

ఆ నాఁటికే హొయసల రాజ్యమునకు చుట్టుప్రక్కల నున్న దేశములలో శిల్ప కల్పలత పూచి కాచి పండిపోవ సిద్ధముగా నున్నది. పల్లవరాజులు కాంచి మున్నగు ప్రదేశములలో నద్భుత దేవాలయ గోపురములను నిర్మింపఁ జేసిరి. పాండ్యులు మధుర శ్రీరంగము మున్నగు తావుల మత శిల్పములను బెంపొందించిరి. చోళభూపాలురు సుప్రసిద్ధులై తంజాపురాదుల శిల్పదేవి పాదవిన్యాస పవిత్రములఁ జేసికొనిరి. ఇంకను మహాబలిపురములోని పంచపాండవుల ఏక శిలా రథములు, అరుణాచలములోని మండపాదులు దేశ దేశాంతర ప్రసిద్ధములై యాత్రికులకు విహార రంగములాయెను. ఇఁక తెలుఁగునాఁడును గూర్చి ప్రత్యేకము చెప్ప

వలసినదే లేదు. అమరావతీ నాగార్జునకొండల శిల్పము లత్యద్భుతములై యాంధ్రుల కీర్తిస్తంభములై ప్రకాశించు చుండెను. చాళుక్య శిల్పపు గొప్పఁదనము చెప్పనలవిగానిదై యొప్పు చుండెను. అప్పుడప్పుడే తలయెత్తుచు కాకతీయ శిల్పుల శిల్పలక్ష్మి దక్షిణమునకును బారాడఁ జొచ్చినది. ఇట్లా నాఁటికి వెలసిన శిల్పసంపద సహజ కళాప్రియుఁడగు భల్లాళరాజు మనస్సును శిల్పోన్ముఖము చేయుటలో వింత లేదు. ఏ విషయమునందును ప్రేలఁ జూపించుకొనని హొయ సలరాజ్యము శిల్పకళాప్రాభవమున వెనుకఁబడి యుండు టాతఁడు సహింపఁగలఁడా!

కావుననే తాను రాజ్యమునకు వచ్చిన తొలినాళ్ళ లోనే ధర్మపత్ని యగు సహజాదేవి ప్రేరణముచేత హాసను నగరమునకు సమీపమునఁ గల పవిత్రక్షేత్రమగు దొడ్డగడ్డ పల్లిలో లక్ష్మీదేవాలయమును నిర్మింపఁజేసెను. నల్లోజు, మణి యోజు అను శిల్పాచార్యులు నాగలింగస్థపతి యాజమాన్య మున జక్కణాచార్యునితోఁ గలసి యా చతుర్మండప దేవా లయమును గట్టినారు. వీరభల్లాళుఁ డీ దేవళమున శైవవైష్ణవ మతములకుఁ జెందిన గాథలను మూర్తులను జెక్కించి తన హరిహరాభేదదృష్టిని జాటుకొనినాఁడు. జగదాశ్చర్యకరమగు నీ లక్ష్మీదేవాలయము కారణముగా దొడ్డగడ్డపల్లి అభినవ కొల్లాపుర మని ప్రసిద్ధిగన్నది. తాను రాజైన పిమ్మట తొలిగాఁ జేసిన యీ లక్ష్మీపూజ యాతని రాజ్య విస్తృతికి, సంపత్సమృద్ధికి నాందియై యాతని భగవద్విశ్వాసమునకు

పాదు చేసినది. అయినను జైన శిల్పములను నిర్మింపఁజేయు వాంఛ యాతని కగ్గలముగాఁ గలదు.

ఇంతకుముందే దరిదాఁపు నూటయేఁబది వత్సరముల నాఁడు చాళుక్య వంశీయుఁడగు చాముండరాయలు కొన్ని జైనశిల్పముల కంకురార్పణము చేసియున్నాఁడు. ఆ మహాను భావుని కృతులు కొన్ని యింకను కడ ముట్టలేదు. అట్టి వానిని కొనసాగించుట తన కర్తవ్యమని భల్లాళనరేంద్రుఁడు తలఁచెను. తన కిష్టమగు జైనమతమును విస్తరింపఁ జేయు టకుఁ గూడ నీ శిల్పకళనే ప్రధాన సాధనముగాఁ జేసికొన నాతఁడు నిశ్చయించుకొనెను. ఆ జైనశిల్పములును సాటి లేనివై హిందూదేశపు కళాభిమానులనే కాక, ప్రపంచ కళా రాధకులనే యాకర్షించునవి గావలయును. అట్లయిననాఁడే కదా ఆ మతమును, ఆ మతశిల్పములును చిరస్థాయులు కాఁగల్గునది.

మైసూరు రాష్ట్రములోని జైనక్షేత్రములలో నెంతయు ప్రశస్తిగన్నది శ్రావణ బెళగుళము. ఇది మొదటినుండియు సుప్రసిద్ధ జైనతీర్థమై వన్నెకెక్కినది. దక్షిణాపథమున నింతటి జైనక్షేత్రము మఱొక్కటి లేదనుటాశ్చర్యము కాదు. పెక్కురు జైనాచార్యు లీ తావును మెట్టి తమ మతమును బ్రచారము చేసియున్నారు. వేలకొలఁది మతప్రచారకులు నుపాసకులు నిచ్చటి కరుదెంచి తపోయోగముల ననుష్ఠించి ధన్యులయినారు. చంద్రగుప్త సార్వభౌముఁడు సైతము తన యవసానకాలమున నీ క్షేత్రమునందుండి యనుష్ఠానము నడపి తన జీవమాలిన్యములను గడిగికొని కృతార్థుఁ డయినాఁడని

చెప్పికొంటిమిగదా! ఆ మహాసమ్రాట్టు నివసించిన యొక చిన్నకొండ నాఁటినుండియు చంద్రగిరి యని ప్రసిద్ధమైనది. దాని కెదురుగనే యింద్రగిరి యని మఱియొక కొండ గలదు. నాఁటికిని నేఁటికిని ఉత్తర హిందూదేశమునుండి వచ్చు జైన యాత్రికుల కీ శ్రావణబెళగుళము దర్శనీయమగు దివ్య క్షేత్రము.

ఇట్లు సుప్రసిద్ధిగాంచిన యింద్రగిరిమీద అలనాఁడు చాముండరాయలు గోమటేశ్వరుని జెక్కింపఁ బూనినాఁడు. ఆనాఁటి సుప్రసిద్ధ శిల్పాచార్యుఁడు బమ్మోజు. ఆతఁడు హోలాలుపట్టణమున అమరేశ్వరాలయము నత్యద్భుతముగాఁ దీర్చి మహారాజుచే "కలియుగ విశ్వకర్మ" బిరుదము నంది సత్కరింపఁబడినశిల్పిసత్తముఁడు. ఆయమరేశ్వరాలయములోని శ్రీకరస్తంభ శిల్పములు సాటిలేనివి. అవి యానాఁటి హైందవ శిల్పకారుల దృష్టి నాకర్షించి పొగడ్త లందినట్టివి. బమ్మోజు శిల్పాచార్యుఁ డింకను పెక్కు శిల్పములను క్రొత్తగా సృష్టించిన కళాబ్రహ్మ. అట్టి మహనీయుఁ డీ గోమటేశ్వర మహామూర్తి నిర్మాణమునకుఁ బూనుకొనెను. ఈ ప్రతిమ అఱువది యడుగుల యెత్తు గలది. మూర్తి యంతయు దిగంబరముగా నుండును. ఇరువది గజముల యీ విగ్రహము నా కొండ కొనను బగులఁగొట్టియే బమ్మోజును, ఆయన శిష్య వర్గమును నాఁడు నిర్మింపఁబూనిరి. చాముండరాయల హఠాన్మరణము కారణముగ నా కాలమునఁ బొటమ్రిన మతవిప్లవ మీ శిల్ప

నిర్మాణమును బూర్తిగాకుండఁ జేసెను. అది వీరభల్లాళుని కాలమువఱకు నట్లే పూర్తికాక నిలిచెను.

ఇట్టి శ్రావణబెళగుళ క్షేత్రము జైనశిల్ప కళారంగము కావలయునని భల్లాళుఁడు సంకల్పించినాఁడు. ఆయన సంకల్పమును నెఱవేర్పఁగల శిల్పికులసార్వభౌముఁడు జక్కణాచార్యుఁడును ఆ భూపాలునకు లభించెను. ఇఁక కొఱఁత యేమి! శ్రావణబెళగుళములోని యింద్ర చంద్రగిరు లేమి, తక్కుంగల చిన్నచిన్న తిప్ప లేమి, పట్టణ పరిసరము లేమి, అంతర్భాగము లేమి, మాఱుమూల లేమి, దివ్యశిల్పములతో తేజరిల్లి పోయినవి. పాలఱాతి విగ్రహములు, నల్లఱాతిప్రతిమలు కొన్ని నిలువెత్తువి, మఱికొన్ని రెండు నిలువులవి కొలఁది కాలముననే ప్రతిష్ఠితము లయినవి. అంతలేసి విగ్రహములకు ఆలయములు గూడ నిర్మితము లయినవి. ఆలయములను ముందుఁగట్టి అందీ విగ్రహములను జెక్కి చేర్చిరా? లేక విగ్రహములనే ముందు తీర్చి వానిపై నాలయముల నిర్మించిరా? ఏమో! ఈ రహస్య మా మహాశిల్పులనే యడుగవలయును. చంద్రగుప్త నివాసముచేత చంద్రగిరి యన నొప్పిన కొండమీఁద శాంతినాథ, పార్శ్వనాథ, భారతేశ్వర, భద్రబాహు, చంద్రగుప్త, చాముండరాయాది మహనీయుల మూర్తులు ఇరువదికి పైగాఁ దీర్చినారు. ఆ విగ్రహముల సౌందర్య మింతింత యని వర్ణింపఁజాలము. అన్ని విగ్రహములును ఉత్తమపురుష లక్షణములతో నొప్పునట్టివే.

తరువాత జక్కణాచార్యుఁడు తన పరమ గురుమూర్తి ప్రారంభించిన గోమటేశ్వర మూర్తిని స్వర్గ సౌందర్యమందు రూపెత్తునట్లు తీర్చి దిద్దినాఁడు. గోమటేశ్వర ప్రతిమ యింత పెద్దదైనను అందచందాలలో నెక్కడను కొఱఁత లేదు. కాలుసేతులు మున్నగు నవయవములు శిల్పశాస్త్ర లక్షణాను సారులై సౌందర్యము నొలకఁబోయుచున్నవి. విగ్రహములో శాంత సౌందర్య రసములు వెల్లివిరియు చుండును. ముద్దులు మూటగట్టు నా మొగము, ఆ అందాల పెదవులు, ఆ విశాల ఫాల తలము, ఆ కనుబొమలు, ఆ గడ్డము, ఆ ఊరియున్న బుగ్గలు ఎంత దివ్య సౌందర్యమును బుణికిపుచ్చు కొన్నవో చూచిననేగాని తీఱదు. ఈ మహామూర్తికి చుట్టును ఆ కొండ ఱాతిలోనే చిన్న చిన్న ఆలయములవంటి వేర్పఱచి, వానిలో జైన తీర్థంకరులను, జైనమత చారిత్రక పురుషులను బ్రతిష్ఠించి నారు. దరిదాఁపు పదిగజముల వఱకును ఈ భవనముల మీఁదుగా నెక్క వీలు గలదు. అంతవఱ కెక్కినచో గోమ టేశ్వరస్వామి పిఱుదులవఱకు వెళ్ళగలము. ఇట్లు లోకము దృష్టి నంతయు నాకర్షింప నా మహాశిల్పి లీ విగ్రహమును జెక్కియున్నారు. సరియే! యింత పెద్దవిగ్రహమునకుఁ బూజారాధనము లెట్లు చేయుట? నిత్యమును పాదపూజ మాత్రమే జరుగవలయును. పదిరెండేండ్ల కొకసారి హస్త, కటి, శిరఃపూజలు జరుగవలయును. ఇది యా మహా వైదిక శిల్పాచార్యుఁడు చేసిన నియమము. నాఁటికిని నేఁటికిని గోమటేశ్వరునికి ద్వాదశవర్షముల కొక్కసారియే శిరఃపూజ. దానినే మహామస్తకాభిషేకోత్సవ మందురు.

## 3

శ్రావణ బెళగుళములోని శిల్పకళావైభవమునకు దేశములో గొప్ప పరివర్తనము గలిగినది. కన్నడ దేశమునకీ శిల్పసంపద క్రొంగ్రొత్త. ఉత్తరదేశమున సాంచీసార్నాథములందును, అజంతా, ఎల్లోరా మున్నగు తావులయందును దివ్యమగు హిందూ బౌద్ధ శిల్పకళ వెలసినదనియు, అది యంతయు లోకోత్తరమగు శిల్పసౌందర్య క్రీడ యనియు దక్షిణాపథ వాసులు కథలు, గాథలు, వార్తలు వినియే యున్నారు. కాని చూచినవారి సంఖ్య చాల తక్కువ. "అలనాఁ డుత్తరమున బౌద్ధశిల్పము తల యెత్తగా, నేఁడు దక్షిణమున జైనశిల్పము కొనలు చూచినది. అఱువది యడుగుల యేకశిలా విగ్రహము నెన్నఁడైన గంటిమా! వింటిమా! ఈ నాఁడు మహా కళారాధకుఁడగు భల్లాళుని యౌదార్యము చేతను, అపర విశ్వకర్మయగు జక్కణాచార్యుని చేతి చలువ చేతను గుహల నిదురించు నీ బొలకు రూపురేక లేర్పడి జీవములు నిలిచినవి. ఆహా! వీరభల్లాళ నరేంద్రుఁడు భూలోకమును సౌందర్యపులకితము చేయఁ బుట్టిన మహనీయుఁడు. ఆతఁ డవలంబించిన జైనమతముగూడ నొక గొప్ప మతమే. ఆ మతమును వ్యాపింపఁజేయు నీతఁ డా మహావీరుని యవతారమా?" అని ప్రజలు పలురీతులఁ దలపోయుచు జైనమతమువైపునకు మొగ్గఁ జూచుచుండిరి. ప్రజలమాట యెట్లున్నను తన ప్రియ పత్నిని శాంతలాదేవిని ముందు జైనమతములోనికి మఱలించు

కొను టాయన ముఖ్యోద్దేశ్యము. "చిన్నభార్య కీర్తిమతి వలె శాంతల గూడ జైనములోనికి వచ్చిన నెంత బాగుం డును! తన దేవేరియే మతమును మార్చుకొనకున్న ప్రజ లెట్లు మాఱుదురు? ఇందుకు మొదటగా రాజ్ఞీ మనఃపరివర్త నమును సంపాదింపవలయును."

ఒక నాఁటి సుప్రభాతమున శాంతలా వీరభల్లాళు లిద్ద ఱును సముచితపరివారముతో శ్రావణబెళగుళమునకు విచ్చే సిరి. భూపాలుఁడు దూరమునుండియే దర్శనమిచ్చు గోమటే శ్వరుని దివ్యమూర్తిని శాంతలాదేవికిఁ జూపినాఁడు. అప్పుడే యామె యబ్బురంపడినది. ఇంతవఱ కామె యా మూర్తిని జూడలేదు. చూడకుండుటకు అది పూర్తికాకుండుటే కారణము. "ఇంత యెత్తైన కొండ నేమి! అగ్రమును బగుల గొట్టి యందే యఱువది యడుగుల విగ్రహమును సృష్టించు టేమి! ఇది మానవులకు సాధ్యమగు పనియా? ఆ శిల్పా చార్యుఁడు దైవాంశసంభూతుఁడు కావలయును. లేకున్న నే దేవతనో చిరకాల మంత్రోపాసనచేతఁ గైవసము చేసికొన్న మహాపురుషుఁడు కావలయును. అట్లు కాదేని యింతటి లోకోత్తర శిల్పము నెట్లు సృష్టింపఁ గల్గును! ఱాలకు నిద్రా వస్థ యున్నదనియు, అప్పు డవి మైనపు టుండలవలె మెత్తనై పోవు ననియు జనులు చెప్పుచుందురు. ఆ శిల్పి శిలల నిద్రా జాగరముల నెఱింగినవాఁడై నను గావలయును. అంత పరిజ్ఞాన మాతని కుండవలయునన్న నాతఁ డెంత శాస్త్రవేత్త కావలయును!" ఇట్లు తలపోయుచు శాంతలా

దేవి యా సుందర విగ్రహ పాదమూలమును సమీపించినది. ఒక్కసారి తల యెత్తి చూచినది. ఆమె కన్నులు తిరిగి పోయినవి. గోమటేశ్వరుని శిరము చుక్కలలో నున్నట్లామెకు గోచరించెను. ఆ దివ్యమూర్తి సుందరవదనములో లక్ష చంద్రులు లాటలాడుచున్నట్లు తన్వికి తట్టినది. ఆ పెదవుల మీదుగా జాలువాఱు చిఱునగవు తరగలలో మానవుల కామక్రోధాది గుణములు కొట్టుకొని పోవుచున్నట్లు తోచినది. ఆ మహామూర్తి బాహువు లెంత సుందరములు! అవి భువన రక్షా దక్షములా యనిపించెను. అందుకే యా స్వామి *బాహుబలీంద్రుఁ డయ్యెనా? విశాలమగు నా యురములో భావప్రపంచము పఱుగులు వాఱునేమో! ఆ పొట్టలో లోకములు దాఁగుకొన్న వేమో! ఆ పాదములు భూమినంతటిని తిరిగి తిరిగి గోమటములై యాతని గోమటేశ్వరుని జేసినవేమో! ఆమె పలురీతులభావించి భావించి తనప్రాణేశ్వరుని కళారాధన దీక్షకు, మతాభినివేశమునకు శిల్పాచార్యుని హస్తకళా కౌశలమునకు మిక్కిలి యబ్బురంపడినది. అటుపిమ్మట వారు చంద్రగిరిమీఁది విగ్రహములనుగూడఁ జూచినారు. ఇట్లచ్చటి అద్భుత శిల్పములను జూచుటలో వారి కెన్ని వాసరములు గడచినవో వ్రాసిపెట్టినవారు లేరు.

ఈ యద్భుత శిల్పములను జూచుటచే శాంతలాదేవి హృదయములో నొక క్రొత్త కోరిక చిగురొత్తినది. "శిల్ప

---

* గోమటేశ్వరునికి బాహుబలీంద్రుఁడు, భుజబలీంద్రుఁడు అనియు పేరు లున్నవి.

మెంతయు గొప్పదే. అయిననేమి? అదంతయు అవైదికమగు జైనమతముపాలం బడినది. గోక్షీరము పవిత్రమే. కాని వానిని తోలుసంచిలోం బోసిన పనికివచ్చునా? ఈ జగన్మోహన శిల్పముతో వైదికమతమును జిత్రించిన నెంత బాగుండును! హైందవ మత శిల్పములనుగూడ నీ జక్కణాచార్యుని చేతనే రూపొందింపం జేయవలయును. ఆ శిల్పి సాహాయ్యముననే మహారాజుగారిని వైదిక మతాసక్తునిగాం గూడం జేయవలయును. ఇట్టి లోకోత్తర శిల్పులు ఈశ్వరసృష్టిలోనే యఱుదుగా నుందురు. యుగమున కొక్కరో, యిద్దఱోగాని మహాశిల్పులు, కవులు నావిర్భవింపరంట. అట్టివారు పుట్టినపుడు వారిని సంఘక్షేమమున కుపయోగించుకొను భారము ప్రజాపాలకులమీంద, సంఘనాయకులమీంద నున్నది. నా నాథుండు తన ధర్మము నిప్పట్టునం జక్కగనే నిర్వహించుకొనినాండు. అసాధారణ స్థపతికులాలంకారుని కళాకౌశలము నాయన తన యభిరుచుల కనుకూలముగనే యుపయోగించినాండు. ఇట్టితఱి హైందవశిల్పములను వెలయింపంజేయుట శిల్పాభిమానిని నగు నా కనిష్ఠ ధర్మము. అమరావతీ, నాగార్జునకొండల యందు సాతవాహనవంశపు రాణులును, ఇక్ష్వాకుకుల రాజ్ఞీమణులును తమ సేవగా మహత్తర శిల్పములను గల్పింపంజేయలేదా! కావున రాణుల కీ శిల్పక్రీడ, శిల్పపూజ క్రొత్తదిగాదు. ఈ రహస్యము నెఱింగిన నా సపత్ని సహజాదేవి యేనాడో లక్ష్మీ ప్రతిష్ఠచేసి ధన్యురాలయినది.'' ఇట్లు తలపోసి యామె ప్రియు నుద్దేశించి యిట్లన్నది.

"మీరు సర్వసమర్థులరు. సర్వాధికారులు. కళార్చనా శీలురు. కావుననే మీ స్వాతంత్ర్యము ననుసరించి యీ యద్భుత శిల్పములు వెలసినవి. నాకును గొన్ని శిల్పములు వెలయింపఁజేయు వాంఛ గలదు. కాని నే నస్వతంత్రను. మీ యాజ్ఞకు లోఁబడియుండవలసిన దానను. మీఁదుమిక్కిలి స్త్రీకి స్వాతంత్ర్యముగూడ లేదందురు. ధనాగారమా నా యధీనము కాదు. నా వాంఛ యెట్లు నెఱవేఱును ?"

శీలవతియు, భక్తురాలును, పతివ్రతయు నగు కూరిమి దేవేరి దీనాలాపములు రాజు మానసమును గరగించి వేసినవి. ఆతఁ డిట్లన్నాఁడు— "దేవీ! నా యెడ నీకీపాటి చనువు మానము లేదా ? యీ నాఁడేల యిట్లు క్రొత్తగా మాటలాడు చున్నావు ? అనుకూలయగు ప్రియురాలి ముద్దు చెల్లింపని మగఁ డెట్టి మగఁడు ? నీవు మహారాజ్ఞివి. ఉత్తమురాలవు. స్వార్థములగు సంకల్పములు నీ మనసులోఁ దల యెత్తవు. నీ సంకల్పమును నెఱవేర్చుకొన నే నడ్డుపెట్టను. మనకుఁ గల బొక్కసముపై నీకు సర్వాధికార మున్నది. దానిని నీ యిచ్చవచ్చిన ట్లుపయోగించుకొని సంకల్పసిద్ధిని బడయవచ్చును. ఇంకను శ్రేష్ఠములగు జైన శిల్పములను వెలయింపఁజేయ నీ కిష్ట మున్నచో, శిల్పిసమ్రాట్టు జక్కణాచార్యులును, వారి శిష్య ప్రశిష్యులును మనవారలే కదా ! వారు నీవు కోరిన ట్లింతకన్న మిన్నగనే కళాకల్పనము చేయఁగలరు. సందేహింపక నీ వాంఛ నెఱవేర్చుకొనుము.

"దేవీ ! మన మిక్కడ నిఁక తడయ రాదు. దేశమున జైనమును కూలఁద్రోయఁ జూచువారి ప్రయత్నము లట నట మాఱుమూలలఁ జెలరేగుచున్నట్లు వినుచున్నాము. దీనికిఁ జోళరాజులును దోడ్పడుచున్నట్లు తెలియుచున్నది. వెంటనే రాజధాని కేఁగి కర్తవ్యమునకుఁ బూనవలసి యున్నది. లేక లేక కలిగిన మన చిన్నారి ముద్దుల పట్టికిఁ గూడ నిచ్చట సరియగు సౌకర్యములు గుదురుట లేదు. కావున రేపే మనము ద్వారసముద్రమునకుఁ జేరుకొందము. నీవింకొకసారి వచ్చి యిష్టమున్నంతకాలము శిల్పసందర్శనము చేసికొనవచ్చును."

అంతట శాంతలాదేవి "ప్రియా, నేనుగూడ నింటి కేఁగ వలయునని తొందరపడుచునే యున్నాను. నా ముద్దుల చెల్లెలు కీర్తిమతి గర్భవతిగాఁ దోఁచుచున్నది. ఆమె యారోగ్యము సరిగా నుండుటలేదు. నేను దగ్గఱనుండి ఆమెకు వలయు పరి చర్యలు సేయవలయును. మన నరసింహదేవునకు తమ్ముఁడు పుట్టినచో నాసపత్ని కీర్తిమతి కొఱఁతగూడఁ దీఱఁగలదు." అనెను.

ఆ మాటలకు రాజు వింతపడెను. తన జైనశిల్పా రాధనము కారణముగా తన చిన్నారి ముద్దుల పెండ్లము సంతానవతి కాఁబోవుచున్నదని యాతఁ డానందపడినాఁడు. వెంటవెంటనే తనకుఁ జేకూఱుచున్న యభ్యుదయపరంపరల కాతఁ డెంతగానో లోలోన మురిసి పోయినాఁడు.

# కళారాధన

అనుకూలుఁడగు పతి దొరకిన సతి వాంఛలు చక్కఁ బడ కేల యుండును. శాంతలాదేవి యట్టి యోగ్యుఁడగు భర్తకు నోచుకొన్నది. కావుననే ఆ యాల్మగలకు మతములలో భేద మున్నను మతులలోను అభిప్రాయములలోను భేదము లేదు. వారి సంసారయాత్ర యే యొడుదొడుకులు లేక చక్కఁగా సాఁగి పోవుచున్నది. ఆమె జప దాన వ్రతములకు ఫలముగా చిరకాలమున కొక్క కుమారుఁడుగూడ పుట్టి యామె జన్మకు సాఫల్యము చేకూర్చినాఁడు. ఇంక నామెకుఁ గొఱంత యేమి? వైదికమత విస్తరణము జరుగవలయునను వాంఛ యొక్కటి యామె హృదయమునఁ బెద్దకాలము నుండియుఁ గలదు. ఆ కోరిక నెఱవేఱుటకుఁగూడ నిప్పుడు తెరువు లేర్పడినవి. ఆమె యాశయమును ప్రాణేశ్వరుఁడు ముద్దు చేసినాఁడు గదా!

శాంతలాదేవి మహామంత్రియగు నక్కన్న మూలమున జక్కణాచార్యునిచే మహారాజును మార్పఁజూచినది. ఆ యాచార్యుఁడు మహారాజును మార్పఁగలఁడు. కాని అందు కాయన పూనలేదు. "ఆయన మహారాజు. రాచఱికపు సాధక బాధకము లాయన యెఱుఁగనివి లేవు. మత రాజకీయముల కతీతమైన కళాసేవ చేసి లోకమునకు తారక మార్గమును జూపవలసిన తాను అనవసరముగా నా మత రాజకీయములలోఁ దలఁ దూర్పనేల? మహారాజు మనస్సును

గలతఁ బెట్ట నేల? కాలమే యన్నింటిని జక్కఁదిద్దుకొనును.”
ఇట్లని యాతఁడు మిన్నకుండును.

శాంతలా మహాదేవి సంకల్పము. కర్ణాటమున హైందవ శిల్పములను వెలయింప వలయును. ఎట్టి శిల్పములు? వేదములు, శాస్త్రములు, పురాణేతిహాసములు, చారిత్రక గాథలు, మత రహస్యములు— అవి యివి యన నేల, సమస్త హిందూ ధర్మములను జదువకయే తెలిసికొనఁజాలు — శిల్ప మహా సంహిత— కన్నులతోడనే చదువఁ దగినది సృష్టి కావలయును. అది మానవశక్తి సాధ్యము కానిందు, దైవశక్తి సాధ్యము కానిందు; సృష్టింపఁబడవలసినదే. రాజు దేవేరి యీ సంకల్పము నెఱవేర్ప జక్కణాచార్యుఁడు సంపూర్ణముగాఁ దోడ్పడినాఁడు. ఆతఁడు శిల్ప కులపతి కదా! ఆతని శిల్పిగణము చేయి చేసికొన్న కాని దేది? వారిలో ననేకులు దశక్రియా పరిజ్ఞాతలగు సిద్ధహస్తులు. వారు శిలలను గరఁగి పోఁతపోయఁ గల ప్రజ్ఞాశాలులు. ఉలిచేతఁ జరిత్రము చెప్పింపఁగల నూతన పండితులు. దేవాలయ స్తంభములమీఁదను కుడ్యముల మీఁదను నాట్యవేద రసము నొలకఁబోయఁగల రససిద్ధులు. చిత్ర విచిత్ర జగత్తులను పాషాణములయందును సృష్టింపఁగల అపర బ్రహ్మలు. నవ విశ్వామిత్రులు. కలియుగ మయులు. ఇంక కొఱఁత యేమి?

శాంతలాదేవికి తన యుభయవంశముల పూర్వపురుషుల మీఁద భక్తిగౌరవములు మెండు. తాను మెట్టినది హొయసల వంశము. తమది హొయసల సామ్రాజ్యము. ఈ హొయసల

వంశ మూలపురుషుని చరిత్రము, రాజ్యస్థాపన చరిత్రము అత్యద్భుతము లైనవి.

పూర్వము శలుఁడను నొకరాజు * శశకపురమును రాజధానిగాఁ జేసికొని కర్ణాటప్రాంతము నేలుచుండువాఁడు. ఆ ధర్మమూర్తి దేవీభక్తుఁడై ప్రజలను బిడ్డలవలెఁ బాలించు చుండెను. శలభూపతి కాతని నగరమునకుఁ జేరువ యడవిలో నున్న వసంతీదేవి యిష్టదైవము. ఆతఁ డొకసారి యాలయ మున కేఁగి వసంతికాపూజ చేయుచుండెను. ఇంతలో నొక పెద్దపులి కాంద్రు కాంద్రు మనుచు దేవాలయమువైపునకుఁ బరువెత్తుకొని వచ్చుచుండెను. ఆఁకొన్న యా బెబ్బులినిగాంచి యాకోవెల పూజారి నాఁటితోఁ దమకథ పూర్తియైనదని భయపడెను. అయినను ఱేఁడు తనవద్దనే యున్నాఁడు గావున నాతఁడు ధైర్యము చిక్కఁబట్టి రాజునుగాంచి "హోయ్ శల!" (శలుఁడా! కొట్టుము) అనెను. సింహపరాక్రముఁడగు నా రాజు వెంటనే వ్యాఘ్రముపైఁ బడి పోరాడి దానిని జంపి, తన ప్రాణములతోఁ బాటు పూజారి ప్రాణములనుగూడఁగాపాడెను. శలభూపతి యొనర్చిన వ్యాఘ్రసంహార వార్త పూజారివలన దేశమంతట వ్యాపించెను. శలుని బల పరాక్రమములకు, ధర్మ పాలనమునకు సంతృప్తులైన ప్రజలు నాఁటినుండియు రాజు నకుఁ జెల్లింపవలసిన పన్నునుగూడఁ బెంపు చేసి యిచ్చు చుండిరి. అప్పటినుండియు నా నరేంద్రుని హోయశలుఁ డని పిలువఁజొచ్చిరి. శలరాజు ప్రజలిచ్చు పన్నును భోగాదులకు

* దీని నిప్పుడు "సొసెపూర్" అనుచున్నారు.

వ్యయముచేయక అయిదేండ్లవఱకు కట్లేయుంచి యా ధనముతో ద్వారసముద్ర దుర్గమును గట్టించి వృద్ధిపఱచెను. ఈ ద్వార సముద్రమునే మన మిప్పుడు హాలేబీడని పిలుచుచున్నాము. శలునినాఁటి నుండియు హొయసలరాజుల పతాకముమీఁద వ్యాఘ్ర చిహ్నము వెలసి వారు వ్యాఘ్రధ్వజులైనారు. ఈ హొయసలరాజు సహజముగా నీశ్వరభక్తుఁ డగుటచేత ద్వారసముద్రమున నొక శివలింగమును బ్రతిష్ఠించి యా దేవు నికి హొయసలేశ్వరుఁ డని నామకరణము చేసి ప్రజల కారాధ్యదైవముగా నొనర్చెను. ఈ దేవుని వైశాలేశ్వరుఁ డనియు నందురు. నాఁటినుండియు నా రాజ్యమునకును, నా వంశమునకును హొయసలరాజ్యమనియు, హొయసలవంశ మనియుఁ బ్రసిద్ధి ప్రచారము లేర్పడెను. ఈ హొయసలరాజు దేశము సుభిక్షమై శాంతితో వర్ధిల్లుటకు శాంతలేశ్వర లింగ మును గూడ వైశాలేశ్వర స్వామి ప్రక్కనే ప్రతిష్ఠించి యుత్సవములు జరుపు చుండెను. నాఁటినుండియు నీ వంశము వారు శాంతలేశ్వరాది నామములను ధరించుచుండిరి. శాంతలాదేవి దా దేవుని పేరే!

ఈశ్వర సంకల్పముగా నేర్పడిన ఈ చరిత్ర సంఘటనము శాంతలాదేవి మనస్సున భక్తి గౌరవములను రేకెత్తించినది. ఇప్పటి తన యుద్దేశ్యమును సాధనముగాఁ జేసికొని యామె పూర్వ పురుష పూజ చేయఁ దలంచెను. హొయసల నరేం ద్రుఁడు ప్రతిష్ఠించిన యీ హొయసలేశ్వరుని దేవాయతన

మును జక్కణశిల్పి సార్వభౌముని శిల్పముచే విస్తరింపఁజేయ నామె పూనుకొన్నది.

ఈ ద్వార సముద్ర దేవాలయ శిల్పనిర్మాణమునకు మూఁడు వందలమంది శిల్పులు పూనుకొనిరి. వారికి ప్రధాన సూత్రధారులు జక్కణ శిష్యులలో ముఖ్యులు అనంత కీర్తిస్థపతియు, దేవోజును, కాళిదాసాచార్యుఁడును. జక్కణా చార్యుని సమగ్ర పర్యవేక్షణములో నిది రూపు రేఖలు దిద్దుకొన్నది. ఇంకను కేదారోజు, మాచోజు, కేతనా చార్యుఁడు మున్నగు వా రా యా ప్రత్యేక ప్రత్యేక భాగ ములను నిర్మించిరి.

హొయసల శిల్పమునకు సంబంధించిన దేవాలయములు ఒకటినుండి నాలుగు వఱకు మంటపములు గలవై తత్సంఖ్యా నామములతో పిలువఁబడుచుండును. ఈ మండపములకు కూటము లనియు పేరు గలదు. బేలూరు చెన్న కేశవాలయము ఏకమంటపము. సోమనాథపుర దేవాలయము త్రికూటా చలము. దొడ్డగడ్డపల్లి లక్ష్మ్యాలయము చతుష్కూటము. ఈ హాలేబీడు దేవాలయము ద్విమండపము. పైకిఁ జూచుట కిది యొకే యాలయముగా నున్నను లోపలికిఁ బోయి చూచిన రెండు భాగములుగా నుండును. ఒక భాగమున హొయసలేశ్వరస్వామిని, రెండవ భాగమున శాంతలేశ్వరుని బ్రతిష్ఠించినారు. దేవాలయముమీఁది ప్రతి శిలాఖండము నందును దీర్చిన శిల్ప మిట్టి దట్టి దని చెప్ప వీలుకాదు. భారత రామాయణగాథలు, దశావతారచరిత్రలు, క్షీరసాగరమథనా

ములు, శివ కేశవ లీలా విశేషములు ఓ! ఒక్కటేమి! హైందవ పురాణాంశముల నన్నింటిని ఆ దివ్య శిల్పు లందు రూపొం దించినారు. హైందవ సంస్కృతి నంతయు ఆ స్థపతివర్యు లందు తీర్చి దిద్దినారు. అక్షరజ్ఞానము లేనివారికిఁ గూడ నీ సుందర శిల్ప దృశ్యములు అఖండ జ్ఞానమును, భక్తిని, బోధించు నాచార్యకములుగా నున్నవి. గర్భాలయద్వార ములవద్ద చెక్కిన ద్వారపాలకుల చుట్టును దీర్చిన ఆ తీగెలు, పూవులు, తోరణములు ఎంత సహజ సుందర ములు! ఈ దేవాలయములు శివునివి గనుక వీని కెదురుగా మండపములలో రెండు పెద్ద నందులను దీర్చిపెట్టినారు. ఇవి నిలువెత్తుకు మించియున్నవి. ఈ నంది మంటప స్తంభములు తరిమెన పట్టినట్లుండి స్నిగ్ధత్వముచేత చూచువారికి ఒక్కొకటి రెండు స్తంభములుగా నగపడుచుండును. ఇట్లొక్కవస్తువునే రెండుగాఁ దోఁపఁజేయు శిల్పప్రభావమును ద్వయీభావన యందురు. ఈ దేవాలయమున క్రిందిభాగమున ఒక వరుసను గుఱ్ఱములను, ఇంకొక వరుసను ఏనుగులను, మఱొక వరుసను రథములను, వేఱొక వరుసను కాలిబంట్లను దీర్చిపెట్టిరి. ఇవి చతురంగ బలములు కాఁబోలును.

వీరభల్లాళుఁడు జైనమత శిల్పములను రచింపఁజేయఁగా శాంతలాదేవి హైందవ శిల్పములను జెక్కింపఁజేసి ధన్యురా లయినది. తన మనోరథము సఫలమయినందు కా తల్లి వేయి యేనుంగుల నెక్కినట్లు సంతోషించెను. ఈ మహా శిల్పయజ్ఞ ములో ప్రధాన పౌరోహిత్యము నెఱపిన జక్కణాచార్యుఁడు

శాంతలాదేవి మదికి రెండవ విశ్వకర్మగనే తోఁచెను. భల్లాళ రాజు తన ప్రియురాలి శిల్పకళా ప్రీతికిని, వంశవృద్ధులయెడ నామెకుఁ గల భక్తి ప్రపత్తులకును కరము మెచ్చుకొనినాఁడు. జక్కణాచార్యుని దివ్యశిల్ప కల్పనమునకు మురిసిపోయినాఁడు. కాని తన రాజధానీ నగరములో జైనశిల్పములు లేనికొఱఁత యాతనికి బాధాకరము గాకపోలేదు. ఈ యంశమును జక్కణ శిష్యవర్గములోని దేవోజుశిల్పి యొక్కఁడే కొంచెముగా గుఱుతించెను.

ద్వారసముద్రమున దివ్యశిల్పకళ వెలసినప్పటినుండియుఁ బ్రజాసమూహములో నింకను భక్తి ప్రపత్తులు, దైవారాధన దీక్ష మున్నగు గుణములు పెంపొంది దేశము వైదిక మతోన్ముఖము కాఁజొచ్చెను. ఇంతవఱకు దేవాలయమును అాల గుట్టగా భావించువారుగూడ నిపుడు దాని నొక కళాగారము గను, విజ్ఞానక్షేత్రముగను, చరిత్రల బోధించు గురుమూర్తి గను దలంచి విరివిగా రాకపోకలు సేయఁబూనిరి. శిల్పకళా లక్ష్మి దివ్యనాట్యము చేయుటచే నిట్టిఫలితములు కలుగుటలో నబ్బర మేమి!

౨

నాఁడు కార్తికశుక్ల పూర్ణిమ. దిక్కులు జెల్లుపూల తెల్లఁదనముచే కళకళ లాడుచున్నవి. సరస్సులలోని జలములు నిర్మలములై యున్నవి. వానిలో విచ్చిన పద్మములు తుమ్మెద బిడ్డలకు కడుపార తేనెపానకము లిచ్చి లాలించుచున్నవి. కోయిలల కూఁతలు, చిలుకల మధురధ్వనులు, గోరు

వంకల యఱపులు చెవులకు విందుఁ గూర్చుచు నా యుద్యాన వన సంపద నినుమడింపఁ జేయుచుండెను.

ఆ యుపవనములోని చంద్రకాంత శిలాతలమున సౌపర్ణీ దేవియు, చాముండేశ్వరియుఁ గూర్చుండి తమ భర్తల శిల్ప కళామహిమల నుగ్గడించుకొనుచుండిరి. సౌపర్ణీదేవి మెడలోని ముత్యాలహారములు, రతనాల పేర్లు తళతళ మెఱయు చుండెను. ముప్పదియేడులు నిండీ నిండని ప్రౌఢ పరిపాకములో నామె వయస్సున్నది. ఆమె రూపములో రతిదేవి. లావణ్య తారుణ్యముల దివ్యమూర్తి. మహా శిల్పిసార్వభౌముని భార్య. పుట్టినదియు మెట్టినదియు ఆగర్భ శ్రీమంతములగు కుటుంబ ములు. వీనికిఁదోడు మహారాజుల యాశ్రయము. ఆశ్రయమే కాదు, మహారాజులకు గురుపీఠమై తమ వంశ మలరారుచున్న దన్నను అతిశయము కాదు. ఇన్ని విధముల నేమిటఁ గొఱంత లేకున్నను నాఁ డేలకో యామెముఖము కళావిహీనమై వెల వెల పోవుచున్నది. చాముండేశ్వరియు తన మగనికి గురు పత్నియైన యామె చిత్తవృత్తి నారయలేకపోయెను.

చాముండేశ్వరి : అమ్మా! శాంతలాదేవి యెంత సాధ్వి! ఎంత గర్వములేని యిల్లాలు. మహారాజు భార్య యయ్యును పరిజనమునం దెంత సోదరభావము చూపును! ఆమె మీ యాచార్యులను, మావారిని ఎంతగానో ప్రశం సించి వారి శిల్పకళాకౌశలమునకు మురిసి పోయినది. ఈ శిల్పులు లేకున్న తన మనోవాంఛలు సఫలములు కావ

నియు, వీరు తన పాలిటి భాగ్యదేవత లనియు మిక్కిలి కొనియాడినది. ఆహా! అంత సౌజన్యమూర్తియగు స్త్రీని మన మెచ్చటను జూచియుండము.

సౌపర్ణి : ఔను. శాంతలాదేవి సద్గుణఖని. శిల్పకళాభిమానిని. వైదికమత పరాయణ. శిల్పకళాపోషకురాలై యామె నారీలోక గౌరవము నినుమడింపఁ జేసినది. ఆమె గుణ శీలములకుఁ దగినట్లు కడుపు పండి బంగారుతండ్రి జన్మించి నాఁడు. ఇంక నామె కే కొఱంతయు లేదు. ఇటీవల చిన్న వాని జన్మదినోత్సవమునకు బిడ్డ నాశీర్వదింప న న్నాహ్వానించి యెంతయో గౌరవించినది.

చాముం : ఎంత మంచివారి కైనను విరోధు లుండకపోరు గదా. చిన్న రాణిగారు ఈమెపై నెప్పుడును తప్పులు వెదకుచునే యుండును. తాను జైనమతము పుచ్చుకొన్నది గావున పతికిఁ గూర్తునని యామె విఱ్ఱవీఁగుచు మహారాజున కెప్పుడు నీమెపై నూరి పోయుచుండును. శాంతలా దేవికిఁ గుమారుఁడు కలుగుటగూడ నామె కసూయయే యఁట.

సౌపర్ణి : అయిన నేమి. మహారాజుగారికి శాంతలాదేవి యెడ సాటిలేని ప్రేమాదరము లున్నవి. ఆమె కోరికల నాయన ముద్దు సేయును. కీర్తిమతిగారి మంత్ర తంత్రము లక్కడ పని సేయవు అసలామె గర్వమునకు హేతువు వేఱు. హొయసలులు మొట్టమొదటచాళుక్యులకు సామంతు

లుగా నుండి క్రమక్రమముగా స్వతంత్రరాజ్యమును నెల కొల్పుకొని చక్రవర్తు లయినారు. వారి గౌరవమును గుర్తించి చాళుక్యులు వారితో సంబంధ బాంధవ్యములు గూడ నెఱపఁ బూనుకొనిరి. కీర్తిమతి చాళుక్యుల యాడు పడుచు. వీరభల్లాళుని తాతగారు వినయాదిత్యుఁడు. అతఁడు వైదికమతస్థుఁడే. అతని కాలమున చాళుక్యులకును చోళు లకును రాజకీయకలహము లేర్పడినవఁట. అప్పుడు వినయా దిత్యుఁడు చాళుక్యులపక్షము వహించి చోళుల నోడించెను. నాఁటినుండియు చోళులకును చాళుక్యులకును వైరము చల్లారనేలేదు. ఆకారణమున చాళుక్యరాజులు హొయసల రాజులతో సంబంధములు చేసి చుట్టఱికమును బలపఱచు కొని చోళులకుఁ జెనకరాని వారైరి. ఇట్టి పూర్వవైరము వలన చోళులు వీలు చిక్కినచో హొయసలరాజ్యమును గూడ నాక్రమింప తఱి వేచియున్నారు. కావున చాళుక్యు లకు వీరు, వీరికి చాళుక్యులును బాసటయై యుందురు. తన పుట్టింటివారగు చాళుక్యుల బలముపై హొయసల రాజ్యము బ్రతుకుచున్నదని కీర్తిమతి గర్వము. అందుచే ఆమెయాట లట్లు సాఁగుచున్నవి. దీనికిఁ దోడి మెకూడ నిప్పుడు పుత్రవతియైనది. ఇఁక నామె గర్వము మేరమీఱి పోవచ్చును. కీర్తిమతి సవతిమత్సరమునకు మత భేదము కూడ చాలవఱకుఁ గారణ మని చెప్పవచ్చును. శాంతలా దేవి జైనమత మవలంబింపకుండు టామె కెంతమాత్రము నిష్టము కాదు. ఆమెకూడ జైనము పుచ్చుకొన్నచో

మహారాజు కుటుంబమంతయు నొకే మతములో నుండి దేశమునకు నిరుపద్రవమైన సేవ చేయవచ్చు ననియుఁ బ్రజల నొక్క త్రాటిపై నడుపవచ్చుననియు నామె తలంపు. ఇట్టి మతభేదముచేతనే యామె శాంతల నించుక ద్వేషించునుగాని సహజముగా మంచిదనియే యను చుందురు.

చాముం : కావచ్చును. మహారాజు జైనుఁడైనను దక్షిన మతములవారి నాయన యనాదరముతోఁ జూడఁడు. నిర్బంధముగా నెవ్వరిని మతము మార్చుకొనుమని యనఁడు. ఇందుకు రెండవభార్య సహజాదేవియే దృష్టాంతము. సహజాదేవి శక్తిదేవతారాధనపై నిష్టము గలదఁట. జగత్తుల సృష్టికి స్త్రీరూపిణి యగు శక్తియే కారణ మని ఆమె విశ్వాసము. తాను శైవులయింటి బిడ్డ యైనను లక్ష్మి, పార్వతీ, సరస్వతులయెడ భేదభావము నామె చూదఁట. కనుకనే తన స్త్రీదేవతాభక్తి కుదాహరణముగా దొడ్డగడ్డపల్లిలో లక్ష్మీదేవాలయమును గట్టింపఁజేసి ప్రియుని యనురాగము నామె చూఱగొన్నది. ఆమె జైనము తీసికొనకున్నను మహారాజామె నొత్తిడి పెట్ట లేదు కదా. భల్లాళరాజు విశేషించి ప్రజల కందఱి కా యా చేతిపనులు గల్పించి వారి బీదఱికమును బోఁగొట్టు చున్నాఁడు. శిల్పకళారాధన మూలమున దేశమును విజ్ఞాన వంతము చేయుచున్నాఁడు. అసలీ మహారాజు జైనుఁ డెప్పు డైనాఁడో, ఏల యైనాఁడో!

సౌపర్ణి : ఆతని తరములోనే యఁట. అస లీతనికిఁ దలి దండ్రులు పెట్టినపేరు బిట్టిదేవుఁ డఁట. జైనమతము పుచ్చుకొన్న పిమ్మటనే వీరభల్లాళనామ మేర్పడినదందురు. కీర్తిమతి మొదటిపేరుగూడ లక్ష్మాదేవి యఁట. మహా రాజు ననురాగమును సంపాదింప నామె జైనము తీసికొని కీర్తిమతి యైనదఁట. భల్లాళున కీ జైనమతాభిమాన మెట్లు కలిగినదో నాకును దెలియదు. పెక్కేండ్లు రాజ్యము చేసి జనుల మన్ననల నందిన యీతనియన్న నరసింహదేవుఁడు గూడ వైదిక మతాభిమానియే యఁట. భల్లాళరాజు తాను జైనమత శిల్పముల వెలయింపఁ జేయుటచేతనే కీర్తిమతికిఁ గుమారుఁడు పుట్టినాఁడని ఆతనికి వర్ధమానుఁడని పేరు పెట్టెను.

చాముం : ఔనౌను. ఆయన జైనమతాభిమానము గాఢ మైనదే. ఇటీవల మా వారు చెప్పుచుండగా విన్నాను. ఈ ద్వారసముద్రములో శాంతలాదేవి హిందూ శిల్పము లను మాత్రమే వెలయింపఁ జేసినదనియు, రాజునకు జైన శిల్పములు లేవన్న కొఱఁత యున్నదనియు, అందు కెట్లేని తాను జైనశిల్పమును విస్తరింపఁజేసి మహారాజుకోరిక నెఱవేర్పవలయుననియు వారు తీవ్రముగా నాలోచించు చున్నారు. వారి ప్రయత్నమునకు కీర్తిమతియుఁ దోడ్పడఁ జూచుచున్నది. సహజాదేవి అన్నింటను మధ్యస్థురాలు. ఆమె సవతులయెడఁగాని,మహారాజునెడఁగాని పక్షపాతము చూపదు. యథోచిత ప్రవర్తనముతో నామె యందఱి

మన్నన లందుచుండును. తన శక్తిపూజ లేమో, తా
నే మో

సౌపర్ణి : ఆచార్యులవారి శిష్యులలో మిక్కిలి గొప్పవాడై
శిలలమీఁద నెన్నివిధములుగానో అద్భుతశిల్పములఁ జెక్క-
గల నేర్పు ఒక్క- దేవోజునకే యబ్బినది. దేవోజు ప్రతిభను
గూర్చి యాచార్యులవా రెన్నిసారులో చెప్పుచుందురు.
నిజముగా దేవో జే మర్మశిల్పములనో కనిపెట్టి మహారాజు
గారి మనోరథము పండింపఁగలఁడు. ఇట్టి యుత్తమ శిల్పా
చార్యునకిల్లాలివైన నీ వెంతయు ధన్యురాలవు. దేవోజుపై
రాజదంపతులకును నెంతయో సదభిప్రాయ మున్నదని
వి ం దు ను.

ఇంతలో జక్కణాచార్యుని రాక నొక చెలికత్తె సౌపర్ణి దేవికి నివేదించెను. ఆ మాట వినగానే చాముండే శ్వరీ గోరంటపొదల చాటుగాఁ గల యొక సన్నని త్రోవ నుండి తన నివాసమున కేగినది.

నాఁడు జక్కణాచార్యుఁడు రాజుగారిచే ప్రత్యేకముగాఁ బిలువఁబడి రాజకీయ కార్యాలోచనలో మునింగి మనస్సునకు విశ్రాంతి లేక కొంతవడి విహరించి చిత్తవినోదము పొందవచ్చునని యుద్యానమునకు వచ్చినాఁడు. దానికిఁ దగినట్లు సమలంకృతమైన సౌపర్ణియు నచ్చటనే యున్నది. వెలగల బంగారు సరిగంచు పట్టుచీరలో నా మనోహర మూర్తి ప్రకాశించుచున్నది. ఆ దివ్యమంగళ విగ్రహమా శిల్పివతంసున కేల కనుల పండువు సేయదు! చేసి

నను ఆయన చిత్త మాలోచనా తరంగములలో మునుకలు వేయుచునే యున్నది. రాజా స్థానములోఁ జర్చింపబడిన విషయములలోనే వాని మనస్సు తగుల్కొని యుండెను. ఆలోచనా చిహ్నము లాయన ముఖములో తారాడుచునే యున్నవి. ఆతఁడు మనసార తెచ్చుకొన్న యనురాగ మును బ్రకటించుచు సౌపర్ణీదేవితో నిట్లనినాఁడు —

జక్కణ : ఈ నాఁడు దేవిసౌందర్యము జాజ్వల్యమానముగా వెలుఁగుచున్నదే! ఈ క్రొంగ్రొత్త భూషణము లెక్క డివి? ఇవి పండుగ కంపిన పుట్టింటివారి క్రొత్త కానుకలా యేమి?

అనుచు మెల్లఁగా నామెప్రక్క నాసీనుఁడై బుజముపై చేయి వేసి చిర్నగవు వెలుగులతో నామె ముఖమును బ్రకాశింపఁ జేసెను. సౌపర్ణియు మధుర లజ్జానురాగ ములు ముడివడుచుండ "ప్రియా యీ యలంకారముల రాక మీకుఁ దెలియదా యేమి? ఔను. ఎట్లు తెలి యును? రేలుఁ బవళ్ళు కళాసేవలో నిమగ్నులై కుటుంబ విషయములనుగూడఁ బట్టించుకొనని అనన్య శిల్పయోగులు మీరు. మీ కిదియేకాదు. ఏదియుఁ దెలియకుండుటలోఁ గూడ నాశ్చర్యము లేదు. ఈ శిల్పసేవకుఁ దోడిచ్చుటకు వచ్చినప్పటి నుండియు రాజకీయ రంగమునఁగూడ ప్రధాన పాత్ర వహింపవలసి వచ్చెను. మహామంత్రి అక్కన్న గారికిఁ గూడ మీ రాక విశ్రాంతిని గూర్చిన దను చున్నారు. ఇఁక మీ హృదయములో నితర విషయము

లకుఁ దా వెక్కడ? ద్వారసముద్ర శిల్పముల కలరిన మహారాణి శాంతలాదేవి యీ బహుమానముల నంపినది. ఆమె పంపిన బహుమతులలో నేను ధరించిన వే నూరవ వంతో యయి యుండును. మీకును, మీ ప్రధాన శిష్యులకును గూడ పట్టు వస్త్రములను, బంగారు, జంబె ములను, నవరత్నాల హారములను, లెక్కలేనన్ని యా దేవి పంపినది. ఇంకను దంతపు బరణులు, వెండి బంగారు నాణెములు అనేకములు మన యింటికిఁ బంపినది. ఆహా! ఆమె త్యాగశీలము, ఔదార్యము నేమని కొనియాడ వచ్చును. ఈ సంగతి నంతయు మీకు దేవోజు చెప్పియుండు నవి తలంచితిని. ఆతఁడును ఏ యపూర్వ శిల్పనిర్మాణము లోనో మునిగిపోయి మఱచి యుండవచ్చును. లేకున్న ఆచార్యవర్యుల కీ విషయము నేల యెఱుక చేయఁడు?

జక్కణ : దేవీ! శిల్పమునకుఁ బ్రతిఫలముగా బహుమాన ముల స్వీకరించుట నాకు సరిపడనిపని. అది పవిత్ర శిల్పా చార్య సంప్రదాయమునకు విరుద్ధముగూడ. తమ నామము లనే బాలఁ జెక్కుకొన నిష్టపడని కీర్తిత్యాగులగు శిల్పులు భోగభాగ్యములను వాంఛింతురా? అదియునుగాక మనకు రాజోసంగు బహుమానములతో నక్కఱయే లేదు. ధన ధాన్య సంపన్నమగు కుటుంబమునఁ బుట్టుటకు నోచుకొన్న మనము మన సంపదనే యితరులకుఁ బంచి యిచ్చి ధన వంతులకు మార్గదర్శులమును బీదలకు సహాయులమును గావలయును. దేవుఁ డిచ్చిన శిల్పకౌశలముచే దేశమున

కళాతోరణముల ప్రేలగట్టి జీవితమును సార్థకము చేసి కొనుటయే నాలక్ష్యము. నేను గనుపెట్టిన శిల్పరహస్యముల నా యీ తావుల వెలయించి దేశసేవ చేయుటయే నా యుద్దేశ్యము. ఈ తూరి ఇట్టి బహుమతుల నంపవలదని యీమె మనస్సు నొవ్వనట్లు మహారాణిగారికి ప్రార్థనా పూర్వకముగా నివేదింపుము.

ఈ మాట లనుచుండగనే సౌపర్ణి ముఖము వెలవెలఁ బోయెను. ఆమె మొగములో నేదో క్రొత్త దైన్యరేఖ యొకటి తారాడెను. ఆమె చిత్తములోని భావము నా ముఖదైన్య మతి గంభీరముగా సూచించుచుండెను. అది ఆచార్యుఁ డిప్పుడు చేసిన యుపన్యాసముచేఁ గలిగినది మాత్రము కానట్లు స్పష్ట మగుచునే యున్నది. ఇంగితజ్ఞుఁ డగు నా శిల్పి ప్రియురాలి కెద్దియో మనోవేదన గలిగినట్లు మొదటనే గ్రహించినాఁడు. దానికిఁ దగిన చికిత్స చేయ నూహించి యిట్లనినాఁడు—

జక్కన : ఈ నాఁడు నీవేదో మనోవేదనతో నున్నట్లున్నది. ఎంతగా లేని సంతోషమును బ్రకటింపఁ జూచుచున్నను, నీ ముఖవైఖరి వెలవెలపోవుచునే యున్నది. కారణ మేమి? నే నెఱిఁగినంతలో నీ మనోవ్యాధి కవకాశము లేదే!

సౌపర్ణి : నా కే మనోవ్యాధులును లేవు. మీ రేదో యూహ చేసి యనుచుందురు. మీ వంటి శిల్పకళాసార్వభౌములు ప్రియతములైన నా కే కొఱంత యుండును!

జక్కన : అట్లుకాదు. నీవు నీ యభిప్రాయమును దాఁచుకొను చున్నావు. శాంతలాదేవితో నే మేని మతవిషయికాంశ ములు చర్చకువచ్చి నీ మనశ్శాంతికి భంగముకలిగించినవా యే మి ?

సౌపర్ణి : అట్టి దేమియు లేదు. స్వవిషయమును గూర్చియే యేదో ఆలోచించుచు మీ కట్లగపడినాను.

జక్కన : ఆ స్వవిషయములో నాకును సంబంధ ముండును గదా. కనుక చెప్పకతప్పదు. దేశములోని మత, రాజకీయ విపరిణామములు నాకు మనశ్శాంతిని దూరము చేయుచునే యున్నవి. ఎంతగా వైరాగ్యనిష్ఠ నలవఱచుకొని దూర ముగా నుందమనుకొన్నను ప్రజాహితేచ్ఛ సాఁగనిచ్చుట లేదు. దీనికిఁదోడు అర్ధాంగి మనోభిప్రాయముగూడ తెలియఁబడకున్న మఱింత బాధ పడవలసి వచ్చునుగదా!

సౌపర్ణి : మన్నింతురుగాక. మిమ్ము బాధపెట్టవలసి వచ్చు ననియే నా యభిప్రాయమును దాఁచుకొను చున్నానుగాని, మిమ్ము వంచింపఁదలఁచిగాదు. స్త్రీజన సహజములగు తలంపులతో మీ మనశ్శాంతికి భంగము చేకూర్ప సాహ సింపని నన్ను క్షమింపవలయును.

జక్కన : అట్లుకాదు. నీ మనోవాంఛ నెఱుంగఁ జాలకున్న నాకు బొత్తిగా శాంతియుండదు. కనుక తప్పక చెప్ప వ ల సి న దే.

సౌపర్ణి : ఏమియు లేదు. ఇటీవల నేను శాంతలాదేవి పిలువ నంప నామె కుమారుఁడు నరసింహదేవుని పుట్టిననాఁటి పండుగకుఁ బుత్రుని దీవింప నేఁగితిని. ఆ పండుగ వేడు కలు నాకెంతయో ముచ్చట గొల్పినవి. శాంతలాదేవి యెంత యదృష్టవంతురాలు! చిఱుగజ్జెల గలుగల్లు మ్రోఁతలతో ఆ చిట్టిబాబు నట్టింట తిరుగుచు నామె కన్నులకు వెన్నెలయై, ఆమె హృదయమున కానంద గ్రంథి యై ప్రకాశించుదృశ్యము నా మనస్సులో నిదురించు కోరికలను మేలుకొల్పినది. ముప్పదియేండ్లు నిండుచున్నను ముద్దులని సుంగు నెత్త నోచని...

తరువాత నామెకు మాట పెగులలేదు. కంఠము డగ్గుత్తిక పడినది. కనుఁగొలంకులనుండి జొటజొట కన్నీరు కారి ఆమె యెత్తైన వక్షఃప్రదేశమును దడిపి వైచెను. ఆమె ప్రియుని వంక జూడలేక మొగము నావలకుఁ ద్రిప్పుకొన్నది. ఈ సంఘటనకు జక్కణశిల్పి కదలిపోయినాఁడు. కాఁపురమునకు వచ్చినప్పటినుండియు నాకీ కొఱఁత యున్నదని యీామె నోటి నుండి యాశిల్పి విని యెఱుంగఁడు. ఏ కొఱంతయు నామెకు లేనిమాటయు నిజమే. సంతాన సౌభాగ్య మొక్కటే యీామె కింతవఱకును గల కొఱఁత. వయస్సు మీఱుచున్నకొలందియు నా కొఱఁత మఱీ బాధించును గాఁబోలు. ఉత్తమస్త్రీకి మాతృత్వమును జవి చూడ నెంత యుబలాట ముండదు!

తనకు సంతానము లేదనియు, అది జీవితమున నొక లోటనియు జక్కణాచార్యుఁ డింతవఱ కెప్పుడును దలంచియే

యుండలేదు. అట్లు తలంచుట కాతని కవకాశముగూడ లేదు. తన పితృదేవుని శిల్పకర్మశాలలోనే బాల్యమునుండియు నాతఁడు సుశిక్షితుఁడైనాఁడు. కళాయోగములో నాతని తపస్సులు పండినవి. యౌవన మంకురించినది మొదలు గొప్ప గొప్ప శిల్పములను నిర్మించుటలోనే యాతని కాలము గడచి పోవుచున్నది. తా నెప్పుడు ఉపనీతుఁ డాయెనో, తన కెప్పుడు వివాహము జరిగెనో, ఎప్పుడు భార్యాసమాగమము నందెనో యాతని కంతగాఁ దెలియదన్న నాశ్చర్యము లేదు. ఆ కార్యము లన్నియుఁ బెద్దవారియు, బంధువులయు, ముద్దు ముచ్చటలకు జరిగిపోయినవి. ఆ కార్యముల కాతఁడు నిమిత్త మాత్రుఁడుగా నిలిచినాఁడు. తన జీవితములో నా పనులకు ఉపాంగముల కున్న ప్రాధాన్యముగూడ లేదేమో. తన పండ్రెండవయేట దేవీసముపాసనము చేసి యామె సాక్షా త్కారము నందిన సంఘటనముమాత్ర మాతఁడు బాగుగా గుర్తుంచుకొన్నాడు. అది తన ప్రధానోద్దేశ్యమునకు సాధనము గావున మఱువ వీలులేదాయెను. శిల్పకళా సేవ, శాస్త్ర పరిశోధనము నాతనికి జీవిత ప్రధాన లక్ష్యములు. ఇట్లు అనన్య శిల్పయోగములో తపస్వియై సంచరించు నీ సంయమికి భార్య, బిడ్డలు, సంసారము, ధనము అను నంశము లెట్లు మదికిఁ బట్టును! ఈ సంస్కారములకుఁ దోడు వాని జీవితస్థితిగతులును కళానిర్మాణమునకే దారులు తీసినవి. తీఱికలేని యిట్టి శిల్పయోగ జీవిత నిర్వాహణములో సంతాన మను తలఁపు ఏ స్వప్నవీథిలోను వానికిఁ దోఁచలేదు. తండ్రి

నాగలింగస్థపతి యాశీస్సులో నొకసారి "సుపుత్రావాప్తి రస్తు" అన్న ధ్వని లీలగా నాతనికి వినఁబడ్డది. కాని యిటీవల నా మహనీయుఁడు గతించినాఁడు. మఱలఁ దనకా తలంపే పొటమరించు నవకాశములు శూన్య మయ్యెను. ఈ నాఁడు హఠాత్తుగా ప్రియురా లా విషయమునుగూర్చి చింతించు నప్పటి కాతఁ డొక్కసారి వెనుకకుఁ దిరిగి చూచు కొన్నాఁడు. దానికిఁదోడు శాస్త్రవాసన వాని హృదయ వీథిలో గుబాళించినది. "మానవుఁడు తీర్పవలసిన మూఁడు ఋణములలో పితౄణ మొకటి. ఈ ఋణము సత్సంతాన సౌభాగ్యముచేతనే తీఱును." స్వర్గస్థుఁడగు పితృదేవుఁడు చెమర్చిన కన్నులతో జక్కణ మనోనేత్రమున కగపడినాఁడు. ఇప్పు డాతని మదిలో నింతవఱకును బెత్తనముచేయు రాజకీ యాలోచన లెటకో పఱుగెత్తినవి. తనకు సంతానము కావలయునన్న మాట పాటింపఁ దగినదే. సౌపర్ణిదేవి తన కన్నులు దెఱపించినది. ఇంతవఱకు లేని సంతు తన కీ నాఁ డెట్లు కలుగును ? అస లింతదనుకను సంతానము లేకుండుటకుఁ గారణ మేమి ? విచిత్రములగు నిట్టి యూహలతో శాస్త్ర చక్షువగు నా శిల్పి యప్పటికిఁ బ్రియురాలి నోదార్చినాఁడు. ఆమెను దన యొడిలోఁ బరుఁడంబెట్టుకొని పాపట సవరించి, బుగ్గలు నిమిరి, చిబుకము పుణికి, చేతులను సవరించి, వక్షమును ముద్దిడి, ప్రేమరసము నొలికి యాదేవి హృదయ భార మును సగము తానుగూడఁ బంచుకొన్నాఁడు.

ఎంత యుత్తమ వంశమైన నేమి ? ఎంత యాదర్శ దాంపత్య మైననేమి ? ఎంత విద్య, విజ్ఞానము, శిల్పకౌశలము నున్ననేమి ? కులదీపకుఁడగు బిడ్డఁడు లేమి నా యాల్మగల కంతయు శూన్యముగాఁ గనఁబడెను. శాస్త్రవిశ్వాసము గల్గి సర్వశాస్త్ర రహస్యముల నెఱింగిన యా శిల్పి తనకు సంతు లేమికిఁ గారణము వెదకుచుండెను. వైద్యశాస్త్రానుసారము తమలో దోషము లేదు. ఆ యా గ్రహ నక్షత్రాదుల ప్రతిబంధకము లెవ్వియును లేవు. అయిన నేమి హేతువు ? ఒక్కదైవానుగ్రహము మాత్రమే తమయెడ సంపూర్ణముగా లేదని జక్కణ గ్రహించెను. పురాణాదుల యం దీశ్వరారాధనము చేసియు, తపస్సొనర్చియు సంతానమును బడసినవారి కథలను దాను జదివి యున్నాఁడు. కావున ఈశ్వరారాధనముచే పుత్ర రత్నమును బడయవచ్చునని యాతఁడు నిశ్చయించుకొనెను. మున్నొకసారి భల్లాళరాజు పశ్చిమసముద్ర తీరదేశమును లోఁబఱచుకొన దండయాత్ర వెడలెను. అప్పుడు జక్కణా చార్యునిగూడ సమరవ్యూహములు పన్న వెంటఁ దీసికొని పోయినాఁడు. దేశమును గెలిచి తిరిగి వచ్చునప్పు డానెగొంది యందు సరస్వతీ పీఠాధిపతులగు బ్రహ్మానందస్వామిని గలసి కొను నవకాశము జక్కణాచార్యునకు దొరకినది. బ్రహ్మా నందస్వామి వేదవేదాంగ పారంగతుఁడు. శిల్పర్షి యగు సానగముని గోత్రమునఁ బుట్టువు గన్న యా స్వామి యెఱుం

గని శిల్పశాస్త్ర రహస్యములు లేవు. ఇంక ననేక శాస్త్ర సంప్రదాయము లాయనకుఁ గరతలామలకములు. విశేషించి తపశ్శక్తిచే త్రికాల రహస్యముల నా సిద్ధపురుషుఁడు స్పష్టముగాఁ జెప్పుచుండువాఁడు. ఆయన జక్కణశిల్పితో నా యా శాస్త్రసందర్భములఁ జర్చించుచు "ఉత్తమశిల్పి యగువాఁడు విశ్వకర్మోపాసనము, విశ్వకర్మేష్టి చేయవలయుననియు, అట్లు చేసినఁగాని యా శిల్పాచార్యుని కార్యములు నిర్విఘ్నములు కాఁజాలవనియు" నొక రహస్యమును సప్రమాణముగా వివరించి యుండెను. ఇంకను ఆచార్యుని జీవితములోని భూత భవిష్య ద్విషయములను ముచ్చటించుచు "జక్కణాచార్యుఁడు మహాజాతకుఁ డనియు, చిరకాలమున కాతనికి సంతానము కలుగుననియు, చివరి జీవిత ఘట్టమున ఆప్తులచే నోటమి పొందుననియు" సూచించి యున్నాఁడు. ఆ యంశము లిప్పుడు జక్కణాచార్యునికి స్ఫురించినవి. ఆతని మనసులో వెన్నెల విరిసినట్లయినది. ఆడువారి మనస్సు యజ్ఞ దాన పూజా వ్రతాదులయం దాసక్తి కలదై యుండును గావున, సౌపర్ణీదేవి మనశ్శాంతికిని, కార్యసిద్ధికిని నా మహాశిల్పి విశ్వకర్మవ్రతము నాచరించి యా దేవు ననుగ్రహమును బడయ నిశ్చయించెను. ఇట్టి సంకల్పముతో నా దంపతు లైదు దినములు వేదమార్గమున విశ్వకర్మవ్రతము నాచరించి గాయత్రీ విశ్వకర్మల దివ్య ప్రసాదమునకుఁ బాత్రు లయిరి.

రాచఱికముచేయుట వెన్నతినుటవలె తేలికైన పని గాదు; మహాభారమైన కార్యము. ఎన్ని యా ఘాతములనో, చిక్కులనో, తంత్రములనో యెదుర్కొనవలసి యుండును. మానవుల మనస్సులు విచిత్రములైనట్టివి. ఒకరి యుద్దేశ్యము లొకరికి నచ్చవు. ఒకరి సంకల్పముల కొకరు సహకారము చూపరు. ఎవరి పుఱ్ఱెకుఁ బుట్టిన బుద్ధిని వారే గొప్పదని బహుమానించుకొనుచుందురు. వీరిలో నెన్నియో మతములు, జాతులు, తెగలు; వానిమధ్య సంఘర్షణములు. ఒక్క రాజ్యము లోని స్థితులే యిట్లుండ పలురాజ్యములతోఁ గూడిన పెద్ద దేశముమాట వేఱుగాఁ జెప్పనేల!

నాఁడు హొయసల రాజ్యము కొన్ని జటిల సమస్యల నెదుర్కొనవలసి వచ్చినది. అందు మొదటిది మత విప్లవము. పూర్వకాలమునుండియుఁ బ్రజ లవలంబించినది వైదికమతము. నేఁటి రాజుగారిది జైనమతము. ఈ మార్పుచేత దేశములోని హిందూమతాభిమానముగల కొన్ని జాతులవారు భల్లాళునే పదభ్రష్టునిఁ జేసి, మఱొక హైందవరాజును నిలుపవలయునని చూచుచుండిరి. కాని వీరభల్లాళుఁ డసాధారణుఁడు. తాను జైనమతస్థుఁడైనను ప్రజలను నిర్బంధముగా జైనులను జేయుట కాతఁడు పూనినవాఁడు కాఁడు. ప్రజలే రాజాను యాయులై ఆ యా ప్రయోజనములకోసము జైనులుగా మాఱిపోవుచున్నారు. ఇంకను భల్లాళుని యేలుబడియు వ్రేలు

పెట్టి చూప వీలుగానిది. దానికిఁ దోడాతఁ డద్భుతముగా శిల్పకళాసృష్టి చేయించి దేశగౌరవమును బెంపొందించు చున్నాఁడు. ఆయన పట్టమహిషి శాంతలాదేవి వైదిక మత ప్రీతితో హిందూశిల్పములను వెలయింపఁజేసి రాజ్యాంగము నందును జోక్యము తీసికొని ప్రజాపాలనమున భర్తకుఁ దోడు సూపుచున్నది. కీర్తిమతి జైనమతవ్యాప్తికిఁ దగురీతిఁ బ్రోత్సాహ మిచ్చుచున్నది.

ఇట్టిస్థితిలోఁ గొన్ని వర్గములవారు భల్లాళుని పతనము నకు దారులు వెదకుచున్నను, మూఁడువంతులకు పైఁబడియున్న మఱికొన్ని వర్గముల బలముచే వారియెత్తులు సాఁగుటలేదు. అయినను ఏ కాలమునందేని, ఏ దేశమునందేని కూటనీతి విశారదులగు చాణక్యులు లేకుందురా? అట్టి చాణక్యుల కూటనీతిచే నాఁడు హొయసలరాజ్యము వీరవిక్రమమును బ్రకటింపవలసి వచ్చినది.

హొయసలులకును చోళులకును గొన్ని తరముల నుండియు వైరము కలదని మన మెఱుంగుదుము. సమయమున కెదురుచూచుచున్న చోళులు వీరభల్లాళుఁడు కళాప్రియుఁడై రాజ్యకార్యముల నలక్ష్యము చేయుచున్నాఁడనియు, వలసిన సైన్యసంపద యాతనికి లేదనియును భ్రాంతిపడిరి. దీని కనుకూలముగా హిందూ మతాభిమానము గల విక్రమ చోళ రాజు నకు జైనుఁడగు భల్లాళుఁడు మత విరోధిగను జూపట్టెను. ఇందుకు హొయసల రాజ్యములోని మత రాజకీయ వర్గము

లును దోడ్పడి కుట్ర నడపినవి. అదివఱకు పరస్పర మంతఃకల హము లున్నను హొాయసల రాజ్యాక్రమణ మనుసరికి శైవు లగు పాండ్యరాజులును జోళులకుఁ దోడైరి. ఇట్టి కారణముల చేతను, బలముచేతను చోళులు హొాయసల రాజ్యముమీఁద దండయాత్ర చేయ సిద్ధపడినారు.

ఇట్లు హొాయసల రాజ్యము గొప్ప మతరాజకీయ విప్లవ మును, యుద్ధోపద్రవమునుగూడ నెదుర్కొనవలసి వచ్చినది. చాళుక్యులబలము కొంత భల్లాళున కున్నను అది సర్వసమ ర్థము గాదు. తక్కిన చతురంగబలములు, కొందఱు దండ నాథులు మొదలగు రాజకీయోద్యోగులు క్రొత్తగా సంపా దించిన రాజ్యమునకు నిలకడఁగూర్చు పనిలో నియుక్తులై యున్నారు. ఇట్టి విషమసమయమునఁ గలిగిన యీ యుప ద్రవము నెదిరించుటకే గడచిన మూఁడు దినములనుండియు అక్కన్న మహామంత్రియు, జక్కణాచార్యుఁడును, మహా సేనాని గాంగరాజును, "శ్రీమతు యాదవనారాయణ ప్రతాప చక్రవర్తి హొాయసల వీరభల్లాళదేవ రాజ్యసముద్ధారక" బిరుదాంకితుఁడగు బసవన దండనాయకుఁడును, సోమన దండ నాయకుఁడును, సోమాజీయాచార్యుఁడును, హరిహరదేవుఁ డును, శివకీర్తిదేవుఁడును మహారాజుగారితో నెడతెగకుండ మంతనములు సలుపుచుండిరి.

ఆనాఁడు సూర్యోదయానంతరమే మంత్రాగారమున నాలోచనలు ప్రారంభమైనవి. అనేకు లనేక మార్గములను సూచించుచున్నారు. రాజున కేవియు నచ్చుట లేదు. రాజ

ధానినుండి రాజేంద్రుఁడు కదలకుండఁగనే యీ కార్యము చక్కఁబడ వలయును. జన్మములో నింకొకసారి చోళరాజులు హొయసల రాజ్యాక్రమణమునకుఁ బూనకుండునట్లు బుద్ధి తెచ్చుకొనవలయును. వారి మత దురభిమానమును గాఁటఁగలుప వలయును. ఇట్టి రాజకీయతంత్రము నా నాఁడు భూపాలుఁడు వెదకుచున్నాఁడు. ఎవరికిని సరియగు నాలోచనలు పాలు పోలేదు. మధ్యాహ్న కాల ఘంటికలును మ్రోసినవి. తుట్ట తుదకు జక్కణాచార్యుఁడీ మార్గమును సూచించెను.

"ప్రభూ, కలియుగార్జును లగు మీకుఁ జోళనిగ్రహ మొక లెక్క కాదు. ఈ కార్యమునకు ప్రభువులే పోవలసిన యవసరము లేదు. బసవనదండనాయకుఁడును, సోమనదండ నాయకాదులును "కొంగు—గంగవాడి" దేశములను జయించి అలసియున్నారు గావున వారి నిప్పుడే చోళనిగ్రహమునకుఁ బంపుట యుక్తము కాదు. ఈ కార్యమునకు మహాసేనాని గాంగరాజును, హరిహరదేవ, కీర్తిదేవాదులును బూను కొనుట కర్హులు. మన మహామంత్రి అక్కనగారి బుద్ధిచాతుర్య ముతో వీరు సమరమున విజయలక్ష్మిని గైవసము చేసికొనఁ గలరు. గాంగరాజు శౌర్యపరాక్రమములు మీ రెఱుంగనివి గావు. ఆయన భుజబలముచేత నేగదా హొయసల సామ్రాజ్య లక్ష్మి పడమటిసముద్రపు టంచులమీఁదఁ గూడ బొమ్మరిండ్లు కట్టుకొన్నది. దక్షిణమునఁ గడపటికొనలు చూచి మురిసినది. ఉత్తరమునఁ దుంగభద్రానదీ జలములను జవి చూచి యచ్చటఁ దమపేర భల్లాపురమును నిర్మింపఁ జేసినది,

సాటిలేని యీ సేనాయకుఁడు మన దండ నుండ దేవరకుఁ గొఱఁతయేమి? విశాలమగు నీ హొయసల సామ్రాజ్యమున నాతఁ డాక్రమింపనున్న చోళ ప్రాంతము నాతఁడే మండలేశ్వరుఁడై యేలుకొనుఁగాక. దీనిచే మహారాజు కార్యభారమును గొంత తగ్గఁగలదు. కావలయునన్న, యుద్ధవ్యూహములు పన్నుటకు మన యనంతకీర్తిస్థపతిని, సోమాజీయాచార్యునిఁ దీసికొనిపోవచ్చును. కావున వెనువెంటనే సముచిత పరివారముతో గాంగరాజును చోళులఁ బాఱఁద్రోలఁ బంపుఁడు. ఆతనికి మహామంత్రి బాసటయై వెడలును. తక్కిన సైన్యమిప్పటి కిక్కడ నున్నదియే చాలును. ఈ శరదృతువుగూడ మన యుద్ధోత్సాహమును వృద్ధిచేయుచున్నది.

జక్కణాచార్యుని మాటలు ముగిసీ ముగియకముందే రాజేంద్రుని చూపులు మహామంత్రిమీఁదుగా గాంగరాజుపైఁ బడెను. అక్కనమంత్రి శిల్పాచార్యుని యాలోచనము సమంజసమని బలపఱచినాఁడు. గాంగరాజు "మహాప్రభువులయాజ్ఞయైనచో త్రుటికాలములో చోళ పాండ్య సైన్యములను ప్రాగ్దక్షిణ సముద్రముల నీళ్ళు త్రావింతును. హొయసల సామ్రాజ్యములో సూదిమొన యంతటి నేలనుగూడ విరోధుల వశము గానీకపోఁగా, తమిళ ప్రాంతములఁగూడ గలుపుకొని మన సామ్రాజ్యమును విస్తరింపఁ జేయుదును. చోళ పాండ్య దేశ భాగములందును మన జయస్తంభముల నాటించెదను. దేవర యనుగ్రహమున్నఁ జాలును. తాము కడుపులో నీరు కదలకుండ సింహాసనముననే యుండి రాజ్యకార్యములఁ

జూచుకొనుఁడు" అనెను. ఈ మాటలు వినునప్పటికి భల్లాళుని హృదయభారము తగ్గిపోయినది. ఆతని ముఖములో నానంద రేఖ లలముకొన్నవి. ఇంతలో జక్కణశిల్పి మఱల నిట్లనెను.

"దేవర దివ్యచిత్తమున నొక్కటిమాత్ర మవధరింప వలయును. ఇది యొక రాజకీయపు టెత్తు. దీనిని మహారాజు గారు వేఱుగా భావింపక దూరదృష్టితో నర్థము చేసికొందు రని నమ్ముచున్నాను. ఇంతవఱకును యుద్ధముల కేగునపుడు మన తేరులపై జైనమత చిహ్నముగల ధ్వజము లెగురు చున్నవి. దేవర యీ సంప్రదాయము నీ సమయమునఁ గొంత మార్పవలయును. హిందూమత చిహ్నముగల టెక్కెములతో నేఁటి సంగ్రామమునకు మన సైన్యము సిద్ధపడవలయును. ఈ మార్పుచేత గొప్ప ప్రయోజనము సిద్ధింపఁగలదని నేను భావించుచున్నాను. నా యీ యభిప్రాయములో రాజవంచన మే మాత్రమును లేదనియు, నిది ప్రకృత కార్యమును సాధింప ప్రబలసాధనము గాఁగలదనియు నేనూహించితిని. ఫలమునుబట్టి దీని రహస్యము దేవరకు తరువాతఁ దేటపడఁగలదు."

శిల్పాచార్యుని ఈ ప్రతిపాదనమును అక్కన మంత్రి పూర్తిగా బలపఱచినాఁడు. అక్కన మంత్రి కిట్టి యభిప్రాయ మిదివఱకే గలదు. కాని రాజు తన్నపార్థము చేసికొనునను భీతిచే నెప్పుడును సూచించినవాఁడు కాఁడు. అక్కన మీఁది కంటె జక్కణ మీఁద మహారాజునకు భక్తిగౌరవములు మెండు. సహజ వైరాగ్యశీ యగు జక్కణ. -స్వార్థము

నెఱుంగని యీ శిల్పి రాజ్యశ్రేయస్సునకే యేదేని చెప్పునని రాజహృదయము విశ్వసించినది. ఆతఁ డాచిఱు మార్పున కంగీకారము చూపినాఁడు.

వారు సభ చాలింపఁబోవు నంతలో నొక భటుఁడు వచ్చి — "స్వామీ, దేవోజు శిల్పాచార్యులవా రంతయు సిద్ధమైనదనియు, తమ రాకకే యెదురు చూచుచున్నా మనియుఁ గబురంపిరి. ఆపై దేవర చిత్తము." అనెను. సభ లోనివా రెల్లరు నాశ్చర్యపడిరి. వారి కీ వృత్తాంత మేమియు బోధపడ లేదు. వారు మహారాజు నిష్టప్రకారము గుఱ్ఱముల నెక్కి- వైశాలేశ్వరాలయమునకు వేయి గజముల దూరమున క్రొత్తగా నిర్మింపఁబడిన దేవాలయముల కేఁగిరి. అచ్చట దేవోజు శిల్పి యే వారికి స్వాగత సత్కారములు చేసినాఁడు. ఆతడు జైన తీర్థంకరుల విగ్రహములతోఁ దాను దీర్చి కట్టిన దేవాలయములను వరుసగా వారికిఁ జూపఁ బూనెను.

అయిదాఱు దేవాలయములు, అందలి మహత్తర శిల్పములు వీరికి కనులపండువు చేసినవి. అదిగో! పార్శ్వనాథ దేవస్థానము. అందలి అద్భుత శిల్పముల నర సేయక తిలకింప వలయును. ఆ దేవాలయ స్తంభములపై తీఁగెలు, పూలు, మూర్తులు నేవియు లేవు. అవి నునుపుదేరి అద్దములవలె నున్నవి. వానిపై నీళ్ళుపోసి విస్పష్టముగా ప్రతిబింబమును జూచుకొనవచ్చును. దేవోజు చెప్పగా భల్లాళుఁ డా స్తంభము మీఁద తన ప్రతిబింబమును జూచుకొన్నాఁడు. వాని

మోములో నబ్బురపాటు చెంగలించినది. ఆతఁ డిట్లన్నాఁడు— "ఆచార్యా! ఇదియేమి విచిత్రశిల్పము? నా కేమైనను మతి చెడినదా? లేక యీ శిల్పమహిమయా? నా మూర్తి యిట్లు నడుము పైభాగమునఁజకే యగపడుచున్న దేమి? ఆఁ, కాదు. దిగువకాయ మన లగపడక, రెండు పూర్వకాయ ములును తలక్రిందులుగా నడుమువద్ద నతికించినట్లు కనబడు చున్న దిదేమి వింత! ఇది నా కొక్కనికా, మీకుఁగూడనా?"

తరువాత గాంగరాజును, మహామంత్రియు, నాచా ర్యుఁడును, సోమన దండనాథాదులును దమ ప్రతిబింబములఁ జూచుకొన్నారు. వారి శరీరములును అట్లే తోఁచినవి. పిమ్మట వారు మఱొక స్తంభములోఁ దమ నీడలఁ జూచు కొనిరి. అందు నిలువునను అర్ధభాగమునఁజకే వారినీడ లగపడి నవి. ఒక కంబములో కుడి యర్ధభాగమును, మఱొకదానిలో నెడమ సగభాగమును మాత్రమే వారి కగపడెను. ఇంకొక కంబములో రెండుకుడిపార్శ్వములును నతికించినట్లును,మఱొక దానిలో నెడమపార్శ్వము లతికించినట్లును దోఁచెను. మఱొక స్తంభములో ప్రతిబింబ మంతయు తలక్రిందులై యగపడెను. ఇట్లెన్ని చిత్ర విచిత్ర ప్రతిబింబములనో వా రా వింత కంబము లందుఁ జూచుకొని యాశ్చర్య సముద్రమున మునుకలుపెట్టిరి.

ఈ విచిత్ర శిల్పరహస్య మేమి? అది యా ఱాలలో నున్నదా? వానిని తొలిచి మలచిన ఆ శిల్పి చేతిలో నున్నదా? ఏమో! ఇది యంతయు నా మహాశిల్పికే తెలియ

వలయును. మహారాజు మనస్సులో ద్వారసముద్రమున జైన శిల్పములు లేని కొఱంతను గనిపట్టి, రాజాదేశము లేకయే యిట్టి యద్భుత శిల్పనిర్మాణము చేసిన దేవోజున కేమిచ్చి యాతఁడు ఋణవిముక్తుఁడు గాఁగలఁడు! తన మెడలోని పచ్చల పతకముతోడి రత్నహారమును దీసి దేవోజు మెడలో వేసి యొక్క నమస్కారము పెట్టి "ధన్యోస్మి" అనినాఁడా కళారాధకుఁడు. ఆ శిల్పి చేఁత కది ప్రతిఫలమా? కాదు. రాజు మనస్తృప్తి కది యొక చిహ్నము. అతని కృతజ్ఞత కది యొక చిన్న నిదర్శనము. భూపాలుఁడు నా శిల్పియు శాశ్వతులు కారు. ఆ శిల్పిరచించిన ఆ అద్భుత శిల్పములు శాశ్వతములు. అవి ప్రపంచములోని కళారాధకుల దృష్టిని సమాకర్షించి తమ తండ్రియగు శిల్పిని సదా స్మరింపఁ జేయుచునే యుండును.

హిందూదేశమున విశిష్టాద్వైత మతమును బునరుద్ధరించి ప్రచారము చేయుటకై తమిళనాడులోని శ్రీపెరుంబుదూరునందు శ్రీమద్రామానుజాచార్యుల వారవతరించినారు. ఆయన వేద వేదాన్తములను గడ ముట్టఁ జదివి తనకుఁ బూర్వమే వెలసిన శంకరాదుల యద్వైతాది మత సిద్ధాంతములనుగూడ జీర్ణింపఁజేసికొన్న మహనీయుఁడు. కాని, శంకరాచార్యుల జగన్మిథ్యావాదము, అద్వైత సిద్ధాం

తము నాతనికి నచ్చలేదు. ఈ సర్వ బ్రహ్మాండములను శ్రీమహావిష్ణువే సృష్టించినాఁడనియు, ఆ దేవదేవుని జేరు కొనుటకు భక్తి ప్రపత్తులే సాధనము లనియు నాయన గుర్తించెను. కులభేదములకుఁగూడ నాతఁడు ప్రాధాన్య మొసంగలేదు. భక్తి జ్ఞాన సదాచారములు గలవాఁడు అంత్యజుఁ డైనను ఆరాధనీయుఁడే యని ఆయన సిద్ధాంతము. ఆ నమ్మికతోడనే రామానుజుఁడు వైశ్యుఁడైన తిరుకచ్చి నంబి నాశ్రయించి కంచిలోని వరదరాజస్వామి యనుగ్రహ మునకును బాత్రుఁ డయినాఁడు. తన గురు వుపదేశించిన తిరుమంత్రమును వర్ణభేదము పాటింపక అందఱకును ఉపదే శింపఁ గంకణము కట్టుకొన్నాఁడు.

అసలు వైష్ణవమతములోనే కులభేదములకుఁ బ్రాధా న్యము లేదు. వైష్ణవులైన ఆళ్వారులలో బ్రాహ్మణులు మొదలుకొని చండాలురవఱకు నున్నారు. వా రందఱు పూజార్హులే యని ఆమతము చెప్పుచున్నది. ఏ మనుష్యుఁడు గాని గుణములనుబట్టియు, ప్రవర్తనమునుబట్టియు మహాత్ముఁ డగును గాని, పుట్టుకచేత మాత్రమే యగునా ?

రామానుజాచార్యుఁడు శంకరుల యద్వైతమును, జ్ఞాన ప్రధాన వాదమును బూర్వపక్షము చేసి, శ్రీమన్నారాయ ణుని పరాత్పరత్వమును బ్రతిపాదించు విశిష్టాద్వైతమును నెల కొల్పెను. భక్తిప్రధాన మగు నా మతమును బ్రచారము చేయుటకే తన జీవితము నంతయు నా మహనీయుఁడు వెచ్చించి

నాఁడు. తమిళ కర్ణాటాములందే గాక, ఆంధ్రాది ప్రదేశము లందును దన్మతమును వ్యాపింపఁజేయవలయునని యాతని సంకల్పము. దేశ మంతటను విష్ణుదేవాలయములను గట్టించి వైకుంఠములోని ఆ శ్రీమన్నారాయణుని ప్రతిరూపములను, వివిధావతార మూర్తులను వానియందుఁ బ్రతిష్ఠింపఁజేసి భూలోకమును రెండవ వైకుంఠముగా మార్పవలయునని యా మహా మతప్రవక్త సంకల్పించుకొన్నాఁడు. ఇట్టి సంకల్పముతో నాతఁడు మున్ముందు తాను జన్మించిన తమిళ దేశములో వైష్ణవ మత ప్రచారము నారంభించెను. పలు పండితులను వాదోపవాదములలో నోడించుచు, స్వీయ మత సిద్ధాంతములను వారిచే నంగీకరింపఁ జేయుచుండెను. పండితులు, పామరులు నను భేదములేక, అందఱును రామానుజుల సిద్ధాంతములకు లొంగిపోయి యాతని మతములోఁ బ్రవేశింపఁ జొచ్చిరి. ఇంతవఱకును చోళదేశములో నున్న శైవ మతమునకు రామానుజుల మతప్రచారముచే గొప్ప యాఘాతము కలిగినది. ప్రజలు శైవమా, వైష్ణవమా యను సందేహములోఁ బడి యూఁగులాడఁ జొచ్చిరి.

శైవమతాభిమాని యగు చోళరాజునకీ రామానుజుల ప్రయత్నము దుస్సహమైనది. ఆతఁ డెన్నివిధములనో వైష్ణవ మతప్రచారము మానుమని రామానుజుని మందలించినాఁడు. రామానుజుఁడు వినలేదు. ''నేను నమ్మిన సిద్ధాంతమును గూర్చియు, నేను దర్శించిన దేవదేవునిగూర్చియు నాతోడి ప్రజలకు బోధించుటయు, వారిని సంసార సముద్రమునుండి

యొద్దు చేర్చుటయు దోషములు కా''వని రామానుజుఁడు ప్రభువునకు సమాధానము చెప్పెను. విశేషించి ఆయననుగూడ వైష్ణవమత స్వీకారముచేసి ధన్యత గాంచవలసినదనియు నెచ్చరించినాఁడు.

తర తరములనుండి తారకమార్గముగాఁ దాను విశ్వసించిన శైవమతమును, ఈనాఁ డొక్క పండితమాత్రుని ప్రబోధమువల్ల వదలుకొని వైష్ణవ స్వీకారము చేయుటకుఁ జోళరా జంగీకరించునా? అతఁ డందు కొప్పుకొనలేదు. మీఁదుమిక్కిలి రాజధిక్కారము చేసినాఁ డనియు, నూతన మతప్రచారముచేత దేశములో అలజడులు లేపి శాంతికి భంగ మొనర్చుచున్నాఁడనియు నేరము లారోపించి చోళరాజు రామానుజుని నానాహింసలు పెట్టుచుండెను. ఎన్ని హింసల కైనను నోర్చుకొని యాతఁడు దైవాదేశముగా నెంచిన తన మతప్రచార కార్యమును కొనసాఁగించుచునే యుండెను.

కట్టకడపటికి విసిగిపోయిన చోళరాజు రామానుజునిఁ జంపవలసినదని యాజ్ఞ యిచ్చెను. ఈ వృత్తాంత మంతయు స్వదేశమునందును, పరిసర దేశములందును వ్యాపించెను. రామానుజుఁడు తన ప్రాణరక్షణార్థమును, మత ప్రచారార్థమును దేశాంతరములకుఁ బలాయనము కావలసిన స్థితియు నేర్పడినది.

చోళరాజు దేశమున మఱల శైవమతమును నెలకొల్పు మార్గముల నాలోచింప మొదలుపెట్టెను. ఆయన మనస్సులో

జక్కణాచార్యుఁడు మొదలినాఁడు. "ఆ యాచార్యుఁడు నాగ లింగస్థపతి కుమారుఁడు. వీరి కుటుంబము తర తరముల నుండియు శైవమత ప్రధాన మైనది. విశేషించి ఈ శిల్పులు శక్తిపూజా పరాయణులు గూడ. చేతితో శైవశిల్పముల వెలయించియు, నోటితో శివ పరాత్పరత్వము నుగ్గ డించియు, ఆచరణముచే శివమహిమలఁ బ్రతిపాదించియు జక్కణాచార్యుఁడు దేశమునఁ గదలిపోయిన శైవమతమును మఱల స్థిరీకరింపఁగలఁడు. నిజమే. కాని, ఆయన తన కెట్లు చిక్కును? తనకు విరోధియే కాక, జైనమతమువాఁడును నైన వీరభల్లాళుని హొయసలరాజ్యములో నా డుండి పోఁ బనాఁడు. అతని రప్పించుకొను టెట్లు?' ఈ విధమున చోళభూపాలుఁడు తనకు గాఢముగా నున్న మతోన్మాదముతో పెద్దకాల మాలోచించినాఁడు. తుట్టతుద కాతని కొక యుపాయము తట్టినది.

"వీరభల్లాళుఁడు గాఢమైన శిల్పకళాభిమానము గల వాఁడు. శిల్ప మెవ్వని రాజ్యమున విస్తరింపఁ జేయవలయు నన్నను నాతఁడు కాదనఁడు. కావున ఏ మహనీయ శిల్ప ములో చోళమండలమునఁ గ్రొత్తగా నిర్మింపవలసియున్న దని ఆ శిల్పాచార్యుని రప్పించుకొని మనోరథ సిద్ధి పడయ వచ్చును. ఒక పక్షమున వీరభల్లాళుఁ డిందు కంగీకరింప కున్నను, జక్కణాచార్యుఁడు నూతన శిల్పనిర్మాణమునకే కంకణము కట్టుకొన్నాఁడు గావున రాజానుమతి నపేక్షింప కయు, చోళదేశమునకు రాఁగలఁడు. అప్పుడు శిల్పనిర్మాణ

ముతోఁబాటు మతప్రచార కార్యమునుగూడఁ బూర్తి చేసి కొనవచ్చును.''

ఈ విధముగా నాలోచించి వెనువెంటనే తన యభిప్రాయమును దెలుపుచు జక్కణాచార్యుని రాకకై వినయపూర్వకమగు నొక లేఖ నాతఁడు వ్రాసి చారునిచేఁ బంపించెను.

౮

జక్కణాచార్యునికి మంత్రిపదవి నొసంగి ఆస్థానములో నుంచుకొన్నచో, తన రాజ్యమున కే లోపము నుండదని భల్లాళ భూమిపతి తలంపు. కాని యీ వాంఛ యెంతవఱకు నెఱవేఱును ? జక్కణాచార్యుఁడు మంత్రిపదవినే గాదు, మహారాజ పదవినైనను ద్రోసిరాజను నిరీహుఁడు. ఆస్థాన శిల్పిగా నుండుటకే యాతఁడు చాలకాల మొప్పుకొనక, తుట్టతుదకు మహారాజు ప్రార్థనచే నెట్టెట్లో యంగీకరించినాఁడు. తా నా పదవిలో నున్నను తనస్వేచ్ఛకు భంగము రాఁగూడదు. తన తపో దాన వ్రతానుష్ఠానములకు సంపూర్ణ స్వాతంత్ర్యముండవలయును. తా నే దేశమునకు ఎట్టి శిల్పకల్పనమునకుఁ బోవలయునన్నను ఆటంక ముండ రాదు. ఇన్ని కట్టుదిట్టములతోఁగాని యాతఁ డా గౌరవస్థానము నలంకరింప లేదు. జక్కణ యెవరి యాస్థానములో నున్న వారికే గౌరవము గాని, ఆ యాస్థాన స్థితివలన నీయనకు వచ్చు గొప్పఁదన మేమియు లేదు.

జక్కణాచార్యున కిటీవల రాజకీయములలోఁగూడఁ బాల్గొనవలసివచ్చెఁగదా. అది యతనికి బొత్తిగానిష్టము లేదు. అయినను దేశోపకార కార్యముగావున నాతఁ డందు కియ్యకొనక తప్పలేదు. తన మేధను, నేర్పును లోకోపకారమునకు సమర్పించుటకే బుద్ధిమంతులు చూచుచుందురు. ఇప్పుడాయన చేయుచున్న శిల్పకార్యములుగూడఁ జాలవఱకుఁ బూర్తి యయినవి. అంతయో యింతయో కొఱంతయున్న దేవోజు ప్రభృతు లా పని పూర్తిచేయఁగలరు. సౌపర్ణి దేవికి నవమాసములు గూడ నిండుటచేత, ఆయన సకుటుంబముగ సముచిత పరివారముతో హాసన్ నగరమునకు విచ్చేసెను. మహారాజున కీయనను వీడ్కొనుట యిష్టము లేదు. ఆతఁడు జక్కణ నెపుడును రాజధానియందే యుంచుకొనఁ జూచుచుండును. అది యా శిల్పి కిష్టము కాదు. అవసర మైనప్పుడు వచ్చుచుఁ బోవుచు నుండవచ్చునని, రాజధానీ నివాసమున కాయన యియ్యకొనఁడు. మఱియు తన శిల్పవిద్యా గురుకులమును నడపుకొనవలసిన బాధ్యతగూడ నామహాశిల్పికిఁ గలదుగదా!

సౌపర్ణి దేవి గర్భవతి యను వార్త హాసన్ నగరమున కెల్ల నానందమును బంచిపెట్టినది. బంధువులయు, మిత్రులయు, శిష్యప్రశిష్యులయు సంతోషోత్సాహములకు మేరయే లేదు. ఆమెకుఁ బ్రసవకాలము సమీపించినది.

విశాలమగు నా సుందర సౌధములో నొకగది పురిటింటికై ప్రత్యేకింపఁబడెను. అందుంచవలసిన పరికరములన్నియు నుంచిరి. వృద్ధాంగనలు, ముత్తైదువలు, నేర్పరులగు దాదులు

పలువు రా చూలాలికి శుశ్రూషలు చేయుచు ప్రసవ సమయము నకై యెదురుచూచుచుండిరి. ఆసుప్రభాత వేళ భాస్కరుఁడు తన బంగారు కరములతో పుడమిచేడియ నుపలాలించు చుండెను. మలయ గంధవహుఁడు కావేరీ పవిత్రోదకముల స్నాన మాడి, తమ్మిపూవుల నెత్తావులఁ గుమ్మరించుచు విహరించు చుండెను. ప్రకృతి యంతయు సౌందర్య పులకితమై యుండెను. జ్యోతిషికాగ్రగణ్యుఁడగు జక్కణాచార్యుఁడు స్నాన సంధ్యా దులు నెఱవేర్చుకొని ప్రాతఃకాలిక భగవత్పూజల నెఱపి గంటమును దాటియాకును కేల ధరించి, బిడ్డ జాతకమును వ్రాయు వేడుకతో మందిర బహిర్ద్వారమున దర్భాసనముపైఁ గూర్చుండి యుండెను. బిడ్డ నేలపైఁ బడిన వెంటనే నిమ్మ పండొకటి తన యొద్దకు దొరలించుమని జక్కణ ముందుగనే దాది కాజ్ఞ యిచ్చి యున్నాఁడు.

లోపలి గదిలో నొప్పులు పడుచున్న యా పుణ్య సాధ్వి కొంతసేపటి కీశ్వరానుగ్రహమున సుఖముగనే ప్రస వించెను. పుణ్యాంగనలు "మగశిశువు, మగశిశు"వని సంతస ముతోఁ బలికిరి. వెనువెంటనే యొక దాది నిమ్మపండు నాచార్యుని చెంగటకు దొరలించినది. కుట్టిమ ప్రదేశమున దొరలుచు వచ్చిన యా పండు దుర్దైవవశమున నొకగుంట్రాతిని దాఁకి మఱల వెనుక కేగెను. అందుల కా దాది చాల నొచ్చు కొనుచు, మఱల పండును విసరి యజమానుని వద్దకుఁ జేర్చెనే గాని, పని తొందరచేతను, మగశిశువను సంతసముచేతను

జరిగిన దాని నాచార్యునకు నివేదింప మఱచెను. విధి విధానము ననుసరించియే మానవులకు బుద్ధులు పుట్టుచుండు నను మాట యేల కల్ల యగు?

జక్కణాచార్యుఁడు తాటియాకుపై జాతక చక్రమును లిఖించుచుండెను. కాని యాతని మోము వెలవెలపోవు చున్నది. మనస్సులో సంతోషము లేదు. తన పొరపాటేమో యని మువ్మారు గణితముచేసి, గ్రహములను రాశులయందిడి, గ్రహస్ఫుట మొనర్చి, షడ్భావముల నారసి ఫలముల నాలో చించినాఁడు. శిశుజాతకము గొప్పదనియే తేలుచున్నది. అంత యద్భుత జాతకము నాతఁ డింతవఱ కెన్నడును జూచి యుండ లేదు. జాతక మెంత మంచిదైన నేమి? శిశువు జారిణీ భవుఁ డని తేలుచున్నది. ఇది యెట్లు? పతివ్రతా లోకమున కెల్ల నొజ్జబంతి యగు సౌపర్ణి దేవియెడ నిట్టి సంకల్పము మహాప రాధము. అగ్నికిఁ జెద లంటవచ్చును. తీర్థోదకములు పవిత్ర తను గోల్పోవ వచ్చును. ఇంక నాయా భూతములు తమ తమ ధర్మములను వీడ వచ్చును. కాని సౌపర్ణిమాత్ర మిట్టి దూఱున కర్హురాలు కాదు. ఇట్టి దోషము నామెపై వేసి, జక్కణ శిల్పి లోకధిక్కారమునకు గుఱి కావలసినదే. అస లెట్లు వేయఁగలఁడు? ఎట్టి విరోధిగాని సౌపర్ణి దేవి శీలమునకు నమస్కరింపక తప్పదే! అయిన శాస్త్రమే తప్పు కావలయునా? శాస్త్రములయం దసాధారణ ప్రామాణ్య బుద్ధి గల తానే శాస్త్రము కల్లయన్న నిఁక నది యెవ్వరికి విశ్వాసార్హ మగును?

జక్కణాచార్యుని హృదయములోఁ బెద్ద తుపాను చెల రేఁగినది. సాధ్వియగు భార్యను శంకించుటా ? లేక శాస్త్రమును నిందించుటా ? ఆతని మనస్సున కెట్లును పాలుపోవలేదు. పరిజనులు, బంధువులు, శిష్యులు, ఇతర శిల్పులును కుమారాభ్యుదయ సందర్భమున నుత్సాహముతో నాయా కార్యములఁ దీటిక లేక యున్నారు. తమ యాచార్యుని హృదయ క్షోభను గుర్తించుట కెవ్వరికిని దీటిక లేదయ్యెను. జక్కణ యెట్టకేలకు శాస్త్రవిశ్వాసమును సడలించుకొనలేక పోయి నాఁడు. మహాసాధ్వియగు ధర్మపత్ని యెడను హృదయపూర్వకముగా దోషారోపణము చేయలేక పోయినాఁడు. ఇది యంతయు నొక విధివిలాసముగా భావించెను.

ఇంతకుముందే చోళభూపాలుఁ డంపిన లేఖ జక్కణాచార్యున కందినది. దేశమునఁ బొటిల్లిన మత విప్లవములకు, మత దురభిమానములకు నాతఁ డెంతగానో బాధపడినాఁడు. వివిధ రూపములతో, వివిధ నామములతో నున్న యేకైక సద్వస్తువగు భగవత్తత్త్వమును గూర్చి మనుష్యు లర్థము చేసికొనఁ జాలమి కాతఁడు మిక్కిలి చింతించినాఁడు. శిల్ప కళా నిర్మాణముతోఁ బాటు మత విరోధములను గూడఁ బరిహరించి సమన్వయ మార్గము చూపవలసిన యావశ్యకత వర్తమాన తాత్త్వికుల కున్నదని యాతఁడు గుర్తించినాఁడు. శిల్పనిర్మాణము మాట యెట్లున్నను, శ్రీమద్రామానుజులకుఁ బొటిల్లిన సంకటమును నివారించుట కైనను జోళమండలము నకుఁ బోక తప్పని స్థితి యేర్పడినది.

"రామానుజుఁడు కారణజన్ముఁడు. ఆయన మరణింప రాదు. అంతటి మహానుభావుఁడు దీర్ఘాయువై తన జీవితోద్దేశ్యమును నెఱవేర్చుకొనవలసినదే. లేకున్న లోకమునకు తీఱని నష్టము. ఇందుకు నీవంతు పనిని నీవు చేసి తీఱవలయును. నీ కుటుంబము మాట తరువాత. ముందు విశ్వకుటుంబమున కుపకరింపవలయును." అను మాటలు జక్కణాచార్యుని అంతర్ హృదయమున నెవ్వరో పలికిన ట్లాతనికి స్ఫురించెను.

ఇట్టి స్థితిగతులు, అంతః ప్రబోధము కారణములుగాఁ గొంతకాలము జక్కణాచార్యుఁడు గృహపరిత్యాగము సేయుట కర్తవ్య మని నిశ్చయించుకొనినాఁడు. గంటమును, తాటియాకును అక్కడనే పాఱవైచి యాతఁ డా సుప్రభాతముననే వెడలిపోయెను.

ఆ నాఁడు ద్వారసముద్రము విజయోత్సవ సంరంభముతోఁ గళకళ లాడఁ దొడఁగెను. వీథు లెల్లను అలంకరించిరి. ఇంటింటను ద్వారములయందు మామిడాకుల తోరణములను వ్రేలఁ గట్టిరి. ముంగిళ్ళయందు కస్తూరి కలయంపి చల్లి ముత్యాల ముగ్గులు పెట్టిరి. రచ్చపట్టులు నృత్య గీత వాద్యములతో మాఱుమ్రోగుచుండెను. వీథులలో బాలురు "నోణంబవాడిగొండ, తలకాడుగొండ, వీరగంగ, వీర భల్లాళ మహారాజునకు జై! చోళగజ కేసరికి జై! శిల్పకళా

పోషకునకు జై! మహాసేనాధిపతి గాంగరాజునకు జై!" అని కేకలు పెట్టుచు నాడుచు, హొయసల రాజ్య విజయ గీతములను బాడుచు త్రుళ్ళింత లిడుచుండిరి. పట్టణములోని యువకులందఱు నేదియో గొప్ప వేడుక చూచు నుత్సాహముతో తొందర తొందరగా నాయా పనులను ముగించుకొనుచుండిరి. మహిళలుగూడ "ఆ రత్నాభిషేక మహోత్సవమును మనము గూడ కనులారఁ జూచి ధన్యురాండ్రము కావలయు" నను కొనుచు నింటి పనులను ముగించుకొనుచుండిరి. ఆ నాఁటి నగరోత్సాహము చెప్పఁదరము గాకుండెను.

గాంగరాజు చోళులను బాఱఁద్రోలి సేలము, కోయంబత్తూరుల వఱకును హొయసల సామ్రాజ్యమును విస్తరింపఁజేసి విజయలక్ష్మిని జేపట్టి వచ్చుటయే యీ యుత్సవములకుఁ గారణము. ఈ యుత్సవ సందర్భముననే మహావీరులకును, దండనాథులకును, గెలుపునకుఁ దోడ్పడిన యెల్లవారికిని యథోచిత సన్మానములు నాఁడు జరుగనున్నవి. దక్షిణాపథ శిల్పి చక్రవర్తి, అద్వితీయ శిల్పజ్యోతి జక్కణాచార్యుల వారికి రత్నాభిషేకమును, డేవోజు శిల్పికి కనకాభిషేకమును ఈ సందర్భముననే మహోత్సాహముతో జరుప వలయునని భల్లాళరాజు ముహూర్తనిర్ణయము చేసి యున్నాఁడు. ఇది యంతయు మహారాజు కొలువుదీఱు నట్టి విజయమండపము లోనే. ఆ నాఁ డా మండపము సొబగు చెప్ప నలవి గాకున్నది. పంచశత సంఖ్యాకులగు శిల్పులు, చిత్రకారులు, వాస్తువిశారదులు నామండపము నలంకరించియుండిరి. గోడలకు

మహాపురుషుల వర్ణచిత్రములు వ్రేలఁగట్టఁబడినవి. జైన హిందూమతములకుఁ జెందిన పలు దేవతలయు, మహామహు లయుఁ జిత్తరువులుగూడ నా మండపమున వెలుఁగొందు చుండెను.

సాయంకాలము నాలుగు గంటలకు సభ సమావేశ మయ్యెను. ఆ యభిషేకోత్సవములకు ఆంధ్ర, కళింగ, చోళ, పాండ్య, కేరళాది దేశములనుండియు శిల్పి శేఖరులు, కళారాధ కులును విచ్చేసి యున్నారు. వాస్తు విశారదులేమి, చిత్రకారు లేమి, నగర విధాతలేమి, లెక్కకు మిక్కిలిగాఁ జనుదెంచిరి. రారా మఱి? జక్కణాచార్యునివంటి శిల్పిమార్తాండుని సమ్మానోత్సవము లేరికి దర్శనీయములు కావు? దక్షిణాపథ శిల్పములో "హొయసలశైలి" అని యొక ప్రత్యేక శిల్ప శైలి వెలసినదని యానాఁటికే పెందోట శిల్పసార్వభౌములు విన్నారు. పెందోట శిల్పులును సామాన్యులు కారు. అమరావతీ నాగార్జునునికొండల శిల్పములను వెలయించియు, సాంచీ సార్నాథములందు ఆంధ్ర శిల్పజ్యోతులు వెలిగించియు బౌద్ధమును బ్రకాశింపఁజేసి చెన్నారిన ఘనశిల్పుల వంశము లకుఁ జెందినవారు వారు. గాంధార శిల్పశైలికంటెను తమ ఆంధ్రశైలి, లేదా అమరావతీశైలి, మిన్న యని పేరుమోసిన విశ్వకర్ములు వారు. వారికీ క్రొత్తదగు హొయసలశైలిని జూడవలయునని కుతూహలము గలిగినది. దానికిఁదోడు జక్కణ మహాశిల్పసంపన్నుఁడనియు, శిల్పాచార్యుని కుండ వలసిన సర్వ లక్షణములను దనయందు మూర్తీభవింపఁ జేసి

కొన్న మహనీయుఁడనియు, విశేషించి ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నుఁడనియు వినుటచే ఆయన దర్శనముచేతను, ఆతని సన్మానోత్సవ కార్యములఁ జాల్గొనుటచేతను దాముసు ధన్యులు గాఁ దలంచి యుండిరి.

ఇందుకుఁదగినట్లు తెలుఁగునాఁటినుండి వచ్చిన దేవోజు చుట్టఱికముగూడ నున్నది. భల్లాళనరేంద్రుని యాహ్వానము గూడ వారి రాకకు హేతువై యొప్పినది. కార్యమప్పుఁడి ప్రాంతమునుండి నాపోజు, పోకోజు, ఉల్లపాచార్యులును, కాకతీయ రాజ్యమునుండి త్రిలోచనాచార్య, విశ్వేశ్వరస్థపతి, గన్నమాచార్యాదులును సశిష్యులై వచ్చిరి. అలంపురమున శిల్పసౌందర్య నివాస మగు విశ్వబ్రహ్మ దేవాలయమును నిర్మించి సుప్రసిద్ధుఁడైన కళాధర స్థపతి గోత్రమువారును నాహూతులైరి. ఉత్కళమునుండి జగత్ప్రసిద్ధులైన శిల్పి వంశీయులు వచ్చిరి. చోళమునుండి రాజాస్థానశిల్పులు వచ్చుటకు రాజకీయము లడ్డంకి యైనను, కొందఱు శిల్పకుమారులు మాత్రము రాకపోలేదు. పాండ్యమునుండి మహాశిల్పి వేంకట రమణస్థపతి ప్రభృతులు విచ్చేసిరి. ఇంకను దిగ్దంతులవంటి పండితులును, కవులును, కళాశీలురును వేనకు వేలుచితాసనముల నలంకరించి మహాశిల్పాచార్యుల రాకకై యెదురు చూచుచుండిరి. అంతఃపురాంగనలు తగిన తావుల తెరలలో నుండి యొరులకుఁ గానరాకయే ఆ యుత్సవ దృశ్యములఁ దిలకించుచుండిరి.

వందిమాగధులు "సమధిగత పంచమహాశబ్ద-మహా మండలేశ్వర-ద్వారావతీ పురవరాధీశ్వర - యదువంశాంబర ద్యుమణి-సామంత చూడామణి రాజి రాజిత పాదాంభోజ-సమరనిశ్శంక ప్రతాపచక్రవర్తి-హొయసల వీరభల్లాళదేవ చక్రవర్తికి బహుపరాక్! తలకాడుగొండ, నోణంబవాడి గొండ, వీరగంగ, వీరభల్లాళదేవ చక్రవర్తికి జై!" అని మహారాజ బిరుదావళులఁ బఠించుచుండిరి.

ముందు జగచ్ఛిల్పి యగు విశ్వకర్మదేవుని వేదసూక్తముతో సభ ప్రారంభ మాయెను. అభిషేకోత్సవ కథానాయకులగు దేవోజు జక్కణాచార్యుల రాక కాలస్య మున్నందునఁ దొలుత తక్కినవారికి బహుమానము లీయ నెంచిరి. మహారాజు ననుజ్ఞ పొంది గాంగరాజు యుద్ధవీరుల సన్మానింప నియమింపఁబడి యి ట్లుపన్యసించెను.

"నేఁటి విజయోత్సవమునకు మహారాజుగారి యాస్థాన శిల్పి జక్కణాచార్యులవా రెంతయుఁ గారణభూతులు. వారి రాజకీయ చాతుర్యమే మనల నీ మహోపద్రవమునుండి యొడ్డు చేర్చినది. మేము జైనకేతనములను దించి యైదు రంగుల హైందవ ధ్వజములను తేరులపైఁ బూన్చి పోవుట వైరిసైన్యమున కెంతయో వింత యయ్యెను. ఈ పంచవర్ణ పతాకల దర్శనమువలన వారు మన మహారాజు హైందవుఁ డయ్యెనని భ్రాంతి పడిరి. ప్రధానముగా మత దురభిమానముచే పోరికి సిద్ధపడినవారి హృదయము లీ భ్రాంతిచే మాఱిపోయి చల్లఁ

బడెను. వారి కఱకుఁదనము కాటఁ గలసినది. వారి శౌరత్వ మిట్లు తగ్గుటచే మన సైన్యము పూర్తిగా విజృంభించినది. చోళ దండనాథులు సంధికిని సిద్ధపడినారు. కాని నే నొడఁబడ లేదు. దీనికిఁదోడు జక్కణాచార్య శిష్యులగు సమరాంగణ సూత్రధారులు పన్నిన అభేద్య వ్యూహములు, సమరోపాయ ప్రయోగములు మనకు సంపూర్ణ విజయమును జేకూర్చినవి.

రాజకీయ విషయములందు నిస్సంగుఁడై యలక్ష్యము చూపు మన యాచార్యుని యుపాయము లిట్లు ఫలించునని నేను మొదట తలఁపక వారియెడ నపరాధము చేసినవాఁడ నైతిని. ఆయన నివురుగప్పిన నిప్పు. వేయేల? ఆ మహానీయుని యాశీస్సే మహాసామ్రాజ్యములకు రక్షాకవచము గాఁగలదని నే నిప్పు డెఱింగితిని. ఇట్లు పరోక్షముగను ప్రత్యక్షముగను గూడ వారు మన విజయోత్సవమునకు మూలస్తంభమై ప్రకాశించినారు. నేఁడు వారికి జరుగనున్న యీ రత్నాభిషేకము కళాసేవకొఱకేగాదు. హొయసల సామ్రాజ్య స్థిరీకరణ మునకుఁ గూడ నని వక్కాణింతును. కావున మున్ముందు వారికి మన సామ్రాజ్యపక్షమునఁ గై మోడ్పు లర్పించి బహు మాన ప్రదానమునకుఁ బూనుచున్నాను."

ఇంతలో రాజభటులు తొందరపాటుతో జనుల నంద ఱిని తగినట్లు గూర్చుండఁ బెట్టుచుండిరి. రెండు మూడు విగడి యల కాలములో పచ్చలపాలకి నెక్కి యొక పురుషుఁ డట కరుదెంచెను. ఆతని వెంట పురోహితులు స్వస్తి చెప్పుచు

వచ్చుచుండిరి. ఇంకను నృత్య గీత వాద్యాదులు చెలరేఁగ పాలకి కొలువుకూటమున దింపఁబడెను. వెంటనే భల్లాళరాజు ప్రత్యుత్థాన మొనర్చి ఆ దేవోజు శిల్పిని తన కుడి ప్రక్క నున్న బంగరు గద్దెపైఁ గూర్చుండఁ బెట్టెను. ఆ గద్దె కీవల మహారాజునకు దగ్గఱగా రత్న సింహాసన మొకటి యెవరికో ప్రత్యేకింపఁబడి యుండెను.

ఇఁక జక్కణాచార్యుని రాకయే జరుగవలసియున్నది. "సమయము దాఁటిపోవు చున్నను వారు రాని కారణమేమి? ఆయన కీ స్వర్ణాభిషేక రత్నాభిషేకాదులు గిట్టవు. ఆతఁడు ప్రాపంచిక భోగదూరుఁడగు నొక విరాగి. కర్మపరిపాకము ననుసరించి గృహస్థుగా నున్నను, వానిని గృహస్థ సన్న్యాసి యనవచ్చును. పెక్కు రట్లే యనుచున్నారు. ఒకవేళ తన కీ సమ్మానాదు లిష్టము లేక రానని తిరస్కరించెనా? ఇంకే దైనను విఘ్నము కలిగియుండునా?" అని పలువురు పలు రీతులఁ దలంపఁజొచ్చిరి. బహుమానము లిచ్చుటతో నొక యరగడియ కాలము గడచినది. ఇంతలో నొక పురుషుఁ డాతురపాటుతోను వెలవెలఁ బోవుచున్న మొగముతోను నచ్చటికిఁ జనుదెంచినాఁడు. ద్వారపాలకుఁ డాతని రాజ సన్నిధికిఁ జేర్చెను. అతఁ డిదివఱకే పరిచయ మున్నవానివలె రాజునకు నమస్కరించి యిట్లనెను.

"ప్రభూ! మహాచార్యులవా రింట లేరు. వారు నిన్నటి యుదయముననే నగరము వదలి యెక్కడికో పోయినారఁట;

ఎక్కడికిఁ బోయినదియు నెవ్వరికిఁ దెలియదు. శ్రీ వారికి కుమారోదయముగూడ నిన్ననే యయినదఁట. ఆ వార్త విన్న పిమ్మటనే శ్రీ వారి గృహత్యాగము. నిన్నటినుండియు ముఖ్య శిష్యు లందఱును వారిని వెదకుచునే యుండిరి. కాని యింత వఱకును వారి యునికిని గూర్చిన వార్తయే తెలియలేదు''.

ఈ మాటలు వినుటతోడనే రాజు నిర్విణ్ణుఁ డాయెను. సభ యంతయు కొంతసేపు ప్రశాన్తపడి పోయెను. పిమ్మట సభలో గుసగుస లారంభ మయినవి. ''వైరాగ్యశీలుఁడగు జక్కణాచార్యుఁడు పుత్రుఁడు పుట్టగనే తన గృహస్థధర్మము సఫల మయినదని సన్న్యాసము స్వీకరింపనే కాశీ నగరమో పోయియుండు ననియు, తపస్సుచేసియో, యోగము పండించు కొనియో జన్మము ధన్యము చేసికొనుటకే హిమాలయము నకో పోయియుండు ననియు, అసలీ రత్నాభిషేకమున కాయన యొప్పుకొననే లేదఁట, అందుకే ముఖము తప్పించి యుండ వచ్చు'' ననియు వారు తలంచిరి. ఏమైన నగుఁ గాక. ఇప్పుడు రాజునకుఁ గర్తవ్య మేమి? ఆతని మనస్సు మనస్సులో లేదు. శాంతలాదేవి యీ సంగతి విని మూర్ఛిల్లినది. ఆమె కట్టు కొన్న సంకల్ప సౌధ మొక్కసారి కూలినట్లైనది. ఇఁక నా మహాశిల్ప యోగీశ్వరుని దర్శించు భాగ్యము తనకును, దన ప్రజలకును లేదాయని ఆమె చాల చింతిల్లినది.

భల్లాళ భూమీశ్వరుఁడు గంభీరుఁడు. జక్కణ పోకచే కలిగిన వెలితి నాతఁడు తన మొగమున దోఁపనీయ లేదు.

''ఆచార్యుఁడు వానప్రస్థుఁడై తపస్సున కేఁగియుండును. తన యా సంకల్పము నింటిలోఁ జెప్పినను, నాకుఁ దెలియ నిచ్చినను సాఁగనీయమని వారట్లు చేసియుందురు. సభ్యులీ సంఘటనము నకు నిరుత్సాహులు కాక నేఁటి విజయోత్సవమును, అభిషేక కార్యములను జయప్రద మొనరింపఁ గోరుచున్నాను.'' అని యాతఁడు సభ నర్థించెను.

ఇఁక నాఁటి కార్యక్రమములోని మఱొక యంశము దేవోజు కనకాభిషేకము. ఆపని కుపక్రమణము జరిగెను. తన గురురాయని పోకచే లోలోనఁ గుములుచున్న దేవోజున కీ యభిషేకము చేయించుకొన నిష్టము లేదు. అయిన నెట్లు తప్పును? అది మహారాజుగారి సంకల్పము గదా! తన యాచార్యునకు వలె తనకు మహారాజును శాసించుశక్తి లేదాయెను. అయినను తప్పించుకొనఁజూచి యాతఁ డిట్లనెను.

''రాజుగారియు, కళామూర్తులయు, పెద్దలయు, ప్రజలయు నాదరప్రేమలే నాకు వెలలేని సత్కారములు. నాకీ కనకాభిషేకము జరిగినట్లే. నాకును, మీకును, సమస్తలోకమునకును పూజనీయుఁడా విశ్వకర్మ భగవానుఁడు. అదిగో! ఆయన చిత్తరువు. ఆ చిత్రపటమునకే కనకాభిషేకము జరిపి మన మందఱమును తరింతము. నా గురుచంద్రునకు జరుగని సన్మానము నాకేల? మావంటి శిల్పారాధకుల నెందఱినో సృష్టించి, తన సృష్టిసామర్థ్యమును మాలోఁ బ్రవేశపెట్టిన ఆ జగచ్ఛిల్పికే యీ సమ్మానపూజ జరుగ ప్రభువు లనుమ

తింప వలయును. అట్లొనర్చిన ఆ దేవు నంశభూతులే యగు శిల్పు లెల్లరును బూజింపఁబడినవా రగుదురు.

ఇంతలో అక్కడ మహామంత్రి లేచి "ప్రభూ, ఈ సమయమున నెవ్వరును విచారింప నక్కఱ లేదు. ఆదర్శపురుషుఁడగు జక్కణాచార్యుఁడు ఋషికల్పుఁడు. ఆయన గృహత్యాగము ఏదో గొప్ప లోకోపకారక సంకల్పముతోనే జరిగి యుండును. దాని ఫలితము మన కిప్పుడు తెలియదు. అట్టి మహాత్మ్ము నారాధించి మనము కళావీరపూజ చేయవలసినదే. ఆ మహాశిల్పి యీ చిత్రపటమును రత్న సింహాసనమున నుంచి, రత్నపుష్పపూజ చేయుదము గాక. కనుల కగపడని దేవుని ప్రతిమను మానవులు పూజించి ధన్యు లగుచున్నట్లు, సమయమునకు దగ్గఱలేని వారినిగూడ మనము సమ్మానించి మన కోరిక నెఱవేర్చుకొన వచ్చును. డేవోజు శిల్పిగూడ కొఱఁత పడవలసిన పని లేదు. కావున ఇది దేవరకును, సభ్యులకును సమ్మత మవునని యెంచెద" ననెను.

సభ్యు లెల్లరు సంతసించిరి. మహారాజుగూడ పరిపూర్ణామోదముతో నిట్లనెను. "మహామంత్రి సమయోచిత ప్రజ్ఞ, వీరపూజాభిరతి అత్యద్భుతములుగానున్నవి. ఈ సుసమయమున నింకొక్కటిగూడ నేను మనస్సులో నుంచుకొంటిని. సోమేశ్వరమూర్తి నిర్మాణము నారంభించిన బమ్మోజు మహాశిల్పాచార్యుఁడు దక్షిణాపథమున కా నాఁటి శిల్పిసార్వభౌముఁ డని మీ రెఱుంగనిది కాదు. నాఁటి హోలాలు

పురాధీశుఁ డాయన శిల్పములకు మెచ్చి నానాదేశ శిల్పీశ్వరుల యెదుట బమ్మోజునకు "కలియుగ విశ్వకర్మ" బిరుదము సమర్పించియున్న విషయము సుప్రసిద్ధము. నాఁటికి నేఁడుగా, అంతటి కళాచక్రవర్తి మఱల జక్కణాచార్యుఁడవతరించినాఁడు. ఆయన కెందును దీసిపోని స్థపతివర్యుఁడీ మహానుభావుఁడు. ఈ మహాశిల్పి కా 'కలియుగ విశ్వకర్మ' బిరుదము నీయ నేను సంకల్పించి యుంటిని. అందుకే వ్యయప్రయాసలకు లోఁబఱచి నానాదేశ స్థపతి వర్యుల రప్పించి యున్నాను. కనుక ఆ యాచార్యస్వామి కీ బిరుదమును సమర్పించుకొని ధన్యుల మగుటకు తొలుత నీ సభాంగణమునకు వేంచేసియున్న మహాశిల్పుల యనుమతితోఁగూడ నందఱి సమ్మతి నర్థించుచున్నాను."

ఇంతలో సభ్యులెల్లరు "కలియుగ విశ్వకర్మ జక్కణాచార్యునకు జై! కళారాధకుఁడు భల్లాళ భూపాలునకు జై!" అని హర్షధ్వానము లొనర్చిరి. పిమ్మట నాంధ్రదేశమునుండి రాజాహ్వానముపై వచ్చిన పెంగోటశిల్పి మార్కండేయస్థపతి యిట్లనెను. "ఇది మా యాంధ్రదేశము వారి కత్యంతామోదకరమైన విషయము. శ్రమపడి వచ్చిన మా కా మహానుభావుని దర్శనము కానందులకు చింతిల్లుచున్నాము. అయినను చిత్తరువులో నా పురుషోత్తముని జూచుటతోడనే వారి యను భావ ప్రభావములు మాకు గోచరించినవి. ఆయనను గన్న మీ దేశ మాతయు, ఆరాధించి యుపయోగించుకొన్న మీరును ధన్యులు.

పిమ్మట నాయా దేశములనుండి యేతెంచిన శిల్పా చార్యు లెల్లరును దమ హర్షామోదములఁ దెలిపిరి. జక్కణా చార్యుని చిత్తరువునకు రత్నాభిషేకమును, దేవోజు శిల్పికిఁ గనకాభిషేకమును శాస్త్రీయముగా జరిగెను. ఆ రత్నరాశు లను, గనక ముద్రికలను ఉత్సవ దర్శనార్థము వచ్చిన శిల్పి లోకమునకెల్ల కర్పూర తాంబూలములం దిడి సమర్పించి గౌరవించిరి.

ఈ శుభసమయముననే కావేరీపట్టణమునుండి గాయత్రీ పీఠాధిపతు లంపిన ఆశీస్సందేశము చదువఁబడెను. ఆనెగొందె నుండి సరస్వతీ పీఠాధిపతులగు బ్రహ్మానందస్వాములవా రంపిన మహాప్రసాదము, దీవెనలు వినియోగింపఁ బడెను. బీజపురము నుండి వేదభాష్యకారులును, సావిత్రీ పీఠాధిపతులును నగు భూధరాచార్యులవారు ప్రసాదించిన యమోఘాశీస్సులు భక్తితో శిరసావహింపఁబడెను. పెందోట పురవరాధీశ్వరు లయు, పాటూరి శిల్పిప్రభువులయు నభినందనములు, తక్కిన సామంతరాజుల యుపాయనములు సాదరముగా స్వీకరింపఁ బడెను.

## ౧౦

గడచిన యిరువది యేండ్లనుండియు హొయసల రాజ్యసంపద మూఁడు పూలాఱుకాయలుగా పెరిగినది. గాంగ రాజు సేనాధిపత్యమునను, అక్కనమంత్రి బుద్ధిచాతుర్యము నను, జక్కణాదుల సర్వవిధ సాహాయ్యములవలనను పరా క్రమశాలియగు భల్లాళభూపతి కడల నున్న రాజుల జయించి తన రాజ్యమును సామ్రాజ్యముగాఁ జేసికొనెను. జక్కణా చార్యుఁడు, దేవోజుశిల్పి, అనంతకీర్తి స్థపతి మొదలగు కళా కారుల మూలమున దేశములో స్వర్గశిల్పము తాండవించినది. ద్వారసముద్రము, వేలాపురి, మహీశూరము మున్నగు నగర ములు పెంపు చెందినవి. దొడ్డబళ్ళాపురము, శాంతలాపురి మొదలగు క్రొత్త పత్తనములు వెలసినవి. కావేరీ తోయ ధారలచే కన్నడక్షేత్రములు సస్యశ్యామలములై మెఱసినవి. దేశములో చిత్రకళ, శిల్పము, సంగీతము, నృత్యము, స్వర్ణాది వృత్తులు, అద్భుతముగా నాదరింపఁబడి వృద్ధిచెందినవి.

కర్ణాటక సాహిత్యముగూడ బొప్పనప్రభృతి కవీం ద్రులవలన ఉచితరీతి విస్తరించుచున్నది. వీనికిఁదోడు సద్గుణ ఖనియు పట్టమహిషియు నగు దేవేరి శాంతలాదేవియు, కీర్తి మతియు మన్మథమనోహరులగు తనయులఁ గాంచి హొయ సల వంశమును నిలిపినారు. ఆ రాజదంపతులు రాజ్యభోగ ములఁ దేలియాడుటతో సంతుష్టి చెందక దానధర్మములఁ జేయుచు ప్రజాహిత పరాయణులై వారికి ముద్దు గూర్చ

చుండిరి. వారి కిప్పుడు జక్కణాచార్యుఁడు లేని కొఱంత దక్క వేఱు చింత లేదు. అయినను ఆ మహాశిల్పి తనయుఁడు పెద్దవాఁడగుచు మఱల వారి కక్కఱకు రానున్నాఁడు.

ఎల్లకాల మొక్కే రీతిగా నెవ్వరి కేనిఁ గడువదు గదా! కాలచక్రమును త్రిప్పు సూర్యచంద్రులకే యుదయాస్తమయములు తప్పుట లేదు. నిన్నటివఱకును జీకుచింతలు లేని శాంతలా వీరభల్లాళుల మధురజీవితముల కీనాఁడు గొప్ప దుఃఖము ప్రాప్తించినది. ఏ పుత్రుఁడు హొయసల సామ్రాజ్యాధినేత కానున్నాఁడో, ఎవ్వనికి భల్లాళుని యన్నగారి పేరుపెట్టి బంధువర్గమంతయు మురియుచుండిరో, ఆ ముద్దుల కొమరుఁడు నరసింహదేవునికే దురదృష్టవశమున బ్రహ్మరక్షోభూత మావహించినది. ఆ బ్రహ్మరాక్షసభూతము పట్టిన వదలుటయే కష్టము. అది తక్కిన భూతములవంటిది కాదు.

పదునైదేడుల లేఁతప్రాయము. అన్ని విద్యలను, కళలను, ధనుర్వేదమును గైవసము చేసికొనుచున్న విద్యార్థి దశ. ఇలువెళ్ళ నక్కఱ లేని సంపన్నమగు రాచబ్రతుకు. అయిననేమి? పురాకృత కర్మఫలము ననుభవింపక యెవ్వరు తప్పించుకొందురు? ఉన్నట్లుండి యా విజయదశమినాఁటి యర్ధరాత్రమున ఆ కుమారుఁడు బిట్టు కలవరించుచు లేచినాఁడు. నాఁటి మధ్యాహ్నమాయుధపూజ యొనర్చినాఁడు. సాయంకాలము శమీపూజలోఁ బాల్గొన్నాఁడు. సప్తమి నాఁటి నుండియు తల్లి రాణివాసమున నేర్పాటుచేసిన సరస్వతీపూజలోను,

దుర్గారాధనములోను, సువాసినీపూజలోను బాల్గొని పెద్దలయు, ముత్తైదువలయు మేల్మిదీవనల నందుకొన్నాఁడు. నేఁటి రాత్రి యీ విపత్తునకు గుఱి యైనాఁడు. దీనికిఁ గారణ మెవ్వరేమి చెప్పఁగలరు? రాజసూయ యాగములో అవభృథస్నాన పవిత్రములైన ద్రౌపదీ కేశములకు దుశ్శాసనునిచేతఁ జిక్కి తెగిపోవుగతి తప్పినదా! ఆ మహాయజ్ఞ ఫలమునకు వ్యతిరేకముగా వెనువెంటనే యడవులకేగుదురవస్థ తప్పినదా? కావున నీ కార్యకారణ సంబంధము, దేవుఁడను వాఁ డొకఁడున్న వానికే తెలియవలయును. లేకున్న నే మహాయోగీశ్వరులో యెఱుంగవలయును. ఏ కాలమున కేజీవులకే యే కర్మములు ఫలితము నిచ్చునో సామాన్య మానవు లెఱుంగఁజాలరు. బాహ్యముగా కొన్ని కారణము లగపడవచ్చును. వానికిని మఱికొన్ని కారణము లుండవచ్చును. అన్నింటికిని నాధారములగు నాదికారణము లగమ్యములై యాలోచనల కందవు.

చూచిరి. గ్రహములకు జపదానములు చేసిరి. హోమములు నడచినవి. మాంత్రికు లరుదెంచి బాగులు చేసిరి. మందు లైనవి. భూతవైద్యము లయినవి. పూజ లైనవి. పురస్కారము లయినవి. దేశ దేశాంతరము లందలి ఘనవైద్యు లందఱును వచ్చి చూచిరి. భల్లాభుఁడు జైన బౌద్ధ శాఖలలో పేరు మోసిన మంత్రవేత్తలను, సన్న్యాసులను బిలిపించి చికిత్సలు చేయించెను. ఇఁకను గనఁబడ్డ బైరాగు లెల్లరు చెప్పినట్లు చేసిరి. తీర్థయాత్రలు, క్షేత్రపర్యటనములు నెన్నో ముగిసినవి. ఇఁక శాంతలాదేవి

చేయు దాన పూజా వ్రతాదులకు లెక్కయే లేదు. రాజు బొక్కసములోని రొక్కము నంతయు వెచ్చించినాఁడు. ప్రయోజనము శూన్యము. ఎన్ని చేసినను రాజకుమారునిఁ బట్టిన బ్రహ్మరక్షస్సు మాత్రము వదలలేదు.

పాపము, శాంతలాదేవి దుఃఖమున కంతములేదు. రాజు విచారమునకుఁ గడలేదు. ప్రజలుగూడ నా పుణ్యదంపతుల దురంత వేదనలో పాలుపంచుకొన్నారు. కాని యీ యిక్కట్టు కీర్తిమతిని మాత్రము చలింపఁజేయలేదు. ఈ యంశమును గూర్చి లోకులు పలురీతులుగాఁ జెప్పుకొన మొదలిడిరి—

"తన సవతి యభ్యుదయమునకు లోలోన నసూయపడు చున్న కీర్తిమతి బిడ్డనికిఁ గలిగిన యీ యాపదకు మదిలో సంతసించుటకు హేతు వున్నది. తన కొడుకు యువరాజు కాఁగలిగినఁ దాను రాజమాత కావచ్చునుగదా యని యామె భావము. కాని పెద్దవాఁడగు నరసింహదేవుఁ డుండ, చిన్నవాఁ డగు తన పుత్రుఁడు వర్ధమానుఁడు యువరాజెట్లు కాఁగల్గును? కావున తన సంకల్పము నెఱవేఱుటకై కీర్తిమతి శాంతలా సుతున కేవిధముచేనైనను ఎగ్గుచేయుట కెన్నాళ్ళనుండియో వేచియున్నది. అందులకై మాంత్రికులను, భూతవైద్యులను, మూలికలచేఁ జిత్తము చెఱచువారిని ఆమె వెదకుచున్నది. ఆమె సంకల్పసిద్ధికి శాంతలాదేవి యంతిపురి కా యా దేవతా పూజలకు రాకపోకలు చేయు పురోహితుల నామె సాధనము చేసికొన్నది. వారు మొట్టమొదట నట్టిపని కంగీకరింపకున్నను

భల్లాళుని జైనమతభ్రష్టునిఁ జేయ నెదరు వేచియున్న వైదిక మతాభిమానుల ప్రోత్సాహమున లొంగిపోక తప్పలేదు. భల్లాళుఁ డే విపత్తునకో గుఱియై తమ మతములోనికి వచ్చినచోఁ దమ యధికారము నింకను చలాయింపవచ్చును గదా యని యా పురోహితవర్గ మెంచెను.

"ఇట్లు కీర్తిమతి యొక ప్రయోజనము నాశింపఁగా, వా రింకొక మహత్తర ప్రయోజనమునే కోరి యీ ఘోరము నకుఁ బాల్పడిరి. వారికి దసరా వేడుకలు చక్కని వీలు కూర్చినవి. ఆ సమయమున వా రేమంత్రము లుపయోగించిరో, మందులు పెట్టిరో, మూలికల నుపయోగించిరో! ఫలితము మాత్రము నరసింహదేవుని చిత్త చాంచల్యము. ఇది బ్రహ్మరక్షోభూత మని యిఁక వారు ప్రచారముచేసి తమ వాంఛితమును నెఱవేర్చుకొనుటలో వింత యే ముండును! ఆహా! మత దురభిమాన మెంత లేసి పనులుచేయించుచున్నది!"

మఱికొందఱు "మందులు మాకులును గావు. ఇది యంతయు పూర్వజన్మ కర్మఫలమే" యనుచున్నారు. సత్య మెవ్వరి కెఱుక? మానవు లా యా స్థితిగతులంబట్టి ఊహాగానములు చేయుచుందురు. వారి నోళులు మూయ మూఁకుళ్లు లేవు గదా!

శాంతల కుమారుని గ్రహ విముక్తికి వేయిదేవుళ్ళకు మ్రొక్కు లిడుచుండ, వాని గ్రహబాధ యట్లే యుండ

వలయు నని కీర్తిమతియు నట్టి పనినే చేయుచున్నది. ఆహా, సపత్నీమాత్సర్యము, స్వార్థపరత్వము నెంత చెడ్డవి! ఈ స్వార్థసంపాదనములోఁ దనలోని మానవత్వమును గూడఁ గీర్తిమతి చంపుకొన్నది గదా! అయిన నేమి, మానవుల యూహలు, సంకల్పములు నియతిని, కర్మప్రభావమును అడ్డగింపఁగలవా?

శాంతలాదేవికిఁ గలిగిన యీ విపత్తునకు దూరస్థురాలైన సౌపర్ణియు మిక్కిలి దుఃఖించినది. ఆమెగూడ పతి యెడఁబాటున దుఃఖితగానే యున్నది గదా. ఆపన్నుల కష్టానుభూతు లాపన్నులకే తెలియును. సౌపర్ణీదేవి తన సంతాపమును, సహానుభూతిని మహారాజ్ఞికిఁ దెలియఁబంపినది. ఆమె "శ్రీమద్రామానుజాచార్యస్వామి సాక్షాద్విష్ణ్వంశ సంభూతుఁ డనియు, ఆ మహానుభావునివలన బాలునికి బ్రహ్మ రాక్షసపీడ వదలఁగల దనియు, మహారాజుగా రందులకుఁ బ్రయత్నించుట మంచి" దనియుఁగూడ వర్తమాన మంపెను.

ఈ యభిప్రాయము శాంతలాదేవి హృదయమున కెంతయు నచ్చినది. జక్కణాచార్యుల పిమ్మట నంతటివాఁడు రామానుజులే యని యామె నిశ్చయించుకొన్నది. ఆమె తన కేదో ముక్తిమార్గము దొరకినట్లే సంతోషించినది.

## ౧౧

జక్కణాచార్యుఁడు చోళమండలమునకుఁ జేరుకొన్నాఁడు. చోళభూపాలుఁ డా మహాశిల్పి కద్భుతముగా స్వాగత సత్కారములు చేసి గౌరవించెను. తన కోరికను ముద్దుచేసి, దానిని నెఱవేర్ప శిల్పాచార్యుఁడు విచ్చేసినాఁడు గావున, ఇఁక తన రాజ్యమున వైష్ణవమతమును గూఁకటివేళ్ళతోఁ బెకలించి వేయవచ్చుననియు, రామానుజ శిష్యుల గర్వమునుగూడ నడంపవచ్చుననియు నాతఁడు తలఁచెను. అంతియేకాని, జక్కణ శిల్పాచార్యుఁడు మతపక్షపాతము లేని సర్వమత సమతాదృష్టి సంపన్నుఁ డని యాతనికిఁ దెలియకపోయెను.

నాఁడు రహస్యాలోచనాగారమున జక్కణాచార్యుఁడు చోళభూపాలుఁడును సమావేశమైరి. చోళరాజు రామానుజుని స్వీయమత ప్రచారౌద్ధత్యమును జక్కణకు నివేదించి, "తన రాజ్యమున శైవమే ప్రజామోదము నందిన మత మనియు, దానికిఁ దక్క పెఱ మతముల కందుఁ దా వుండరా దనియు, రామానుజమతమును, దాని ప్రచారకులను సర్వనాశన మొనర్పవలయు ననియు, అందుకై యాతని సాయము నర్థించుచున్నా ననియు వక్కాణించెను.

జక్కణాచార్యుఁడు రాజోద్దేశ్యము నాలించి, అనాదర సూచక మందహాసము చేసి యిట్లనెను.

జక్కణ : ప్రభూ! నేఁడు మతవిద్వేష పిశాచము ఆఁకలి
పెంపున నోరు తెఱచి, నాలుకసాచి జుట్టు విరియఁ బోసి
కొని, వీరతాండవము సేయుచున్నది. ఎంద ఱెందఱో
ఆ పిశాచమున కాహారమై పోవుచున్నారు. ఏ పాటి
యథార్థదృష్టి లేకున్నను, మన మతమే గొప్పది, ఒరులది
కాదని తలంచి ప్రవర్తించినను మన మా పిశాచమున
కాహుతి కాక తప్పదు. అన్ని మతములలోను కొంత
కొంత సత్యముండియే తీఱును. భౌతిక భోగములే ప్రధాన
మని యే మతమును జెప్పదు. సత్య శౌచ దయా హింసా
దులు అన్ని మతములకును మూలసూత్రములే. జీవుని
సంసారబంధమునుండి తప్పించి, తమస్సునుండి జ్యోతి
లోనికి పయనింపఁజేసి అమృతస్థితిని జేకూర్చుటకే ప్రతి
మతమును ప్రయత్నించును. అయినను బాహ్యములగు
నాచారాదులలో కొంత భేద ముండవచ్చును. అట్టి భేద
ములకుఁ బ్రాధాన్య మిచ్చి మనుష్యులు తగవులాడి చెడి
పోవుట భావ్యము గాదు.

చోళ : ఆచార్యా! మీ యుపన్యాసము వింతగా నున్నది.
శివ కేశవాది దేవతలును, వారి వారి మతములును
ఒక్కటే యందు రేమి! అట్లయిన ఇన్ని నామ రూపము
లుండుట కర్థ మేమి? ఇన్ని రీతుల పురాణాదులు ఆ యా
దేవతల ప్రభావములను జెప్పుటలోని యుద్దేశ్యమేమి?

జక్కణ : ఔను. మన పురాణాదులు దేవ నానాత్వమును
వర్ణించినమాట వాస్తవమే. అట్లే వేదముగూడ వర్ణింపక

పోలేదు. అంతమాత్రముచేత భేదమునకే మనము ప్రాధాన్య మీయరాదు. మూలతత్త్వమును "ఏకం సత్" అని వేదమే చెప్పినది; ఆ మూలభూత వస్తువునే సాధకుల హితముకోసమై నానావిధ నామములతోను రూపముల తోను వ్యవహరించినది. జగత్కారణ వస్తువు ఒక్కటే యైనను, అది లోకమును సృష్టించునపుడును, పోషించు నపుడును, లయమొనర్చునపుడును, ఇంక ఆ యా కర్మ లొనర్చునపుడును బ్రహ్మ విష్ణు శివాది నామములతోఁ బిలువఁబడినది. వ్యష్టిదృష్టితోఁ జూచిన నానావిధ నామ రూపములు తోఁచినప్పటికిని, సమష్టి దృష్టియందది ఏకము, అద్వైతము, సచ్చిదానందముగానే తోఁచును. ఇట్టి భావము సమగ్రముగు తత్త్వచింతనము చేసి కృత్స్న దృష్టి నలవఱచుకొన్న వారికిఁగాని కలుగదు. అట్లే భగ వంతునికి స్త్రీ, పుం, నపుంసకాది భేదములును లేవు. ఈ లింగభేదములు శరీర సంబంధులు. తత్త్వజ్ఞులు వానికిఁ బ్రాధాన్య మీయరు. వేదములను, ఉపనిషత్తులను, పురాణాదులను అధ్యయనము సేయువారు పాఠికదృష్టి తోడనే వానిని చదువు చుందురు. పరమాత్మాను భూతి నందిన తత్త్వవేత్తల చెంగట వాని యర్థము నెఱింగిన భేదభావము లుదయింపనేరవు. ఈ నానా విధ నామరూప భేదములకు చక్కని సమన్వయ మార్గమును శిల్పశాస్త్రము చూపుచున్నది. సాధకుల హితముకోస మును, ఉపాసకుల కార్యార్థమే పరమ నిర్గుణ పరబ్రహ్మ

మునకు రూపకల్పనమని శాస్త్రము. వస్తుతః అచింత్య మైన తత్త్వమునకు చింతనీ యావస్థను గల్పించినందువలననే యీ నానాత్వము ప్రోగువడ్డది. విశాలమగు శాస్త్రహృదయము నర్థము చేసికొనలేక సంప్రదాయ దాసులైనవారి యుద్దేశ్యములనే యనుసరించి చూచినచో ననేక భేదములు, వాదములు చెలరేఁగుటలో వింత లేదు.

చోళ : అయిన ఈ బ్రహ్మ విష్ణ్వాది దేవతా భేదములు కల్లలని మీ యభిప్రాయమా?

ఙక్కణ : అట్లననేల? లోకమున సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము అను నైదు కార్యములు జరుగుచున్నవి. ఈ యైదు కార్యములకు బ్రహ్మ, విష్ణు, శివుఁడు, ఇంద్రుఁడు, సూర్యుఁడు అనువారు కర్తలని అందఱెఱింగినదే. ఈ పంచమూర్తుల సమష్టి స్వరూపమే విశ్వకర్మ గాని, పరమశివుడు గాని; ఆ సమష్టి స్వరూపమును స్త్రీగా భావించినపుడు గాయత్రిగా నెంచుచున్నారు. గాయత్రికూడ లక్ష్మి, సరస్వతీ, పార్వతీ, శచీ, సంజ్ఞల సమష్టిరూపమేయని తత్త్వజ్ఞుల నిర్ణయము. ఈ రహస్య మొక్కసారిగాఁ దెలియునది గాదు. చాలకాల మనుసంధానము చేసియు, చదివియు, భావించియు, గురు శుశ్రూష యొనర్చియు నెఱుఁగఁదగినది. అసలు ప్రధానమైన పరమ తత్త్వమును పలురీతులుగా వర్ణించి చిత్రించుటయే శాస్త్రముల హృదయము. ఆ శాస్త్రహృదయము, సృష్టి

హృదయమే మానవున కర్థము గావలసియున్నది. ఒక్క శివలింగములోనే బ్రహ్మవిష్ణు మహేశ్వర స్వరూపము లంతర్భూతములై యున్నవని శాస్త్రము చెప్పుచున్నది. దాని కేమందురు? అట్లే వైష్ణవులును, ఆ శివాది సర్వ దేవతలు శ్రీ మహావిష్ణువు నందే యున్నారని సమన్వ యించుచున్నారు. ఆ విశాలదృష్టి నర్థము చేసికొన వలయును.

చోళ : అయినచో విశ్వకర్మ సర్వదేవతలకన్న నధికుఁడని మీ యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. ఆ రీతిగనే నాకు శివాభిమాన మెక్కువ గావచ్చును గదా?

జక్కణ : విశ్వకర్మ స్వరూపములోను, నామములోను ఇట్టి సమష్టిభావ మున్నదనుచున్నాను గాని, ఆతఁడే యెక్కువని నా యభిప్రాయము గాదు. ఈ సర్వ సమష్టి భావమును గొందఱు శివునకు, మఱికొందఱు కేశవునకు, ఇంక కొందఱు శక్తికి, వేఱొక కొందఱు ఇంకొక దేవతకును ఆరోపించుకొనవచ్చును. మన పురాణవాఙ్మయము చేసిన పని అదియే. శివపురాణములు శివుఁడే సర్వేశ్వరుఁడనియు, విష్ణుపురాణములు విష్ణువే సర్వకర్మాధినాథుఁడనియు వర్ణించినవి గదా. అందుకే నేను చెప్పునది, నామరూపములకుఁ బ్రాధాన్య మీయక, మూలతత్త్వమున కీయవలయునని. నాగార్జునాచార్యులవారి శూన్య వాదమును జూడుఁడు. అది ఈ నామరూపముల కేమాత్ర

మును విలువ నీయదు. ఈశ్వరతత్త్వమునుగూర్చి మూకీభావము వహించినది మాధ్యమికవాదము. ఒక్క మట్టియే ఘటాది వివిధాకారముల నందునట్లు, ఒక్క బంగారమే నానాభరణములుగా రూపొందునట్లు, ఒక్క ప్రధాన తత్త్వమే వివిధ రీతుల భాసిల్లి గోచరించుచున్న దనుట పరమార్థము.

చోళ : మీరు చెప్పునది నా బుద్ధి కెక్కుట లేదు. ఏదో అగమ్యముగా నున్నది. ఇప్పుడింతకు శైవమును వీడి రామానుజమతమును స్వీకరింపుమని మీ యుపదేశమా?

జక్కణ : తత్త్వరహస్యము లగమ్యములు గాక, అంత సుగమము లెట్లగును? చిరకాల బ్రహ్మచర్యావాసము చేయునది యేకాగ్రతతో నీ రహస్యములను గ్రహించుటకొఱకే. దానికి వ్యతిరేకముగా మత రాజకీయ స్పర్ధలతోను, కలహములతోను గాలక్షేపము చేయు మీబోటి రాజుల కొక్కసారి వినఁగనే తత్త్వార్థ మెట్లవగత మగును? మీలో తత్త్వావగాహన చేసికొనవలయునను యత్న మున్నఁ జాలును. దాని కదియే సమయ మేర్పడును. అన్యమత ద్వేషము లేకుండ స్వమతానుష్ఠానము చేసికొనుటయే అందఱి కర్తవ్యము నని నా మనవి.

చోళ : అయిన నిప్పుడు రామానుజులను గూర్చి యేమి చేయుద మందురు? ఆతనిని వధింపవలయునని యేనాఁడో నిశ్చయించుకొన్నాను.

జక్కణ : పాపము శమించుఁగాక. ఆయన చేసిన ద్రోహ మేదియు లేదు. ఆయన విష్ణుపారమ్యమును జాటుచున్నాఁడు. భక్తిమార్గము శ్రేష్ఠమని నుడువుచున్నాఁడు. శ్రీమన్నారాయణు నర్చించి మోక్ష మందుఁడనియు, నందు కంద అధికారులనియు చెప్పుచున్నాఁడు. అంత మాత్రముచేత రామానుజుఁడు వధ్యుఁడె ట్లగును? విష్ణు భక్తితో వైష్ణవమత ప్రచారము చేసినంతమాత్రమున, ఆయన మీకు వధ్యుఁడగుచో, మీ రాజ్యములోని శైవ మతప్రచారకుఁ డొకఁడు వైష్ణవరాజ్యమువారికి వధ్యుఁడు గావలసి వచ్చునుగదా! ఇట్లయిన, ఒకమతమువారి కింకొక మతమువారి రాజ్యము రాజ్యమే నాశముచేయఁ దగినది కావలసివచ్చునే. ఇది యెంత ప్రమాదకరమైన విషయము. కనుక ఎవ్వరి మత స్వాతంత్ర్యమునకును మీరు భంగము వాటిల్లనీయకుఁడు. ఎవరి కిష్టమైన మతమును వారి నవలంబింపనిండు. ప్రజలకందఱి కన్నవస్త్రాదులు కొఱంత పడనీక చేకూర్చి వారిని బాలింపుఁడు. రామానుజాచార్యునిమాత్రము వధించుట ధర్మముగాదు. మీ కిష్టము లేకున్న, మీ రాజ్యమునుండి ఆయన నావలికిఁ బంపవచ్చును. ఇది యైనను ఉత్తమధర్మ మని నే ననను.

చోళ : సరే, కానిండు. ఆ విషయమును నే నాలోచించి నిర్ణయించుకొందును. మన రాజ్యమున శైవమత ప్రచారము చేయుటకు మీ సాయమును గోరుచున్నాను. ఇందుకు మీ యుద్దేశ్య మేమి?

జక్కణ : అట్లుకాదు. రామానుజులను జంపనని మీరు నాకు వాగ్దానము చేయవలయును. ఆయనను జంపినచో మహా పాపమే దేవరకుఁ గలుగునని చెప్పు నా సాహసమును మన్నింతురు గాక. ఇది మీ క్షేమముకోసమే యనియు నా మనవి. ఇఁక మతప్రచారము సంగతి; ఏ యొక్క మత మునుగాని, ఇదే సర్వశ్రేష్ఠ మని ప్రచారము చేయుట నా కిష్టము కాదని యిప్పటికే మీ రర్థము చేసికొని యుండవచ్చును. ఇట్టిస్థితిలో శైవమత ప్రచారము గాదు నా కర్తవ్యము. ఆ యా మతముల మధ్యనున్న అసూయా ద్వేషముల నణఁచి వేసి సర్వమత సామరస్యము సంపా దించుచు శిల్పకళాసేవ చేయుటే నా ధర్మము. నేను కార్యాంతరములచే వింధ్యపర్వతము వఱకుఁ బోవలసి యున్నది. కావున ప్రభువులు మన్నించి నాకు సెలవిప్పింతు రని నమ్ముచున్నాను. రామానుజుల హింసాకార్యమును మాత్రము ఇఁకఁ దలపెట్టరని ప్రార్థన.

పిమ్మట రాజానుమతి వడసి జక్కణాచార్యుఁ డెక్క డికో వెడలిపోయినాఁడు. చోళరాజునకు జక్కణ బోధవలన రామానుజు నేమి చేయుటకును దోఁప లేదు. చంపివేయ వలయునని యాతఁడు చేసికొన్న ఆత్మనిశ్చయమును మాత్రము మార్చుకొన నెంచినాఁడు. జక్కణాచార్య ప్రబోధము సంపూ ర్ణముగా నాతని కర్థము కాకపోయినను, అం దేదో కొంత సత్యమున్నట్లు మాత్ర మాతనికిఁ దోఁపక పోలేదు. అందుచే మరణశిక్షను దొలఁగించి, రామానుజాచార్యుని కన్నులూడఁ

వెడలఁగొట్టవలయునని యాతఁ డాజ్ఞ యిచ్చెను. కాని, జక్కణాచార్యుఁడు శైవమత ప్రాధాన్య మును గూర్చి రామానుజునితో వాదోపవాదము లొనర్చి, యాతని పరాభూతునిఁ జేయుననియు, తన శైవమునకు బలము చిక్కుననియు నాతఁడు కట్టుచున్న గగనసౌధము మాత్రము పునాదులలోనే యాఁగిపోయెను.

"ఎవరో యొక మహానుభావుఁ డేతెంచి రాజునకు తత్త్వబోధచేసి, తనకు మరణశిక్ష తప్పించినాఁ"డని రామా నుజాచార్యుఁడు తెలిసికొనెను. ఈ హఠా త్సంఘటనము ఆ శ్రీమన్నారాయణుని యనుగ్రహమువల్లనే కలిగియుండు ననియు, ఆ దేవుఁడే యా మహనీయుని రూపమున వచ్చి, తన తత్త్వప్రచారమునకు మార్గము లేర్పఱచుచున్నాఁ డనియు నాతఁ డెంతగానో సంతోషించెను. ఆతని కంతకంతకు శ్రీమహా విష్ణునిమీఁద భక్తి గౌరవము లినుమడింప సాఁగెను.

రామానుజుని శిష్యులలో కూరనాథాచార్యుఁడు పరమ గురుభక్తుఁడు. రామానుజావతారోద్దేశ్య మాతని కామూలా గ్రము తెలియును. ఆతఁడు తానే రామానుజుఁడ నని చెప్పి, తన కన్నులను తానే యూడఁబెఱికి రాజభటుల కప్పగించి గురుమహాదేవునికిఁ బాటిల్లిన ముప్పు దొలఁగించి తన లోకోత్తర గురుభక్తినిఁ బ్రదర్శించెను.

పిమ్మట రామానుజాచార్యుఁడు చోళదేశమును వదలి దానికిఁ బ్రక్కనేయున్న హొయసల రాజ్యమునకు వైష్ణవ మత ప్రచారార్థ మరిగెను.

౧౨

మనుష్యు లాపదలో మునిఁగి యున్నప్పుడు, ఆ యాపదఁ గడచు ప్రయత్నమునకు మతభేదములు గాని, వర్గ విభేదములు గాని, ఎట్టి విరోధములుగాని ఆటంకములు గాఁజాలవు. తన కష్టములఁ బాపుకొనుటకు మనుజుఁ డన్యమత సాహాయ్యము నైనను విరోధిపక్ష సాహాయ్యము నైనను ఆశ్రయింప వెను దీయఁడు. భిన్న భిన్న మతములవారి కట్టి పరస్పర సాహాయ్య సహానుభూతులే లేకున్న, "వాఁడు మన మతమువాఁడు గానందున నుపకారా సర్హుఁ"డని భావించిన, నట్టివారిలోని మానవత్వమే యడుగంటిపోవును. కష్టకాలమున నెట్టి యభిప్రాయభేదము లున్న వారైనను, ఒకరి నొక రాదుకొనియే తమలోని మానవతా జ్యోతిని మనుజు లారిపోనీక నిలుపుకొను చున్నారు. ఈ సూత్రము ననుసరించి చూచిన వీరభల్లాళుఁడు శ్రీమద్రామానుజుల సాయము నందుటకు యత్నించుటలోఁ గాని, ఆతఁడు సాయపడుటలోఁగాని వింత లేదు.

అందును నిది యుత్తమ పుత్ర విషయము. నరసింహ దేవుని తన యన్న ప్రతిరూపముగానే భల్లాళరాజు చూచు కొనుచున్నాఁడు. పుత్రుఁడుగాన వాత్సల్యమును, అన్న పేరు పెట్టుకొన్నందున పూజ్యభావమును నరసింహ దేవునియెడ రాజున కున్నవి. కావున వాని గ్రహవిముక్తికి సహజముగనే యాతఁ డెట్టి త్యాగము నైనను జేయఁగలఁడు. విశేషించి శాంతలాదేవి ప్రార్థనము, సహచరుల బోధలు, ప్రజలవాణి

ఆతనిపైఁ బని చేసినవి. వీరభల్లాళుని చిత్తప్రవృత్తి మాఱి నది. జక్కణాచార్యుఁడే యున్నచోఁ దన నీ విపత్సముద్రము నుండి యనాయాసముగానొడ్డు చేర్చెడువాఁడు. మంత్రశాస్త్ర మున నాయనను మించిన చేయి లేదు. అట్టి తన శిల్పగురు స్వామి తన దురదృష్టమునఁ దనకు దూరుఁ డయినాఁడు. ఇఁక నాతనికి గతి యేమి? లేక లేక కలిగిన హొయసల వంశాంకురమును భావి సామ్రాజ్య భార ధురంధరుని ఆతఁడు చేఁజేత పాడుచేసికొనునా? ఎట్టకేలకు రామానుజస్వామి నాహ్వానింప నా రాజేంద్రుఁ డంగీకరించినాఁడు.

ఆచార్యస్వామి యాహూతుఁ డాయెను. భల్లాళ భూపాలుఁ డాతని యథోచిత సత్కారములఁ బూజించి సంగతి నంతయుఁ దేటపఱచి యిట్లనెను —

"స్వామీ! నా ప్రియపుత్రుని గ్రహబాధను నివా రించి నన్నుద్ధరింప దేవుఁ డంపిన దూతగా మిమ్ము భావించు చున్నాను. నా పుత్రు జాడ్యవిముక్తునిఁ జేసి మమ్మును మా వంశమును గాపాడ వేఁడుచున్నాను. మీ చెప్పినయట్లు చేయుటకు సంసిద్ధుఁడను." ఆ మాట లాలించి రామాను జుఁడును "అంతయును శ్రీమన్నారాయణుని కరుణాకటా క్షము. మనము చేయవలసిన ప్రయత్నము లన్నియుఁ జేయు దము గాక." అని యిరువదియొక్క ప్రొద్దులు రాజభవనము నందే యుండి నారాయణోపాసన మొనర్చుచు నాయా మోషధులను గూడ వాడెను. ఏ మందులు, ఏ మంత్రములు

పనిచేసెనో గాని భగవదనుగ్రహముచే బాలకుఁడు నరసింహ దేవుఁడు గ్రహవిముక్తుఁడై తేజరిల్లెను. గ్రహణ బాధనుండి విడివడిన చంద్రునివలె వెలుగుచున్న యా కుమారుని గాంచి యెల్లవారును సంతోష సముద్రమునఁ దేలిరి. రామానుజ స్వామి ప్రభావ మద్భుత మని రాజ్య మంతయుఁ జెప్పుకొనఁ జొచ్చెను.

భల్లాళభూకాంతుఁడు రామానుజుఁడు తన కొనర్చిన మేలున కెంతయు సంతసించి యాతని నపర నారాయణ మూర్తిగనే భావించి "స్వామీ, యింతటి యుపకార మొనర్చిన తమ కేమి సమర్పించి ఋణవిముక్తుఁడను గాఁగలనో యెఱుఁగకున్నాను. కావునఁ దామే తమ వాంఛితమును దెలిపి యీ దీనుని ధన్యునిఁగా జేయ ప్రార్థించుచున్నా"ననియెను.

అంతట రామానుజస్వామియు నదను దొరకెఁగదా యని "ఓ ధరణీవల్లభా! వైదికమతము సనాతనమైనది. అది కడుంగడు విశాలమైనది. ఎన్ని మతములేని యం దంత ర్భూతములై పోఁజాలును. వేదములయం దెల్లను స్తుతింపఁ బడిన యా శ్రీమన్నారాయణుని ప్రసాదముచేతనే నీ సుతుఁడు గ్రహ నిర్ముక్తుడైనాఁడు. ఇందు నా సామర్థ్య మేమియును లేదు. ఆ నారాయణుని భక్తుఁడ నగుటచే నా స్వామి నా వాంఛను నెఱవేర్చెను. ఆ కరుణామూర్తి భక్తజన సులభుఁడు సుమా. కావున నా దేవుని మహిమలను బొగ డుచు సర్వమానవ ధర్మములను బోధించుచున్న వేదముల

లోని వైదిక మతమును విస్తరింపఁజేయుటే నా జన్మమునకు ఫలము. కావున నీకిష్ట మగునేని అధునికమగు జైనమత మును విడనాడి, సనాతనమగు వైదికమతమును జేపట్టుము. అందును నా కభీష్టమై నాచే ప్రచారము చేయఁబడుచున్న విశిష్టాద్వైతమునకుఁ బట్టుఁగొమ్మవై నాకుఁ దోడ్పడుము. ఇదియ నాకుఁ జూపవలసిన కృతజ్ఞత'' యనియెను.

ఈ మాటలకు భల్లాళభూజాని ఆశ్చర్యచకితుఁడాయెను. రామానుజులవారే రత్నరాశులనో, బంగరునో, మతప్రచార మునకు వలయు గజాశ్వభట సందోహమునో, ఇంక నే యే వస్తువులనో కోరుకొనని యాతఁడు తలంచినాఁడు. తన్ను మతము మార్చుకొనఁ గోరునని యా రాజు తలంచి యుండ లేదు. తనతో నింతకుఁ బూర్వము గాఢపరిచయము లేని యీ నూతనాచార్యుఁ డిట్లు కోరుట సాహసముగా నాతనికిఁ దోఁచినది.

''ఆపన్నులగు మానవుల నిష్టము వచ్చిన ట్లుపయో గించుకొందురు గాఁబోలు. తాను రాజైనప్పటినుండియుఁ దన శ్రేయస్సునే కోరుచుండువాఁడు. తన సామ్రాజ్యాభ్యుదయ మున కెన్ని విధములనో దోడ్పడినవాఁడు, అక్కఅయైన తన్నొక్క ప్రియశిష్యునిగా భావించి ఆ యీ యాజ్ఞల నీఁజాలిన వాఁడు. జగదాదర్శప్రాయుఁడు జక్కణాచార్యుఁడే తన్ను మతము మార్చుకొమ్మని యెప్పుడును చెప్పలేదే. కడకే సంద ర్భమునం దైనను సూచనగూడఁ జేయలేదే. ఔను ఆయన

యెట్లు చేయును? ఆ మహాపురుషుఁడీ సంకుచిత మతతత్త్వముల కతీతుఁడు. శైవ వైష్ణవులు గాని, జైన బౌద్ధ హిందూమత ములవారు గాని వాదోపవాదములకు దిగుటను, కలహములకు బూనుటను ఆయన పూర్తిగా నేవగించుకొనెడివాఁడు. సాధకులీ కల్పితనామరూపభేదములనుదాటి పోవలయునని యాతనియాశ యము. ఆయన ప్రధానదృష్టి సృష్టి. ఆ సృష్టితత్త్వము నెఱుం గుటకు మానవు లే సాధనములను గైకొన్నను, ఆ విశ్వసృష్టి కర్తను దెలిసికొని ధన్యులు కావలయుననుటే యా శిల్పా చార్యుని పరమోద్దేశ్యము. ఆహా! ఎంత గంభీర భావము, ఎంత సమరస దృష్టి! ఎట్టి సముచితాచరణము!''

భల్లాణుని హృదయములో జక్కణాచార్యుఁడు మొదలిడియిట్టి తలఁపుల నెన్నిటినో దోఁపఁజేసెను. అయినను దన కిప్పుడు కర్తవ్య మేమి? తన్ను, లోకమును వెలుఁగు బాటలలో నడపింపఁజేయగల ఆ యాచార్యుఁ డిప్పుడు లేఁడు. తను ముఖ్యముగా హిందూమతమును విడనాడుటకుఁ గారణ మందు హింసాప్రధానములగు యాగము లుండుట. ఈశ్వరుఁ డిచ్చిన వేదములోఁగూడ జీవరాశులను గసిమసంగి స్వార్థము సంపాదించుకొమ్మని మానవులకు బోధయా? ఇది యాతని కెంతమాత్రమును రుచింపలేదు. ఈ విషయ మాచార్యునితోఁ దాను బలుసారులు చర్చించినాఁడు. ఆయనయు హింసలేని సనాతన వైదికమత మొకటి గలదనియు, దాని స్వరూపము వేదాదులను సూక్ష్మదృష్టితోఁ బరిశీలించి యర్థము చేసికొన్న

గాని బోధపడదనియుఁ జెప్పుచుండువాఁడు. అట్టిపని చేయు, చేయించు నవకాశముగూడ నిప్పుడు తాను గోల్పోయెను.

ఎంత యాలోచించినను వానికి గత్యంతరము తోఁచ లేదు. "తన కుమారుఁ డొక ఘోరవిపత్తునకు గుఱియై హిందూమతప్రభావముచే బాగుపడినను, మహారాజు జైన మును వదలి వైదికమతస్థుఁడు కాలేదు. ఆతని మతమూర్ఖత యెట్టిది. ఆతఁ డెంత క్రూరుఁడు! ఇట్టి మూర్ఖుఁడా మనకు రాజు? ఈ మూర్ఖుని పాలనము మన కెట్లు పుణ్యప్రదము కాఁగల్గును?" అని ప్రజలు తన్నేవగించుకొనవచ్చును. ఈ యేవగింపుతోఁ దేశమున మతవిరోధములు చెలరేఁగియవి రాజ్య విప్లవమునకు దారితీయ వచ్చును. దేశోపద్రవముచే సాధు వులగు జనసామాన్యము శాంతి సౌఖ్యములకు దూరులగుదురు. నిన్నగాక మొన్ననే యట్టి విప్లవము నెదుర్కొనుటకు విశ్వ ప్రయత్నములు జరిగెను. మఱల నట్టి విప్లవమునే తాను సృష్టించుటా?" విచారించిన కొలఁదియు భవిష్యత్తంతయు నాతనికి భయంకరముగాఁ దోఁచినది. ఈ మహావిప్లవమునకు దా నొక్కరుఁడే కారణము. తాను వైదిక మతములోనికే వచ్చి, యందుఁ జేయవలసిన సంస్కారములు చేయుట లెస్స కాదా?" కడ కాతఁ డట్లు చేయుటకే నిర్ణయించుకొనెను.

రామానుజాచార్యుఁడు భల్లాళభూపాలుని హిందువుగాఁ జేసి విశిష్టాద్వైతమతరహస్యముల బోధించి యిట్లాదేశించెను.

"రాజాగ్రణీ, సకలకల్యాణ గుణసంపన్నుఁడగు విష్ణుదేవుని లీల లనంతములు. అతఁడే మోక్షప్రదాత. మానవజీవిత యాత్ర యా దేవునిఁ జేరుకొన్నఁ గాని పరిసమాప్తి నొందదు. జను లా దేవు నారాధించి తరించుటకై పెక్కు వైష్ణవాలయ ములను నిర్మింపఁ జేయవలయును.

"నీవు నీ రాజ్యమున నుత్తమ శిల్పకళా విరాజమానము లగు దేవాలయములఁ గట్టించి, నారాయణ ప్రతిష్ఠలు సలిపి దేశమును భూలోక వైకుంఠముగా మార్చి విష్ణుదేవు ననుగ్ర హమునకుఁ బాత్రుఁడ వౌదువు గాక! నేఁటినుండియు నీవు విష్ణువర్ధనుఁడవు. ఈ విష్ణువర్ధన బిరుదము సూర్యచంద్రు లున్నంతవఱకును నీ కీర్తిని శాశ్వత మొనర్చును. నే నిదే పోయి వచ్చెదను." అని సశిష్యుఁడై రామానుజాచార్యుఁడు మతప్రచారమునకు వెడలిపోయెను.

రామానుజాచార్యుని రాకయు ఆతనిచే నరసింహ దేవుఁడు గ్రహవిముక్తి పొందుటయు వీరభల్లాళుఁడు జైనమత పరిత్యాగము చేయుటయు, కీర్తిమతి కెంతమాత్రమును నచ్చ లేదు. ఆమె యొకటి తలంచిన, దైవ మొకటి చేసెను. ఆమె దుశ్చింత నవలంబముగాఁ జేసికొని వైదికమతము వారు మాత్రము కార్యసాఫల్యము చేసికొనిరి. ఆలోచించిన కొలఁ దియు జక్కణాచార్యునిత్రోవయు, నాచరణమును, బోధలును కీర్తిమతి హృదయమును బూర్తిగా నాకర్షించుచున్నవి. ఆయన తమ సామ్రాజ్యమునకే మూలస్తంభమును, అలంకార ప్రాయుఁడునని యామె భావింపసాఁగెను.

## ౧౩

భారతదేశము నందలి పుర గ్రామ క్షేత్రముల చరిత్ర మిక్కిలి విచిత్రమైనట్టిది. ఒక్కొక్క క్షేత్రముగాని, నగరముగాని రూపుతాల్చిన వృత్తాంతముల నారసినచో మన మాశ్చర్య పడుదుము. ఇట్టి వానిలో తిరుపతిక్షేత్ర చరిత్రము నొక్కటి. తిరుపతి అత్యంత పూర్వకాలమున కపిలతీర్థ మున్నతావున నుండెడిది. అక్కడ పాములు మెండుగా నుండెడివఁట. దినమున కేపదుగురో పాముకాట్లకు గుఱియై మరణించుచుండెడివారు. ఆ కొండ చఱియపై మల్లయాచార్యుఁడను నొక శిల్పి తపస్సు చేసికొనుచుండువాఁడు. ఈతఁడు మహామంత్రవేత్త. ప్రతిదినము సర్పదష్టులగు వారికి మంత్రములు పెట్టి బ్రతికించు చుండువాఁడు. ఆయన ఒకొకప్పుడు తపస్సమాధిలో నున్నఁ బలుకరింప వీలయ్యెడిది కాదు. అట్టి తఱి సమయమునకు మంత్రము పడక కొందఱు చచ్చుచుండువారు. మొత్తముమీఁద దినమునకే యిద్దఱో ముగ్గురో పాముల మూలమున చావక తప్పెడిది గాదు. గ్రామములోని జనసంఖ్య ఈ విధముగా నానాఁటికిఁ దగ్గుచున్నది.

ఈ విపత్తును నివారించుకొనుటకు గ్రామస్థులగు పెద్దలు కొందఱు మంతనములు సలిపిరి. తుదకు వారు మల్లయాచార్యుని "ఆ యూరికి నాగబాధ శాశ్వతముగా నివారింపనేదైన నుపాయమును గల్పింపవలసినద"ని వేఁడుకొనిరి. మల్లయాచార్యుఁడు యోగదృష్టితోడను, శాస్త్రదృష్టితోడను

చిరకాల మాలోచించి తిరుపతిని ఆ చోటునుండి ఈవలకు జరిపి యిప్పు డున్న తావున పునర్నిర్మింపఁజేసెను.

ఆ చేయుటలోఁగూడ నాతఁడు శిల్ప వాస్తు శాస్త్ర ముల రహస్యముల నాలోచించి, యా గ్రామమును గరు డాకారముగా నుండున ట్లేర్పాటు చేసినాఁడు. ఊరి నడుమ గర్భశిల (బొడ్డు ఱాయి) ను స్థాపించు నప్పుడుగూడ, అందు మహాగరుడ యంత్రమును ప్రతిష్ఠించి, యిరువది యొక్క దినములు గారుడ మంత్రమును పునశ్చరణము చేసి, గ్రామ మునకు సర్పబాధ వాసనగూడ లేకుండఁజేసినాఁడు. ఆ యంత్ర మంత్రముల బలముచేతను, దపస్వియగు మల్లయాచార్యుని తపశ్శక్తి చేతను నాఁటినుండియుఁ దిరుపతి సకలసౌభాగ్యము లతోఁ దులఁదూఁగఁ జొచ్చెను.

మల్లయాచార్యుఁ డింకను గ్రామవాసులకు భూత ప్రేత పిశాచాదుల యుపద్రవము కలుగకుండుటకై ఆంజనేయ స్వామిని గూడ స్వయముగాఁ జెక్కి తిరుపతిలోఁ బ్రతిష్ఠించెను. ఆయన ప్రతిదినమును స్నానముచేసెడి యొక కొలను "మల్లయాచార్ల కుంట" అని నేఁటికిని బిలువఁబడుచున్నది. ఈ కుంటకు దగ్గఱనే గ్రామదేవతగా గంగమ్మను గూడ నా యాచార్యుఁ డా నాఁడే ప్రతిష్ఠించినాఁడు. ఈ గంగమ్మ జాతరను నాఁటినుండియు నేడాది కొకసారి విశ్వబ్రాహ్మణులు ప్రధానపాత్రధారణము చేసి నిర్వహించుచున్నారు. మల్లయా చార్యుఁ డింకను కాళీమూర్తి ప్రతిష్ఠలవి చేసినాఁడని చెప్పు

దురు. తరువాత నా మహనీయుఁడు తిరుపతిలోని పార్థసారథి దేవాలయమునకు శంకుస్థాపనము చేసి యా దేవళము నిర్మాణము పూర్తిగాకముందే సిద్ధిపొందినాఁడు.

హిందూదేశ శిల్పచరిత్రలో జక్కణాచార్యునిది ప్రత్యేక ప్రకరణ మైనట్లు, వైష్ణవమత చరిత్రములో రామానుజాచార్యుని దొక ప్రముఖాధ్యాయము. ఆయన తన కార్యక్రమములో ద్వారసముద్రమున వీరభల్లాళుని వైష్ణవునిగాఁ జేసిన పిమ్మట కన్నడదేశమున మతవ్యాప్తి చేసి, ఆంధ్రములో నడుగుపెట్టి నాఁడు. దేశమున నలుమూలలంగల వైష్ణవాలయముల కేఁగి యాయన యెన్నియో సంస్కారములు చేసెను. ఈ కృషిలో పెక్కు శైవక్షేత్రములును, శక్త్యాలయములును వైష్ణవములుగా మాఱిపోయిన వని యైతిహాసికులగు వృద్ధులు చెప్పుచుందురు. దక్షిణాపథవాసుల దృష్టినేకాక, ఉత్తరదేశమువారి చూపులను గూడ తన దిక్కునకు మఱల్చుకోఁగలిగిన తిరుపతి దేవస్థానమున రామానుజాచార్యస్వామి వైష్ణవసంస్కారము లొనర్చుచున్న దినము లవి.

ఈ తిరుమలపై వేంచేసియున్న వేంకటేశ్వరస్వామిని గూర్చి పలు మతములవారు పలురీతులఁ జెప్పుచుందురు. జైనులీఁ దేవుఁడు తమ కారాధనీయుఁడగు ధరణేంద్రమూర్తి యనియు, ఆ దేవుని భార్య పద్మావతి యనియుఁ జెప్పుచున్నారు. బౌద్ధులు బోధిసత్వమూర్తులలో నొక మూర్తి యని చెప్పుచున్నారు. ఇందుకు వారు సింహళదేశపు బౌద్ధగ్రంథము

లలో ప్రమాణముఁగూడ నున్నవందురు. కొందఱు శైవులు సుబ్రహ్మణ్యస్వామి యనియు, మఱికొందఱు బాలా మూర్తియో, శక్తిమూర్తియో యనియుఁ జెప్పుచుందురు. దీనికి వారు శుక్రవారాభిషేకమును, మారేడుదళముల పూజ (బిల్వార్చన)ను దృష్టాంతముగాఁ జూపుచున్నారు. ఈ మూర్తికి వెనుక జడ యున్నదనియు వారందురు. జడమాట యెట్లున్నను దండచేతులకు నాగబంధము లుండుటమాత్రము ప్రత్యక్ష విషయమే. ప్రాచీనుఁడగు నొక యాళ్వారు "నీవు శివుఁడవో కేశవుఁడవో తెలియ"దని స్తోత్రముచేసియున్నాఁడు. ఇట్టి యంశములన్నియు వేంకటేశ్వరస్వామి పూర్వశివస్వభావమును జాటు చున్న వి.

మొత్తముమీఁద రామానుజాచార్యుని నాఁటికి జైన బౌద్ధుల వాదములు వెనుకకుఁదగ్గి, శైవుల శివుఁడను వాదమే బలముగా నున్నది. నాఁడు శైవులతో రామానుజుఁడు ప్రబల ముగా వాదోపవాదములు చేయవలసివచ్చినది. రామానుజుఁడు తిరుమలదేవుఁడు విష్ణు వని యెన్ని శాస్త్రప్రమాణములను జూపినను శైవు లంగీకరింపనే లేఁదట. కొన్నాళ్ళిట్లు కలహ ములు జరిగిన పిమ్మట, ఒకనాఁటి రాత్రి శైవ వైష్ణవు లిరువురు "శివ కేశవుల యాయుధములను గర్భాలయములో నుంచుద మనియు, తెల్లవారుసరికి దేవుఁడేయాయుధములనుస్వీకరించునో చూచి, దానినిబట్టి యథార్థము తెలిసికొంద"మనియు నొక యొప్పందమునకు వచ్చిరఁట. అట్లుచేసి నాఁటి రేయి రామాను జుఁడు శ్రీమన్నారాయణుని భక్తిమెయి ప్రార్థించినాఁడు. కడకు

దేవుఁడు తెల్లవారుసరికి శంఖ చక్రధారియై దర్శన మిచ్చె నఁట. శైవు లీఁకఁ జేయునది లేక తమ వాదమును వదలుకొని పోయినారనియు, నాఁటినుండియు తిరుమలనాథుని వేంకటేశ్వరునిఁగనే భావించుచున్నారనియుఁ జెప్పుదురు.

ఎట్లయిన నగుఁగాక. భిన్నమతస్థుల వివిధాభిప్రాయములకుఁ దావులేకుండ, రామానుజాచార్యుఁ డానాఁ డా దేవుని శ్రీ వేంకటేశ్వరస్వామిగా స్థిరసంస్కారములు చేయఁదలంచినాఁడు. ఆంతరంగికములగు నాయా సంస్కారములతోఁ బాటు బాహ్యములగు దేవాలయ, మూర్తి పునర్నిర్మాణాది సంస్కారములుగూడ నెన్నియో నాఁ డచ్చట జరుగుచుండెను. ఈ యుభయ సంస్కారములకును సిద్ధహస్తులు, యంత్ర నిర్మాణ కుశలులు, తపసంపన్నులునగు శిల్పాచార్యుల తోడ్పాటుసైత మెం త యో ఆ వ శ్య క ము.

రామానుజాచార్యస్వామి తన వైష్ణవమత ప్రచారమునకు శిల్పకళను గొప్పసాధనముగా నెఱింగినబుద్ధిశాలియగుటచే ప్రముఖులగు శిల్పాచార్యులతో ఆ నాఁ డాయన నేస్తము చేసియున్నాఁడు. ఆంధ్ర, తమిళ, కర్ణాటములం దట్టి శిల్పాచార్యుల తోనాఁడు కొఱఁతలేనందున నీ యాచార్యుని మత ప్రచారము నిర్విఘ్న మయ్యెను. ఆంధ్రదేశమున తిరుపతిలోఁగూడ బొల్లోజు, నాగోజు, ఎఱ్ఱోజు విశ్వరూపస్థపతు లా యాచార్యున కెం త యో తో డ్ప డి రి.

వీరిలో విశ్వరూపస్థపతి మహా శాస్త్రవేత్త; తాపసి. ఆయన బ్రాహ్మముహూర్తమునఁ దపస్సునకుఁ గూర్చుండి

మైదు గడియల ప్రొద్దెక్కి కాని తపస్సు చాలింపఁడు. తరువాత నాతఁడొక సోలెఁడు పాల నేదో యొక చూర్ణము కలిపిన వానిని త్రావి శిల్పనిర్మాణమున కుపక్రమించును. తపస్సమయమున ఆయన దర్శనముగాని, సంభాషణముగాని చేయుటకు వీలు కాదు. ఆతఁడు చాల మితభాషి. గడ్డము మీసములు పెరిగియున్న వానప్రస్థాకారము వానిది. వెంట్రుకలు తిలతండుల న్యాయము నొంది, వానిశిరస్సున కలంకారములై యుండును. ఆతఁడు పరిశుద్ధ ధవళవస్త్రములను మాత్రమే నిరాడంబరముగా ధరించును; అన్నము తినఁడు. పదునైదు గడియల ప్రొద్దెక్కు వఱకును శిల్పముచేసి, పాలు పండ్లు సేవించి నాలుగు గడియలు విశ్రమించి మఱల శిల్పకార్యమునకుఁ బూనుచుండును. పిమ్మట ప్రొద్దు గ్రుంకకమునుపే స్నానమాడి, యా తపస్వి తపోనుష్ఠానములో నిమగ్నుఁ డగుచుండును. ఇది యా శిల్పాచార్యుని నిత్యకృత్యము.

మల్లయాచార్యుఁ డారంభించిన పార్థసారథి దేవాలయము విశ్వరూపస్థతి చేతిమీఁదుగాఁ గడముట్టినది. యంత్రాదులు చెక్కు పనిని ఎల్లోజు నిర్వర్తించెను. శాస్త్రానుసారముగా రామానుజుఁడే దైవప్రతిష్ఠాకార్యమును కొనసాఁగించెను.

రామానుజుఁడు తమిళదేశమును వీడి వచ్చినను, ఆయన చేసిన వైష్ణవమత ప్రచారముమాత్రము అచ్చట విపరీత పరిణామములకు దారి తీసినది. శైవమతాభిమానులు విజృం

భించి వైష్ణవాలయములపై దాడిచేసి వైష్ణవమూర్తుల నూడఁ బెఱికి సముద్రమునఁ బాఱవేయువఱకు నది వెఱ్ఱితలలు వేసినది.

చిదంబరములోని గోవిందరాజస్వామి విగ్రహమును గూడఁ దీసి సముద్రమునఁ బాఱవైచిరి. చిదంబరములో నాఁడు "తిల్లై" అను నొకవేశ్య పరమవిష్ణుభక్తురాలుండెడిది. ఆమెకు విష్ణువన్న పంచప్రాణములు. గోవిందరాజస్వామికిఁ బాటిల్లిన ముప్పునకామె మిక్కిలి దుఃఖించి, యర్చకుల సాయముతో నచ్చటి గోవిందరాజస్వామి యుత్సవమూర్తిని దీసికొని తిరుపతికిఁ బరువెత్తుకొని వచ్చి రామానుజునికి సమర్పించినదఁట. ఆ మూర్తి బంగారముతోఁ జేయఁబడినది. తిల్లై తెచ్చినందున నీ దేవునికి "తిల్లై గోవిందస్వామి" యని పేరు వచ్చినది. రామానుజాచార్యుఁ డా మూర్తి నాధారముగాఁ జేసికొనియే తిరుపతిలో గోవిందరాజస్వామిని బ్రతిష్ఠ చేసినాఁడు. ఇట్లెన్నియో వైష్ణవ ప్రతిష్ఠలును, సంస్కారములును, తిరుపతిలోను,తిరుమలమీఁదను జేసి రామానుజుఁడా స్థానమును మహావైష్ణవ క్షేత్రముగా తీర్చిదిద్దెను. ఈ కార్యముల కన్నింటికిని తిరుమలనంబియు, విశ్వరూపస్థపతి ప్రభృతులును వలసిన దోహదములు చేసినవారే.

తిరుమలనంబి రామానుజాచార్యుని మేనమామ. ఈతఁడు కొండమీఁదినుండి దిగి వచ్చుచుండువాఁడు. రామానుజుఁడు దిగువనుండి కొండ నెక్కుచుండువాఁడు. ఇరువురును మధ్యేమార్గమునఁ గలసికొని నిత్యకైంకర్యము నచ్చటనే

చేయుచుండువారు. వీరిమైత్రి గాఢమైనట్టిది. ఏ కార్యముగాని యుభయు లాలోచించుకొనియే చేయుచుండువారు.

ఆ నాఁడు రామానుజాచార్యుఁడును తిరుమలనంబియు, ద్వారసముద్రమునుండి వచ్చిన దేవోజు శిల్పాచార్యుఁడును దేవాలయము ప్రక్కనే యున్న మండపములో సమావేశ మయినారు. రామానుజు నిదివఱకే యెఱిఁగియున్న దేవోజు తద్ద్వారమున విశ్వరూపస్థపతి పరిచయము సంపాదింప వేచి యుండెను. కొంతసేపటికి తపోగృహమునుండి యప్పుడే యేతెంచుచున్న విశ్వరూపస్థపతిని గాంచి, దేవో జాశ్చర్య చకితుఁ డాయెను. ఆయన తపస్తేజ మద్భుతము గొలుపు చుండ, ఒక సనాతన శిల్పర్షి గా విశ్వరూపస్థపతి దేవోజున కగపడెను. దేవోజు "ధన్యోస్మి" యనుకొని యా స్థపతీశ్వరునికి సాష్టాంగనమస్కార మొనర్చి యిట్లనెను —

దేవోజు : మహానుభావులగు తమ దర్శనముచే నేను ధన్యుఁడ నైతిని. తమ కాటంకము లేనిచో కొన్ని యంశములు మాటాడవలయునని కుతూహల పడుచున్నాను.

విశ్వరూపస్థప: అసలు మీ రెవ్వరో నాకుఁ దెలియదు.

రామానుజాచార్యుఁడు: వీరుహొయసల వీరభల్లాళునియాస్థాన శిల్పులలో నొకరు. పేరు దేవోజు శిల్పాచార్యులు. ఆ రాజు పనుపుననే కార్యార్థులై వచ్చిరఁట. నాకు భల్లాళరాజు పుత్రుని గ్రహవిముక్తునిఁ జేయు సందర్భమున పరిచితు

లైనారు. దక్షిణాపథ శిల్పి చక్రవర్తియని పేరుగాంచిన జక్కణాచార్యుల వారి ప్రియ శిష్యులు.

విశ్వ : మీ రేమి మాటాడఁ జూచుచున్నారు ?

దేవోజు : ఆచార్యులవారి జన్మస్థలమును, నిర్మించిన దేవాలయాదులను, శిష్య సంతానమును గూర్చి వినఁగోరుచున్నాను.

విశ్వ : నేను కోణార్కమునుండి ఇచ్చటికి వచ్చియున్నాను. ఉత్కళమున, పూరి, కోణార్కము, భువనేశ్వరములతోను, ఆంధ్రమున సింహాచలము, అలంపురము, మాచర్ల, లేపాక్షి మున్నగు ప్రసిద్ధ శిల్పక్షేత్రములతోను నాకు పరిచయ మున్నది.

దేవోజు: ఈ శిల్పక్షేత్రములు తమచే నిర్మితములని భావింతును.

విశ్వ : కాదు, కాదు. కొన్ని తావుల మాత్రము కొంత వఱకు నా చేయిగూడ తగిలి యుండవచ్చును. కొన్ని తావుల కొన్ని కొన్ని సూచనలు చేసియుండవచ్చును. అంతేగాని, పూర్తిగా వాని స్రష్టను నేనే యని చెప్ప వీలుగాదు. నా సహశిల్పులును, కొంద ఱుత్కళాంధ్ర శిల్పులును వానిని నిర్మించి యున్నారు.

రామాను : దేవోజాచార్యా, వీరు ప్రధాన సూత్రధారులై నిర్వహించిన దేవాలయములకు లెక్కలేదు. వీరు సర్వజ్ఞులనియు, మన జక్కణాచార్యులవారి యంతటి వా రనియు విని, నేను వీరి సాయము నర్థించి యున్నాను.

దేవోజు : ఆచార్యులవారు "నా సహాశిల్పులును, కొంద
ఱుత్కళాంధ్ర శిల్పులును వానిని నిర్మించియున్నారు."
అన్నారు. మఱి తమ రే దేశమువారో!

విశ్వ : నేను కర్ణాటుఁడను. మాది హొయసల రాజ్యమే.

దేవోజు : తమ గురువుల పేరు సెలవీయఁ గోరెద.

విశ్వ : మా గురుచంద్రుఁడు నాగలింగస్థపతి. మీ దేశికులగు
జక్కణాచార్యులవారును నేనును సహాధ్యాయులము.
మాకు సర్వవిద్యలను, సర్వ శిల్పములను పరమపూజ్యులు
నాగలింగస్థపతులే నేర్పియున్నారు.

దేవోజు : అయిన తాము నాకును గురువులే. పితృతుల్యులు
గూడను. తాము కన్నడదేశము నెప్పుడు వీడిరో!

విశ్వ : విద్యాభ్యాసానంతరము, ఉత్కళాంధ్ర ప్రాంతములకు
వచ్చి కళాసేవతో కాలక్షేపము చేయుచున్నాను.

దేవోజు : గురుపద్యులు జక్కణాచార్యులవా రెక్కడనైనను
తమ కగపడి యున్నారా?

విశ్వ : లేదు. అతఁడు చిన్నప్పటినుండియు విరాగియే. వాని
వైరాగ్యమే నాకును గొంత యంటి యిట్లయినాను. మీ
యాచార్యుల వృత్తాంత మీ రామానుజులవారిచే వింటిని.
వీరభల్లాళుఁడు విష్ణువర్ధనుఁ డగుటయు నీ యాచార్యులవారే
చెప్పిరి.

దేవోజు : నేను విష్ణువర్ధన మహారాజు పనుపుననే వచ్చి
యుంటిని. వారు హొయసల రాజ్యము నలుమూలల

అద్భుత శిల్పకళామండితములగు వైష్ణవాలయముల నిర్మింప దీక్షపూనియున్నారు. ఈ దీక్షగూడ రామానుజులవారొసంగినట్టిదే. అందుకుఁదగిన ప్రధాన శిల్పాచార్యులు కావలసియున్నారు. ఆపదవికి తామర్హులని నాయుద్దేశ్యము. మహాత్మా మీ కళాసేవ కంగీకరింపఁ బ్రార్థించుచున్నాను. మహారాజుగారి యీ సంకల్పమునకు రామానుజులవారును నడ్డుపెట్టరని యాశించెద.

విశ్వ : వలదు, వలదు. ప్రధానాచార్యత్వము మహాభారమైన కార్యము. సర్వశక్తులను కేంద్రీకరించి చూచుచున్నఁ గాని యది నిర్విఘ్నమును పరిపూర్ణమునుగాదు. ఏలోపము జరిగినను గర్తకును, కారయితకును, దేశమునకును హాని వాటిల్లును. అంతగా సమయము నందుకై వెచ్చించు నవకాశముగూడ నాకు లేదు. నా తపోయోగముల కది యంతరాయము కాఁగలదు. కావున మఱొక్క యాచార్యుని వరించి మీ రాజు కృత కృత్యుఁడగుఁగాక. జక్కణాచార్యుల శిష్యులు వేనకువేలు కలరు గదా! వారిలో నెవ్వరినేని యీ పదవి కర్థించి కార్యసాఫల్యము నందుట మంచిది.

దేవోజు : తాము చెప్పినది నిజమే. అయినను మీ తపోయోగములకు వలసిన యవకాశముల కేలోటును రానీయము. తాము ప్రధాన సూత్రధారులై మా కాదేశముల నిచ్చుచున్నఁజాలును. మీ వంటి తపస్వి, యోగి, జ్ఞాని యగు శిల్పాచార్యుఁడు దొరకెనన్న, విష్ణువర్ధనమహారాజు మా

గురువులు జక్కణాచార్యులు చిక్కణ్ణ యుప్పొంగిపోదురు. ఆచార్య శిష్యులలో ననంతకీర్తిస్థపతి మఱల నాచార్యు నంతటివాఁడే. ఆయన మొదటిపేరు శైదాళదాచార్యుఁడు. అనంత పద్మనాభస్వామి కాయన రత్నఖచిత కేయూర మకుట కటకాదులను, సర్వాంగమును నిర్మించెను. అందాతఁడు నెఱపిన శిల్పకౌశలమునకు మహారాజుగారెంతయు సంతసించి ఆయనను "అనంతకీర్తి" యని స్వామిపేరు గూడ కలసి వచ్చునట్లు బిరుదిచ్చి బహుమానించెను. నాఁటినుండియు ఆశిల్పిసోదరుఁ డనంతకీర్తిస్థపతి యైనాఁడు. మా దేశికుల తరువాత, మహాదేవాలయములను నిర్మించు పట్టుల ప్రధానాచార్యత్వము వహించు సామర్థ్య మాయన కొక్కనికే గలదు. కాని ఆచార్యులు గృహపరిత్యాగము చేసినప్పటినుండియు హాసణ నగరములోని దేశికులవారి శిల్పవిద్యా గురుకులమును నడపుభార మాయనమీఁదనే పడినది. ఆచార్యకుమారునికి విద్యాబుద్ధులను, శిల్పకళలను నేర్పుటకుఁగూడ ఆయనయే పూనవలసి వచ్చెను. ఇది మహారాజులకును నిష్టము గావున వా రనంతకీర్తిని ప్రధానసూత్రధారునిగా నుంచుట కిష్టము లేక తగిన శిల్పాచార్యుల నన్వేషింప నన్నా యా దేశముల కంపినారు. ఇది దైవకార్యము గావున తా మంగీకరింపక తప్పదు.

రామానుజస్వామి అచిరకాల పరిచయములోనే విశ్వరూపస్థపతి మహానుభావత్వమును, శిల్పకళాకౌశలమును

గుర్తించెను. మంత్ర యంత్ర తంత్రముల ప్రభావ మెంత యున్నను శిల్పకళాకౌశల మద్భుతముగా నున్ననేగాని దేవస్థానము విజ్ఞాననిలయమై జనులదృష్టి నాకర్షింపఁ జాల దని యాతఁ డెఱుంగును. కావుననే ప్రతి దేవాలయమును గూడ శిల్పకళోద్దీప్తము చేయ నాతఁడు దీక్షపూని తిరుగఁ జొచ్చెను. దేవోజుశిల్పి మాటలు విన్నపిమ్మట విశ్వరూప స్థపతి ప్రధానాచార్యత్వముచే పాలొయసల రాజ్యము వైష్ణవ శిల్ప కళాగారము కాఁగలదని యాతఁడు నిర్ణయించుకొనెను. ఆతని నెల్లెని ప్రోత్సహించి పంపుటకే రామానుజస్వామియు పూని యాతపస్వితో నిట్లనెను.

రామా : ఆచార్యా! దేవోజు ప్రార్థన కేల యంగీకారము చూపరు ? మతప్రచారము చేయుటకు నేనును, శిల్పకళోద్ధరణము చేయుటకు మీరును భగవంతునిచే సృష్టింపఁబడితిమి. మనల సృజించిన యా దేవుఁడు మనచేఁ జేయింప సంకల్పించిన పనులకుఁ దగిన యవకాశములను గల్పించు చుండ మన మేల వానిని దిరస్కరింప వలయును? ఆమహారాజెంతయు సౌమ్యుఁడు. మతప్రీతికి, శిల్పకళాభిమానమునకు నాతఁడు పుట్టినిల్లు. అట్టివాని దండన మనశక్తులను సద్వినియోగము చేయుదము గాక. ఇక్కడి యంత్ర శిల్పాదులను నిర్మింప మన నాగోజు ప్రభృతి శిల్పాచార్యులు సమర్థులు. బొల్లోజుశిల్పి మంత్రజపాదులలో నాకు

సాయపడును. మీ రిప్పుడే హొయసలరాజ్యమునకు పయ నమై ఈశ్వరాదేశమును నిర్వర్తింపుడు. ప్రియమిత్రుని యీ మాట పాటింతురని నమ్మెదను.

అని రామానుజాచార్యుఁడు తిరుమలనంబి వంకఁ జూచెను.

తిరుమలనంబి : విశ్వరూపస్థపతి లేకున్న మన కార్యముల కిబ్బంది యని నా యభిప్రాయము. అయినను, ఇది విష్ణువర్ధన మహారాజుల సంకల్పము గదా! ఆయన పూనుకొన్నచో, పూర్వము జైనమునెట్లు ప్రచారము చేసెనో, అంతకు వేయి రెట్లెక్కువగా మన వైష్ణవ మతమును గూడ విశ్వవ్యాప్తము చేయఁగలఁడు. కనుక మన యవసరముల కితర శిల్పాచార్యుల నుపయోగించుకొని, వీరి నక్కడకే పోవ నర్థింతము. స్థపతివర్యా! రామానుజుల యభిప్రాయమును ముద్దుచేసి, హొయసల రాజ్యమునకు వెంటనే ప్రయాణమగుదురని నమ్ముచున్నాను. మీ కృషి ఫలితముగా కర్ణాటము భూలోకవైకుంఠము కాఁగలదని యెంచుచున్నాను.

శిల్పకళాసేవయే జన్మవ్రతముగా సాఁగింప నెంచిన విశ్వరూపస్థపతి కొంత సేపాలోచించి యందుల కొడంబడెను. తన ప్రయత్నము సఫలమైనందుకు దేవోజు వేయి యేనుంగుల నెక్కెను.

## ౧౪

దక్షిణాచార్యుఁడు గృహత్యాగము చేసినపిమ్మట శిష్యులు తాటియాకుమీఁది జాతకమును గాంచి యాయన పోవుట కది యొక కారణమేమో యని యెంచిరి. సౌపర్ణీదేవి కీ వృత్తాంతము నెఱింగించిరి. ఈ సంగతి విన్న దాది తన తప్పును యజమానురాలి కెఱింగించి క్షమాపణము వేఁడు కొనెను. ఇది యంతయు తన దురదృష్టముచే జరిగినదని తలంచిన సౌపర్ణీదేవి విధివిలాసమునకుఁ దలయొగ్గి లేక లేక కలిగిన ముద్దులబిడ్డపై పంచప్రాణము లుంచి పెంచుచుండెను. ఆచార్యుని ప్రధానశిష్యుఁడగు ననంతకీర్తిస్థపతి దాది పొర పాటుచేఁ గలిగిన కాలవ్యత్యాసమును సర్ది జాతకఫలముఁ బరీక్షించినాఁడు. ఆ శిశువు తండ్రిని మించు మేధాశక్తి, కర కౌశలము, ప్రతిభ కలవాఁడని తేలినది. సౌపర్ణీదేవి యట్టి పుత్త్రరత్నము గలుగుటకుఁగారణుఁడైన విశ్వకర్మభగవానుని హృదయములో నారాధించుచు, మనోవల్లభుని రాకకై వ్రతములు, దానములు, నుపవాసములు సలుపుచు దినమొక యుగముగాఁ గాలము పుచ్చుచుండెను.

శిల్పాచార్యకుమారుఁడు వంశపారంపర్యముగా వచ్చు నామముచే దక్షిణాచార్యుఁ డాయెను. అయినను దక్షిణా చార్యుఁడను ముద్దుపేర నాబిడ్డఁడు పిలువఁబడుచుండెను. అనంతకీర్తిస్థపతి గురుపుత్త్రునిఁ బెంచి విద్యాబుద్ధులు గఱపు టలో గాఢమగు శ్రద్ధ పూనినాఁడు. పదునాలుగేడులు నిండీ

నిండకమునుపే యాతఁ డన్ని విద్యలలోను బాండిత్యము సంపాదించెను. పూర్వజన్మాభ్యస్తములుగా నతనికి కళాసిద్ధులు చేపడినవి. శిల్పశాస్త్ర చర్చలలో నాతఁడు తండ్రిగారి శిష్యుల నోడించుచుండెను. ఆతఁడు దారుక్రియను నేర్చెను. శిలాశిల్పమున నిపుణత వహించెను. పాషాణపరీక్షలో దక్షత నలవఱచుకొనెను. చిత్రకళ, స్వర్ణమణిరచనము మున్నగు సుకుమారక్రియలయందాటి తేఱెను. వారిది ప్రత్నఋషిగోత్రము కావున శిలాశిల్పమునం దాతఁ డెక్కువ శ్రద్ధచూపెను. ఇట్లు బుద్ధియందు మేటియై రెండవ జక్కణాచార్యుఁడా యన నొప్పుచు నాకుమారుఁ డెల్లరకును ప్రేమాస్పదుఁ డాయెను.

అనంతకీర్తి స్థపతికిని అతనికిని శాస్త్రార్థముల విషయమున నభిప్రాయములు కలియుట లేదు. వివిధ శాస్త్రకారుల మతభేదముల కర్థము చెప్పుటలోను—విశేషించి మను, మయ, కాశ్యప, మానసార, విశ్వకర్మల మతములను సమన్వయించుటలోను అనంతకీర్తిస్థపతితో నా శిల్పికుమారుఁ డేకీభవింపలేక పోవుచున్నాఁడు. ఇంతవఱకు జక్కణాచార్యుఁడు నిర్మించిన వివిధ దేవ మానవ మూర్తుల ప్రతిరూపములు వారి శిల్పశాలలోఁ గలవు. అవి ఆ యా శాస్త్ర సంప్రదాయముల ననుసరించి చేసినట్టివి. ముఖాద్యవయవ పరిమాణములం దెక్కువగా భేదములు లేకున్నను, అంగభంగిమలలోను ఆయుధాదుల విషయములోను సూక్ష్మాతి సూక్ష్మములైన భేదములు కొన్ని పొడకట్టుచున్నవి. ఈ యీమద్భేదముల కేదో కారణ ముండునని కుమారునివాదము. ఆసన, స్థానక, శయాన

మూ ర్తుల విషయమునను హ స్తపాదముల వివిధ విన్యాసముల విషయమునను వారిరువురికి మతభేదము లేర్పడుచున్నవి.

జక్కణాచార్యుఁ డాయాశాస్త్రములకు వ్రాసి యుంచిన టుప్టీకలు, గచ్ఛద్వ్యాఖ్యలు నాధారముగాఁ జేసికొని కుమారుఁడు జక్కణ హృదయానుసారము విశేషాభిప్రాయములను సాధించుచుండెడివాఁడు. ఇదంతయు నేదో క్రొత్త మార్గము గాను, సంప్రదాయోల్లంఘనముగాను అనంతకీర్తి భావించువాఁడు. శిలాపరీక్షా విషయమున వారి కిరువురికిని బొత్తిగా నభిప్రాయములు కలియుటే లేదు. శాస్త్రపరిజ్ఞానము మిన్నగా నున్నను, శిలాపరీక్షలో నలవాటెక్కువగా నుండవలయును. అట్టియభ్యాసము డక్కణకు పూర్వజన్మ సిద్ధమైనట్లున్నది. ఇట్లు నానాఁటికి కుమారుని కసంతృప్తి ప్రబలినది. ఒకనాఁ డాతఁడు మాతృదేవితో నీ యంశమును దెలిపినాఁడు. ఆమె కుమారుని లోకోత్తర ప్రతిభాపాటవమునకును, శాస్త్రవ్యాఖ్యాన కౌశలమునకును మిక్కిలి యాశ్చర్యపడినది. ఇట్టి ప్రతిభాశాలి యగు బిడ్డ అపరవిశ్వకర్మయైన తండ్రిచేతిలోనే తీరుగడైనచో నెంత మేటి యయ్యెడివాఁడో యని యామె విచారించినది. ఈ కుమారరత్నమును జూచి యానందించు భాగ్యము తన ప్రియునికి లేనందున కామె లోలోన నెంతయో వాపోయినది. ఆమె డక్కణతో ని ట్లన్నది—

సౌపర్ణి : నాయనా! అనేక విషయములలో నీవు అనంతకీర్తిస్థపతి చెప్పినట్లు వినుట లేదని నీ సహాధ్యాయులగు మయాచార్యుఁడు మున్నగువారు చెప్పుచునేయున్నారు.

కాని నీ స్వభావములో నట్టి యవినయ మున్నదని నేను భావించుటలేదు. మఱి యీ యపప్రథ నీ కెట్లు గలుగుచున్నదో!

దక్షిణాచార్యుఁడు : శాస్త్రార్థములలో మాకు అభిప్రాయములు కుదురనిమాట వాస్తవమే. విశ్వకర్మాదుల మతములనుబట్టి నాయనగారి యభిప్రాయములు వేఱు, అనంతకీర్తిస్థపతుల యుద్దేశ్యములు వేఱు. నేను తండ్రిగారు నిర్మించిన ప్రతిమల నుదాహరణముగాఁ జేసికొనియు, వారు వ్రాసి యుంచిన టీకలు, విశేషసూచనలు నాధారముగాఁ జేసికొనియు నొకరీతిగా నర్థము చేయవలయు నందును. అది వారు సూక్ష్మముగా నర్థము చేసికొనరు. ఇది యంతయు అవినయముగాను, గురుధిక్కారముగాను తోడివిద్యార్థు లెంచుచున్నారు. అంతేతప్ప యథార్థముగా నాలో అవినయ మను వాసనయే లేదు తల్లీ!

సౌపర్ణి : నిన్న నొక పాషాణపరీక్షలోఁగూడ ఆయనను నీవు వ్యతిరేకించినావని తెలిసినది బాబూ! విద్యార్థి కెంత యడఁకువ, యోర్పు ఉండవలయునో యెఱుంగుదువా?

దక్షిణ : ఔ నమ్మా! అది నపుంసకశిల యగుటచే పాదపీఠమున కుపయోగింప వలయునని నే నంటిని. గురువు గారందు కొప్పుకొనలేదు. అది పుంశిలలో తక్కువ జాతి దని వా రన్నారు. చిట్టచివరకు నాదమును బట్టియు, అది పగులు రీతినిబట్టియు, లోపలి వెలుపలి గుణములను

బట్టియు ఏమని తేలినదో ఆ మయాచార్యునే అడుగక పోయినావా ? తెలిసెడిది.

సౌపర్ణి : ఏమని తేలినది ?

డక్కణ : అది నూటికి నూరుపాళ్ళు నపుంసక శిలయే యని. కొన్ని కొన్ని నపుంసక శిలలు పుంశిలలుగా భ్రాంతి గొలుపుచుండును. అట్లే కొన్ని స్త్రీ శిలలును పురుష గుణ విశిష్టములై యుండును. అవి సంకరము లన్నమాట. ఇంత యెందుకు, నాయనగా రుదాహరణముగాఁ దీర్చి పెట్టిన స్త్రీ, పురుష మూర్తుల శిలలను పరీక్షించిన వాస్తవము తేలును గదా !

సౌపర్ణి : నాయనా ! అనంతకీర్తిస్థపతి యిప్పటి కెన్నియో మహాశిల్పములకు స్రష్టయై పేరు మోసినవాఁడు. అట్టి వానిని నీ వలక్ష్యము చేయుట నా కిష్టముగా లేదు. అతఁడు నాకు పుత్రప్రాయుఁడై నీ యభివృద్ధి కెట్లు పాటుపడు చున్నాఁడో గ్రహించినావా ?

డక్కణ : కావచ్చు నమ్మా తల్లీ ! నీ వట్లు మూఢభక్తితో వారు చెప్పిన దంతయు వేదముగా నమ్ము మన్న నాకు సాధ్యమగు పని గాదు. ఇంతవఱకు శిలాపరీక్షా శాస్త్రమే సంపూర్ణముగా రూపొందినట్లు నాకుఁ దోఁచుట లేదు. ఆ శాస్త్ర మింకను సూక్ష్మ పరిశోధనలచే పెరుగవలసి యున్నది. నా కేవేవో క్రొత్త క్రొత్త యభిప్రాయ ములు శిలలనుగూర్చి తోఁచుచున్నవి. వానిని ప్రకటింప

కుండనుండలేను. శిలలకు సత్త్వ రజ స్తమో గుణము లున్నట్లు కనుపెట్టినట్లు లేదు. ఆ గుణములనుబట్టి గూడ శివకేశవాదిమూర్తులకు శిలల నెన్నుకొనవలయును. ఒక మూర్తికి వాడవలసిన శిల ఇంకొక మూర్తి కుపయోగించి నచో ఆ దైవమూర్తి సంపూర్ణ ఫలితములను గాని, సత్ఫలితములనుగాని యెట్లిచ్చును? శాస్త్రములకుఁ గూడ సరియగు వ్యాఖ్యానములు చేసినఁగాని శిల్పగ్రంథముల స్థితి బాగుపడునట్లు లేదు. మా నాయనగారే యున్న, నా కీ సందేహములు కలిగెడివి కావు గదా! కనుక నేను దేశ దేశములు తిరిగి వారిని వెదకి తీసికొని వచ్చెదను.

సౌపర్ణి : లేక లేక కలిగిన చిన్నారి పాపఁడ వగు నీ యెడఁ బాటు నేను సహింపఁజాలను తండ్రీ! కనుక నీ విప్పు డీ ప్రయత్నమునకుఁ బూన వలదు.

దక్షిణ : అట్లు కా దమ్మా! నేను పోక తప్పదు. నన్ను జూచుకొని యూఱట పొందుచున్నావే గాని, వారి పోకకు నీ వెంత దుఃఖించుచున్నావో నాకుఁ దెలియదా!

సౌపర్ణి : బిడ్డా! చిఱుతకూఁకటి పాపఁడవగు నీ వట్టి పనికిఁ బూనవలదు. నిన్ను కంట వత్తిడికొని పెంచుచున్నాము. మన మదృష్టవంతుల మైన నీ తండ్రిగారు మఱి కొంతకాల మున కైనను రావచ్చును.

దక్షిణ : న న్నడ్డగింపవలదు తల్లీ! నే నిఁక పితృ విరహమున కోర్చుకొనలేను వారు నిర్మించిన శిల్పములు, వారు వ్రాసి

పెట్టిన శాస్త్రరహస్య భేదకములగు వ్యాఖ్యలు చూచిన పిమ్మట ఆ మహానుభావుని తండ్రిగాఁ బడసిన నాదే మహా భాగ్యముగా నెంచుచున్నాను. ఆయన కేవలము మన కుటుంబ నాయకుఁ డగు వ్యక్తిమాత్రుఁడు గాఁడు. మానవ ప్రపంచమునకే అక్కఱకు వచ్చు నారాధనీయ వ్యక్తి యని నాకుఁ దోఁచుచున్నది. కనుక వారిని వెదకి తీసికొనిరాక తప్పదు తల్లీ! నన్నాశీర్వదించి పంపుము.

సౌపర్ణి : నాయనా! నీ జనకుని విరహము నింతవఱకును నీ మీఁది వాత్సల్యముచేతనే భరింపఁగలిగినాను. అయినను ఎండ కన్నెఱుఁగని పదునాలు గేడుల పసిపాపని—ప్రపంచానుభవము లేనివానిని పితృదేవుని కొఱకైనను దేశ సంచారమున కేఁగ నంగీకరింపఁ జాలకున్నాను. కనుక సాహసమునకుఁ బూనవలదు.

డక్కణ : తల్లీ! ఏల యిట్టి పిఱికిమాట లాడుచున్నావు? శిల్ప కళా సార్వభౌముఁడగు జక్కణాచార్యుని పుత్త్రుఁడను. నీవంటి పరమ సాధ్వీమణి కన్న పట్టిని. విశ్వకర్మ భగవానుని ప్రియభక్తుఁడను. విశేషించి శాస్త్రచక్షువునై యొప్పు నాకు మెట్టరాని తావులెవ్వి? నా జనకుఁడు తన నామమును గూడ మార్చుకొని ప్రచ్ఛన్న వేషభాషలతోఁ జరించుచుండునని నా యూహ. అట్టి పుణ్యచరిత్రుని, ఆయనకళా లక్షణములను, హస్తకౌశలమును, శిల్పశైలినిబట్టి యెచ్చట నే యద్భుత శిల్పములు చేయుచున్నాఁడో గుర్తించి తేవల యును. ఎప్పటికైనను నా తండ్రిజాడలు నాకే గుర్తింప

సాధ్యములగునుగాని యొరులకుఁగావు. కాఁబట్టి సందేహింపక నన్ను దీవించి పంపుము. కళావీరునకు పత్నివైన నీవు కళా వీరమాతవై గూడ నీ చరిత్రమును ప్రఖ్యాతము చేసి కొనుము.

సౌపర్ణి : కుమారా! నీ శక్తి సామర్థ్యములును, ధైర్యోత్సాహములును, మతిప్రతిభలును నే నెఱుంగక కాదు. లేక లేక కలిగిన చిన్నారి తండ్రిని. నిన్ను బంప మనసొప్పక యిట్లంటిని. పోయిరమ్ము. జాగరూకుఁడవై సంచరింతువు గాక. గాయత్రీ విశ్వకర్మల యనుగ్రహము నీ కగ్గలముగాఁ జేకూరుఁగాక. పూజనీయులగు సానగాది శిల్పర్షుల యాశీర్బలము నిన్నెడఁబాయ కుండుఁగాక. అనాయాసముగా నేఁగి, పూజ్యులగు పితృదేవులతోఁగూడ నచిరకాలముననే నాకు కన్నులపండువు సేయుము. నీ స్నేహితులగు మయాచార్య, చలువాచార్యులను గూడ వెంటఁ దీసికొని పొమ్ము. విజయీ భవ.

౧౫

బేలూరిలో చెన్న కేశ వాలయ నిర్మాణ మారంభింపఁబడినది. విష్ణువర్ధన మహారాజు ముందైదు తావుల మాత్రమే దేవాగారములను నిర్మింపఁజేసి పంచనారాయణ ప్రతిష్ఠలు చేయఁ దలఁచినాఁడు. సనాతనమగు వైదికమతములో పంచ సంఖ్య పరమ ప్రాధాన్యము గలది. ఈ ప్రపంచమే పంచ

భూతములచే సృష్టియైనది కదా! మానవుఁడు పంచజ్ఞానేంద్రియముల చేతనే శబ్ద స్పర్శ రూప రస గంధములతోఁ గూడిన ప్రపంచము ననుభవించుచున్నాఁడు. సత్తు, చిత్తు, ఆనందము అను ఆత్మాంశలు మూఁడును, నామ రూపములను జగదంశలు రెండును గలసియే పంచాంశములతో ప్రపంచ మాయె ననియు తత్వవేత్తలు చెప్పుదురు. ఈ రహస్యమును సూచించుటకే సనాతన వైదికమతములో గాయత్రీ విశ్వకర్మలు, శివుఁడు నను దేవతలు అయిదు శిరస్సులతో నొప్పుచున్నట్లే వర్ణన లున్నవి.

ఈ పంచ సంఖ్యా ప్రాధాన్యమును బౌద్ధ జైన శిల్పములు గూడ జాఱవిడువలేదు. అమరావతీ శిల్పములో స్తూపములకు నాలుగువైపుల నైదేసి యార్యక స్తంభములను నిలిపి నాఁటి శిల్పులీ సంప్రదాయమును రక్షించి యున్నారు. బౌద్ధులీ యార్యక స్తంభములను బుద్ధుని పంచకల్యాణములకును సూచకము లని సమన్వయించుకొనిరి. వీని ప్రాధాన్యమును భల్లాళనరేంద్రుఁడు జక్కణాచార్యులవలన పెక్కుసార్లు విని యున్నాఁడు. ఆ సంప్రదాయ రహస్యమున గౌరవబుద్ధి గల యాతఁడు తొలుదొల్త వేలాపురి (బేలూరు), తలకాడు, తొణ్ణూరు, మేలుకోట, గదగుగళల్లి అను నైదు తావుల మాత్రమే పంచనారాయణ ప్రతిష్ఠలు చేయఁ బ్రయత్నించెను.

వేలాపురి ద్వారసముద్రమునకు యోజనము దూరములో నున్నది. ద్వారసముద్రము తనకు ముఖ్యపట్టణమైనను సమీపముననే యున్న వేలాపురిని గూడ నాతఁడు

విడిదిపట్టుగాఁ జేసికొన్నాఁడు. రాజకీయ కార్యాలయములు పెక్కు లా బేలూరిలోఁ గూడఁ గలవు. రాజ ప్రాసాదములు, రాణులకుఁ దగిన యంతిపురులు, విహారమందిరములు, సభా మండపములు నద్భుత శిల్ప ప్రాభవముతో నచ్చట నిర్మింపఁ బడినవి. మంత్రులయు, దండనాథులయు భవనము లక్కడఁ బెక్కులు గలవు. మహారాజదర్శనార్థమై వచ్చిన సామంత రాజులకును, పాళెగాండ్రకును, రాయబారులకును విడిదిపట్టు లకుఁ బనికివచ్చు సౌధములుగూడ నందే నెలకొని యుండెను. ఆ వచ్చిన వారికిఁ బ్రభుసందర్శనము గూడ వేలాపురిలోని "కళాభవనము" నందే యగుచుండును. కొలఁదికాలములో ద్వారసముద్రమును వేలాపురియుఁ గలసికొనిపోయి యొకే నగరము కావచ్చుననియుఁ జూచువారి కనిపించును.

ద్వారసముద్రములో నిప్పటికే హొయసలేశ్వర శాంత లేశ్వరుల ద్విమండప దేవాలయము శాంతలాదేవిచే మనో హర శిల్పవిరాజితమొనర్పఁబడెను. ఇఁక రెండవ రాజధానియే యని చెప్పఁదగిన వేలాపురిలోఁ గూడ నద్భుత శిల్పముల నొప్పారు దేవాలయము నిర్మింపఁబడినచోఁ గొఱఁత లేకుం డును. అదియింతవఱకుఁ దీర్పఁబడిన దొడ్డగడ్డపల్లి, హాలేబీడుల శిల్పముల కంటె మిన్నయగు శిల్ప సౌందర్యముచే ప్రపంచ దృష్టి నాకర్షించుసదియుఁ గావలెను. ఇట్టి గొప్ప సంకల్ప ముతో విష్ణువర్ధనుఁడు వేలాపురీ దేవాలయ నిర్మాణమునకుఁ బూనుకొనినాఁడు. దానికిఁ దగినట్లు తన్నీకృషికిఁ బ్రేరేపించిన రామానుజస్వామికిఁ గూడ వచ్చిన మహాతపస్వి విశ్వరూప

స్థపతి–రెండవ జక్కణాచార్యుఁడే ఆయనకు లభించెను. ఆస్థపతి తనకు గురుస్థాన మగు నాగలింగస్థపతి శిష్యుఁ డగుటయు, జక్కణాచార్యునకు సహశిల్పి యగుటయు రాజసంకల్పము కొంతంత లేకుండ పండుటకు హేతువు లయ్యెను.

ఇంకను దేశములో నలుమూలలం గల శిల్పి చూడామణులు రప్పింపఁ బడుచుండిరి. చిత్రకళా కుశలులు, భూశోధన నిపుణులు, శిలాపరీక్షాదక్షులు, వాస్తువిజ్ఞాన ఖనులు, గోపురనిర్మాణ ప్రముఖులు, ఆాలమీఁద జిలుగు నగిషీ పనులు చేయఁగల శిల్పులు– బహువిధరూపాచార్యు లెంద రెందరో విచ్చేసిరి. ''రూపకార మదన మహేశ'' బిరుదాంకితుఁ డగు దాసోజు, ఈయన కుమారుఁడు ''రూపకార శరభ భేరుండ'' బిరుదధారియగు చావన్నాచార్యుఁడు, త్రిభువన మల్లరాజు నాస్థానశిల్పియు, ''రూపకారగళగండ'' బిరుదముగలవాఁడును నగు చిక్కహంపాచార్యుఁడు, ''రూవారి పులి, రూపకారగిరి వజ్రదండ'' బిరుదములు గల మల్లియణ్ణ, ''రూవారిగళ గండ గత్తెరి'' యని పేరుగాంచిన పదరిమల్లోజు, ''రూవారిజగదళ'' అను బిరు దందిన నాగోజు, మాయనాచారి, కుమారమాచారి, కెంచమలియన్నాచారి, కేశవదేవాచారి, మసదాచారి, వీరాచారి మొదలగు మహాశిల్పు లా దేవాలయ నిర్మాణమునకుఁ బూనుకొనినారు.

ప్రధానస్థపతి నిర్ణయించిన యొక శుభముహూర్తమున శంకుస్థాపనము చేయఁబడినది. విశ్వరూపస్థపతి ఏ యే కార్యములకుఁ దగినవారి నా యా పనులకు నియమించి పని చూచు

చుండెను. శిలాపరీక్షకై పాషాణశాస్త్రమున నాఁ
కేరళదేశ మహాశిల్పి దాసోజు నియుక్తుఁడాయెను. ఈ శిలా
పరీక్ష మిక్కిలి కష్టమైన కార్యము. చిరకాలానుభవము,
సూక్ష్మపరిగ్రహణశక్తి యున్నఁగాని ఱాలలోని భేదములు
తెలియవు. ఱాలలో స్త్రీ, పుం, నపుంసక భేదము లున్నవి.
ఇంక ననేకములగు గుణదోషములు వానిలో నుండును. శిలల
రంగులను బట్టియు, దెబ్బగొట్టినప్పు డవి పగులు రీతులను
బట్టియు, మ్రోఁతను బట్టియు, వానిలోని యుత్తమ మధ్య
మాధమాది భేదములను గ్రహింపవలయును. ఇం దే యే
జాతుల ఱాళ్లే యే పనులకును, మూర్తులకును ఉపయోగింప
వలసినదియు శాస్త్రము చెప్పుచున్నది. సిద్ధహస్తుఁడగు
మున్ముం దీ శిలాపరీక్ష యొనర్చుకొనిగాని, పనికిఁ బూన
వలనుపడదు. శిలాపరీక్ష యైనపిమ్మట, ప్రతిమా నిర్మాణాది
కార్యములుగూడ మానాదుల నెంచి, శాస్త్ర సంబంధమును
వదలక, సౌందర్యమున కనుకూలముగా నెఱపవలసియుండును.

ప్రధాన దేవాలయములు రెంటి యందును బ్రతిష్ఠింప
వలసిన మూలవిరాణ్మూర్తులను - విజయనారాయణ (కేశవ)
స్వామిని, చన్నిగరాయ (ఇదియు విష్ణుమూర్తియే) స్వామిని,
విశ్వరూపస్థపతియే నిర్మించుచున్నాఁడు. విజయనారాయణ
దేవాలయమును (చెన్నకేశవాలయము) విష్ణువర్ధన మహా
రాజును, చన్నిగరాయ దేవాలయమును శాంతలా మహా
దేవియు నిర్మింపఁ జేయుచున్నారు.

కొన్ని సంవత్సరముల తీవ్రకృషి ఫలితముగా బేలూరి లోని చెన్న కేశవ దేవాలయము రూపు దాల్చినది. విశ్వరూప స్థపతి యాజమాన్యమున ఆ యాలయ మితర దేవాలయముల కన్న మిన్నయై హొయసల శిల్పమున కెల్ల శిరోమణి యై తేజరిల్లె నన్న నతిశయోక్తి కాదు. ఇంతవఱకును పలు దేవాలయములు నిర్మించిన మహాశిల్పులు పెక్కు రిందుఁ బాల్గొనుట చేత క్రమ పరిణతములగు వారి ప్రతిభా నిర్మాణకౌశలము లీ దేవాలయమున సాటిలేని సౌందర్యముద్రలను హత్తినవి.

ఇట్లు దేవాలయనిర్మాణ మంతయు ముగిసి, ప్రతిష్ఠా కాలము సమీపింపనున్న సమయమున విష్ణువర్ధన మహారాజు తనయులగు వర్ధమాన, నరసింహదేవులను, సతులగు శాంతలా, సహజా, కీర్తిమతులను వెంటనిడుకొని ఆలయములలోని శిల్ప సౌందర్యమును దర్శింప నేఁగుదెంచెను. అట్లు వచ్చిన మహారాజ కుటుంబమునకు విశ్వరూపస్థపతియే స్వాగతమొసఁగి, యాశీస్సు లిచ్చి యందలి శిల్పవిశేషములను వివరింపసాఁగెను.

"ప్రభువరేణ్యా! ఈ దేవాలయము నూతనమగు వాస్తు పద్ధతిని గట్టఁబడినది. ఆంధ్ర తమిళ కళింగాది దేశములలోని దేవాలయ వాస్తునకును, మన హొయసలరాజ్య దేవాలయ వాస్తు పద్ధతికిని జాల భేద మున్నది. మన శిల్ప వాస్తు శైలి గూడ ప్రత్యేక మైనదే. ఇటు చూడుఁడు. ఆలయమునకు దిగువభాగమున అలంకృతము లైన యేనుంగులవరుసలు చెక్కఁబడినవి. వానికి పైని సింహములు భయంకరములై తీర్పఁబడినవి. తూర్పున నున్న ప్రవేశద్వారమున కిరు ప్రక్క

లను గండరించిన యీ ద్వారపాలకుల యందచందములను అంగభంగిములను గాంచుఁడు. ఆ ద్వారమునకే రెండు వైపులను లాంఛనప్రాయముగాఁ దీర్చిపెట్టిన హొయసల మూర్తులను దిలకింపుఁడు. వారు మృగేంద్రములను మర్దింపఁజాలిన సింహాధిక పరాక్రములు. ఆ సమీపముననే తీర్చిపెట్టిన రతి మన్మథమూర్తు లెట్లు సౌందర్య రాశులై తేజరిల్లుచున్నవో చూచితిరా! ఆలయపు నాల్గుభాగములను వెలుపలనున్న గోడలపై జగన్మోహనశిల్పము చెక్కఁబడినది. ఈ ప్రక్కనున్న యీ మూర్తు లన్నియు శివసంబంధములు. తరువాతివి వైష్ణవమూర్తులు. ఈ దేవాలయమున శాస్త్రీయములైన గర్భాలయము, శుక (సుఖ) నాసము, నవరంగము మున్నగు ముఖ్యభాగము లెంతయుఁ బేర్కొనఁదగినవి.

'తూర్పువాకిలికి పై భాగమున హిరణ్యకశిపుని జంపుచున్న నరసింహామూర్తి చెక్కఁబడినాఁడు. ఆ తావున గజాసురుని మర్దించుచున్న శివప్రభావచిత్రణ మున్నది. పడమటి గోడమీఁద నున్న రతిమన్మథులను, ప్రత్యేకముగా నున్న రతిదేవిని చూడుఁడు. ముందటిగోడమీఁద తమ కొలువు కూటము నచ్చుగ్రుద్దినట్లుగా మల్లోజు శిల్పించియున్నాఁడు.

''భువనేశ్వరీ చక్రమని పిలువఁబడు వితానమునకాధారములగు మధ్య నున్న యీ నాలుగు స్తంభముల మీఁది శిల్పము నిట్టి దట్టిదని చెప్పఁదరము గాదు. వీనిలో మోహినీ స్తంభము, నరసింహ స్తంభమును సర్వోత్తమ శిల్పనిధానములు. ఆ మోహినియొక్క జగన్మోహనమూర్తిని

చూచితిరా! ఈ నరసింహ స్తంభముమీఁద మిక్కిలి సూక్ష్మములగు జిలుగు నగిషీ పనులు, లు వివి ధావతారములు, వినతాగరుడులు, సృష్టిలోని పెక్కురీతుల స్థావర జంగమములగు వృక్ష లతా పుష్పాదులు, పశు పక్ష్యాదులు నద్భుతముగా గండరింపఁబడినవి. ఆ భువనేశ్వరీ చక్ర (వితానము) మధ్యమున నున్న ఉగ్రనరసింహుని, ఆ చుట్టు నున్న దేవకన్యలను జూడుఁడు. దీర్ఘకాలము తపస్సుచేసి, చిక్కహంపాచార్యుఁడును, నాగోజును ఈ వితానమును నిర్మించినారు.

"ఆ నవరంగపు నడిమి కంబములందును, తక్కిన ప్రదేశములందును జెక్కిన మదనికా మూర్తులను బరిశీలింపుఁడు. అందు కొన్ని నాట్యభంగిమలలో నున్నవి. మఱికొన్ని మర్దళాది వాద్యముల వాయించుచున్నవి. ఆ సుందరమూర్తుల సొగసు, ఒయ్యారము, అంగభంగీ విశేషములను దర్శింపుఁడు. కేశవదేవాచారి మసదాచారి మున్నగు యువశిల్పులు వీనిని దీర్చి తమ కళారాధన సామర్థ్యమును వ్యక్తీకరించినారు."

తరువాత నా ప్రధాన సూత్రధారుఁడు దేవాలయము వెలుపలి భాగమున నున్న శిల్పవిశేషములను గూడ నిట్లు వివరించెను.

"మహారాజా, ఈ ఆలయభిత్తికలపైఁ దీర్చిన శిల్పము లన్నియు సౌందర్యమున కాలవాలములు. ఇందు భారత రామాయణాది పురాణేతిహాస గాథలు, లౌకిక విషయములు

గూడ రూపు తాల్చినవి. ఈ గోడపై పార్వతీ శివులు, లక్ష్మీ నారాయణులు, సూర్య, జనార్దన, మాధవ, హరిహర, వామన, నారసింహ, శ్మశానకాళి, రావణాది మూర్తులు జీవకళ లుట్టిపడునట్లు తీర్పఁబడినవి. ఈ యుత్తరపు గోడపై చాముండేశ్వరీ, మహిషాసురమర్దనీ, దక్ష, వరాహ, చతుర్ముఖ, నాగరాజ, కేశవ, నటరాజ, సూర్యనారాయణాది మూర్తులు దర్శన మిచ్చుచున్నవి. ఇటు చూడుఁడు! ఈ సుందరాంగి యలంకరించుకొని యద్దములో తన ప్రతిబింబమును జూచుకొని మురియుచున్నది. ఈ కన్నె మిన్న తాంబూలము వేసికొను చున్నది. ఈ వీర శిఖామణిని గాంచుఁడు. ఆలీఢపాదుఁడై విల్లెక్కు పెట్టి బాణ ప్రయోగము చేయుచున్నాఁడు. నాట్యము చేయుచున్న యీ జగదేకసుందరిని జూడుఁడు. ప్రక్కనున్న మర్కట మామె చీర కొంగును లాగుచున్నది. ఆ చేడియ దాని నదలించుచున్నది. ఈ కామిని స్నానమాడి శిరోజముల నీరు పిండుచున్నది. క్రింద కారు నా నీటి బొట్టులఁ జూచితిరా? ఇవి యన్నియు భరత శాస్త్రమున కుదాహరణములైన ప్రతిమలు. వాని యంగభంగిమలు, ఒయ్యారములు, భావప్రదర్శనము, రసాభినయ ప్రకారములు చూడుఁడు.''

విశ్వరూపస్థపతి యిట్లన్ని దిక్కులయందును, ఆ యా అంతర్భాగములందును దీర్చిన దివ్యశిల్పములను వరుసగా వివరించి చెప్పెను. రాజకుటుంబమువా రందఱును ఏ స్వర్గలోకముననో, వైకుంఠముననో, కైలాసముననో విహరించుచున్నట్లే

యనుభూతి పొంది తన్మయులై పోవుచుండిరి. రాజపత్ని లొకొక్క శిల్పమును దిలకించి యా ప్రతిమలకు నమస్కరించుటే కాక, తమకుఁ దెలియకుండగనే మహాశిల్పాచార్యున కును గైమోడ్పు పెట్టుచుండిరి. వర్ధమాన, నరసింహుల మనస్సుల కీ శిల్పులు మానవులనియే తోఁపక, సాక్షాద్దేవాంశ సంభూతు లనియే స్ఫురించెను. వారు తమ తలిదండ్రులు చేయించుచున్న శిల్పకళాపూజకు ముగ్ధులై పోయిరి. విష్ణువర్ధన భూజాని ఆనందాతిశయమును బట్టఁజాలక శిల్పాచార్యునితో నిటనెను—

"శిల్పాచార్య! జగదేక మోహనమైన శిల్పసృష్టి చేసినారు. హొయసలేశ్వర దేవాలయ శిల్పమునకన్న నిది యెన్నియో మడుంగు లుత్తమముగాఁ దోఁచుచున్నది. ఈ స్తంభశిల్పములు సాటి లేనివి. ఎన్నిరీతుల స్తంభములను నిర్మింపగలిగిరి! ముఖ్యముగా నీ నరసింహ స్తంభ శిల్పము చూడవలసినదేగాని చెప్ప నలవిగానిదిగా నాకుఁ దోఁచుచున్నది. ఈ మోహినీ స్తంభములోని మోహిని ఇంత సుందరాంగి కనుకనే పరమశివు నంతవానినిగూడ మోహపెట్టఁజాలినది. ఇట్టి జగన్మోహిని నింతవఱకు గ్రంథములలోఁ జదువుటేకాని కన్నులతోఁ జూడమైతిమి. మా అట బ్రహ్మలై మీ రీ నాఁడీ మూర్తిని సృష్టించి మాకుఁ జూపినారు. ఈ హరిహరనాథమూర్తి శైవవైష్ణవ మతసమన్వయము చేయుచున్నట్లున్నదే! ఆహా! ఒక్కొక్కమూర్తి యెంత సుందరమై ప్రకాశించుచున్నది. ముక్కోటి దేవతలనుగూడ ఈ ఆలయ

మున గండరించి చూచువారి కెంత మహోపకారము చేసినారు. ఇది యంతయు శిలలు చెప్పు కవిత్వముగా నున్నది. ఎట్టి నిరక్షరాస్యులకైనను, మందబుద్ధులకైనను ఈ దేవాలయము చరిత్రల బోధించి భక్తి, జ్ఞాన, వైరాగ్యముల నలవఱచు ననియే నాకనిపించుచున్నది.

"కళాసార్వభౌమా! ఈ దేవాలయ శిల్పమును జూచి నంతనే కామక్రోధాది దుర్గణములు మటుమాయమై శాంత్యా నందరసములు వెల్లి విరియుచున్నవే. మూల విరాట్టులగు నీ చలువచన్నిగరాయ, విజయనారాయణమూర్తు లెంత మనో హరములు. వీనిని గాంచినంతనే సాక్షాద్విష్ణు దర్శనమైన ట్లానందము పొందుచున్నాము. ఆ విజయనారాయణస్వామి తలచుట్టునున్న ప్రభామండలిలోఁ గూడ దశావతార ములను జిత్రించినారే! ఈ ఆలయము "సర్వం విష్ణుమయం జగత్" అన్న సూక్తికి దృష్టాంతముగా నున్నది కదా! ఇట్టి దేవాలయమును గాంచి మా జన్మములు ధన్యములైనవి. మా జన్మములే కాదు. దీనిని దర్శించి మననము చేసినవారి పుట్టువులుగూడ కృతార్థములే.

"ఇందు లౌకిక శిల్పములనుగూడ నెంత యద్భుతముగా శిల్పించినారు. ఆ రాయంచల బారులు, ఆ సింహాలతలు, ఆ లతావితానములు, ఆ నానా పక్షి విశేషములు ఎంత సహజసుందరములుగా నున్నవి. సింహముల మద మణంచు నా హొయసలరాజుల మూర్తులు మానవులకు పరాక్రమ వ్రతమును బోధించుచున్నట్లున్నవే. ఆహా! నాట్యవేదము

నంతయు నిక్కడ రూపెత్తించిన మీ శిల్పాచార్యు లెంతటి మహానుభావులు. "మదనకై" (మదనికా) మూర్తుల నెంత యందముగాఁ దీర్చిపెట్టినారు. తన ముద్దులచిలుకకు పలుకులు నేర్పు నా యువతి యొప్పిదము నేమని పొగడఁగలము. నృత్యము సలుపుచున్న యీ యువతి శిలగాఁ దోఁచుట లేదే! త్రిభంగిమముగా నున్న యీ సుందరి, ఆమె కాళ్ళకు సమీపముగాఁ బోవు నా తేలు ఎంత సహజముగా శిల్పింపబడినవి. దండచేతిమీఁద వాలిన చిలుకతో నావనిత యెంత యొప్పుచున్నది. ఆహా! లోకవృత్తములుగూడ నిం దెంత రమ్యముగాఁ జిత్రించినారు!

"ఈ చలువచన్నిగరాయ దేవాలయశిల్పము శాంతలాదేవి యదృష్టమో యన నెంత మనోహరముగా నున్నది. ఆ యాలయము నందలి సరస్వతి, గణపతి, లక్ష్మీనారాయణ మూర్తులను దీర్చినది మల్లియణ్ణ, కుమారమాచార్యులు గాఁబోలు. అవి యెంత రమ్యములు. ఆ మహిషాసురమర్దనీ మూర్తి వీరప్రతాపముల నీ శిల్ప మెంత గొప్పగాఁజిత్రించినది.

"ఈ రెండుదేవాలయములందును గండరించిన విగ్రహములకుఁ బెట్టిన యాభరణము లెంతటి పనితనముతో నొప్పుచున్నవి. కటక కేయూర నూపుర హారాదు లేమి, కటిభూషలేమి, శిరోలంకారములేమి, వింత వింత నగిషీపనులతో సుందరాంగుల దృష్టి నాకర్షించునవిగా నున్నవే. ఏ మూర్తికైనను, ఒక్క యాభరణమునేని మఱచిపోకుండ నన్నింటిని దిద్ది తీర్చిన

మీ శిల్పుల జాగరూకత నేమని ప్రశంసింతును. మహాస్థప తీశ్వరా! మీరును మీ శిల్పులును మానవమాత్రు లని మాకుఁ దోఁచుట లేదు. మీ కేమొసంగి కృతజ్ఞత చూప గలము! ఇట్టి శిల్పచక్రవర్తిని గన్న మా కన్నడతల్లి ధన్యు రాలు. మా దేశప్రజలు ధన్యులు. కళాదృష్టితోఁ జూచిన మానవలోకమే ధన్యమైన దనవలయును."

ఇట్లు శ్లాఘించి మహారాజానందభరితుఁ డాయెను. విశ్వరూపస్థపతి తన సేవ ప్రశంసాపాత్ర మైనందుకు సంతృప్తి పడెను.

ఈ శిల్పసందర్శనముచే లకుమాదేవి (కీర్తిమతి) హృద యములో క్రొత్తమార్పు కలిగినది. ఇంతవఱకు నామె మన స్సులో నున్న యసూయ, ద్వేషము మొదలగు చెడ్డభావము లంతరించెను. ఆమె స్వార్థము నశించినది. తన సవతికి, ఆమె తనయునికిఁ దాను జేయఁబూనిన యెగ్గులు అజ్ఞానజన్యము లని యామె గ్రహించినది. అందు కామె మిక్కిలి నొచ్చు కొన్నది. సద్గుణములు సదాచరణము లేని జీవితము నిర్గంధ కుసుమ మని యామెకుఁ దోఁచినది. తనలోని దుర్గుణములను బోకార్చుకొని కల్యాణగుణములను గూర్చుకొన నామె శప థము చేసికొన్నది. ఒక్క కీర్తిమతియే కాదు. ఆ దేవాలయ దివ్యశిల్పములను గాంచిన ప్రతివారును అట్లే మాఱిపోవు చున్నారు.

౧౬

వేలాపురీ దేవాలయమున హేవిళంబి సంవత్సర చైత్ర శుద్ధ పంచమీ సోమవారమునాఁడు విజయనారాయణ ప్రతిష్ఠ జరుప ముహూర్తము నిర్ణయింపఁబడెను. హొయసల రాజ్యమింతవఱకు సాధించిన విజయములకు గుర్తుగా నీ నారాయణునకు విజయనారాయణుఁడని మహారాజు పేరిడెను. ఈ ప్రతిష్ఠా మహోత్సవములకు రామానుజాచార్యుఁడును రప్పింపఁబడినాఁడు. వీరభల్లాళుఁడు వైదిక మతములోనికి మాఱుట రాజ్యములోని పెక్కు తెగలవారికి హర్ష కారణ మైనది. హింసాత్మక యజ్ఞముల కెదురుతిరుగు జైన, బౌద్ధులును, కొందఱు హిందువులును, వీరశైవులును నీ మార్పునకు హర్షింప లేకుండిరి. ఎవరి యభిప్రాయము లెట్లున్నను విధివిలాస మడ్డగింపఁబడఁ జాలదు కదా!

అన్ని వర్గములవారును రాజ్యములో జరుగుచున్న శిల్ప కళాభివృద్ధికి మాత్రము సంతసించుచునే యుండిరి. "భల్లాళ రాజు జైనుఁడై యున్నప్పుడును, హిందువుగా మాఱి విష్ణువర్ధనుఁ డైనప్పుడును కళాసేవను మాత్రము విస్మరింప లేదు. ఆతఁడు కళామార్గమున బాహ్యేంద్రియ తృప్తిని జేకూర్చుటే గాక, పరమాత్మ సాక్షాత్కారమునకును, జ్ఞాన విజ్ఞానముల యభివృద్ధికిని దోడ్పడుచున్న మహారాజు. ఆతని కార్యములు ప్రజల కెట్లు నచ్చకుండును? ఆతని శిల్పకళాసేవచే భావి కాలమున హొయసల రాజ్యమే చరిత్రలో సాటిలేని స్థానము

నాక్రమింపఁగలగు!" ఇట్లని యన్ని తెగల ప్రజలును ఆనం దోత్సాహములఁ దేలియాడుచుండిరి. ఇంక కొలఁది దినము లలో ప్రతిష్ఠామహోత్సవములు జరుగ నున్న వనఁగనే దేశము నలుమూలలనుండియు ప్రజ లా దివ్య శిల్పములను దిలకింపఁ దండోపతండములుగా వచ్చుచుండిరి. ప్రతిష్ఠా తంత్రము రేపటినుండి ప్రారంభము కానున్నది. ఈ నాఁడు మూల విగ్రహమూర్తులను గూడ స్వేచ్ఛగా దర్శింప నెల్ల వారి కవకాశము కల్పింపఁబడెను.

కుమారశిల్పి డక్కణాచార్యుఁడును కష్టములు లెక్కింపక తండ్రికోసమై గ్రామములు, పల్లెలు, పట్టణములు, దేశ ములు దిరుగుచు నందందుఁగల శిల్పరమణీయములగు దేవాల యములను దర్శించుచు, వానిని నిర్మించిన యాచార్యుల వృత్తాంతముల నెఱుంగుచు, తండ్రి జాడల నెమకుచుండెను. ఆతఁడు చోళమును గాలించెను. పాండ్యమును వెదకెను. కేరళమును బరిశీలించెను. దక్షిణాంధ్రము నన్వేషించెను. మఱల కర్ణాటమునఁ గాలు పెట్టెను. మహీశూరపురము చేరు నప్పటి కద్భుతములగు వేలాపురీ శిల్పవృత్తాంతములు కుమా రుని చెవులఁ బడినవి. ద్వారసముద్రరాజగు విష్ణువర్ధనుఁడు బేలూరిలో విశ్వరూపస్థపతి యాజమాన్యమున దివ్యశిల్పములతో నొప్పు దేవాలయమును గట్టించినాఁడనియు, అది యంతయు భూలోక వైకుంఠమే యనియు నా కుమారుఁడు వినెను. ఆస్థపతి మహాత్ముఁడనియు, తపస్వియు, యోగియు జక్కణా చార్యు నంతటి వాఁ డనియు, రెండవ విశ్వకర్మ వలె

నాతఁడు దేవాలయశిల్పముల నిర్మించెననియు జనులు చెప్పు కొనుచుండిరి. అనేకులు వేలాపురీ ప్రతిష్ఠలను దర్శింప నేఁగు చుండిరి. వారి వెంటనే డక్కణాచార్యుఁడును బేలూరికి వేంచేసెను.

డక్కణాచార్యుఁడు వేలాపురీదేవాలయ శిల్పవైభవము నంగోపాంగ పరిశీలనముతోఁ దిలకింపఁ బూనెను. ఆ శిల్ప సౌందర్యమున కాతఁడు దిగ్భ్రాంతుఁ డైనాఁడు. తా నింత వఱకుఁ జూచిన దేవాలయములం దెందును నింత గొప్ప శిల్పము లేదు. ద్వారసముద్రములోని వైశాలేశ్వరాలయ శిల్ప సౌందర్యమునకంటె నిది మిన్నయై మెఱయుచున్నది. సంప్ర దాయములు, కళారీతులు మాత్ర మవియే. ఆ రెండు దేవాల యములు నిదియు నొక్క చేతిమీఁదుగా తీర్చబడ్డవే కావల యును. లేదా ఒక సంప్రదాయములో గడిదేఱిన శిల్పుల రచనములైనఁ గావలయును. ఇది ఆ హొయసలేశ్వరాలయ నిర్మాణముచేత పరిణతప్రజ్ఞుఁడైన శిల్పాచార్యుని రచనమని సమ్యక్పరిశీలనముచేఁ దెలియవచ్చుచున్నది. కావచ్చును. తనతండ్రి శిష్యుల యులులే దీనికిని రూపము కల్పించినవి కావున కళలో భేదములేని యభివృద్ధి యుండవచ్చును. ఎట్ల యిన నగుఁగాక. ఇది యంతయు నద్భుతముగా శిల్పస్వామి చేయు తాండవము! ఆతఁడు తాను వచ్చినపనిని మఱచినాఁడు. ఆ శిల్పసౌందర్యమును జూచుటలోనే మునిఁగిపోయెను. ఆల యము లోపల వెలుపలఁ గల దివ్యశిల్పములను దిలకించిన పిమ్మట మూలవిరాట్టుల మూర్తులఁ బరిశీలింప నారంభించెను.

"ఆహా! ఇవి అసాధారణములు! విజయనారాయణస్వామి నిలువెత్తు విగ్రహము. వైకుంఠములోని విష్ణుమూర్తి దివ్యస్వరూపమున కిది ప్రతిబింబమే. ఆదేవుని యందచందము లీమూర్తియందుచక్కఁగా పొందుపడినవి. శంఖ చక్ర గదా పద్మ విరాజితములగు నా బాహువులు, ఆ చిర్నగవు చెంగలించు ముద్దుమోము, ఆ కేయూర కిరీటాది భూషలు ఎంత బాగుగా నున్నవి!

చలువచన్నిగరాయ మూర్తియందమును వర్ణింప నాదిశేషునకే చేతగావలయును." ఆ బాలుఁడా మూర్తుల నిట్లు చూచి చూచి భావించి భావించి, తన మెత్తనిచేతులతో వానిని నిలువెల్ల నిమిరి చూచినాఁడు. చన్నిగరాయనిఁ దాఁకి పరామర్శించునప్పుడు కుమారుని మోములో నేదో యొక వింత వికారము తోఁచినది. ఇంతవఱకును నున్న సంతోష రేఖలు మాయ మైనవి. కోపాంకురములు గూడ మోములో తారాడినవని చెప్పవచ్చునేమో. వెంటనున్న శిల్పికుమారులతో నాతఁడీ విగ్రహము దోషదూషిత మన్నాఁడు. ఈ మాట కక్కడి వారెల్ల రాశ్చర్యపడిరి. పదునైదేడుల ప్రాయపు బాలుఁడు, మహాకళా సార్వభౌముని శిల్పమునఁ దప్పుపట్టుచున్నాఁడు. కొందఱిది యపరాధమని భావించిరి. మఱికొందఱీబాలుఁడు వెఱ్ఱివాఁడని తలంచిరి. ఇతనికి రాజదండము తప్పదని కొంద ఱెంచిరి. ఈ వార్త శిల్పివర్గము లోనికిఁ బ్రాకెను. దాసోజుశిల్పి వచ్చినాఁడు. బాలుఁడు మాత్రము చలువ చన్నిగరాయమూర్తి దోషయుక్తమనియే

వాదించుచుండెను. దాసోజుశిల్పాచార్యుఁ డాశ్చర్యపడినాఁడు. ఆతనికిఁ గోపము గూడ వచ్చినది. అయినను తప్పనువాఁడు బాలుఁడు గావున వాత్సల్యముతో నాతఁడా కుమారుని మందలింప నెంచి యిట్లనెను.

దాసోజు : వత్సా! నీవు చిన్నవాఁడవు. శిల్పశాస్త్రము సముద్రమంతటిది. నీవిపు డందు ఓనమాలు చదివి యుండ వచ్చును, శిల్పనిర్మాణానుభవమును నీ కుండెనని తలంపను. పెద్దలకార్యముల నేల తూలనాడెదవు? ఇది ప్రమాదము. కావున మిన్నకుందువు గాక.

ఆ మాటలకు డక్కణాచార్యుని వెంటవచ్చిన శిల్పి కుమారుఁడు మయాచార్యుఁడు "ఆచార్యా, వయస్సునకు విద్యకును సంబంధము లేదు. ఒకొక్కనికి విద్యాసిద్ధి జన్మాంతర సంస్కారముగాఁ గలుగవచ్చును. కావున నీ బాలుని వాదమును మీరు సాంతము విని పూర్వ పక్షము చేయుట న్యాయము. అట్లు చేయక తృణీకరించుట యేటి ధర్మము?" అనెను.

డక్కణ : అయ్యా! శిల్పశాస్త్రమున నే నోనమాలు దిద్దుకొను వాఁడనే యగుదును గాక, శిల్పకర్మాభ్యాసము చేయని వాఁడనే యగుదునుఁ గాక, తప్పులు వెదకుటకు విశేష ప్రజ్ఞ యక్కఱ లేదు గదా! అసలీ మూర్తి పూజార్హమే కాదు. దీనిని ప్రతిష్ఠించినచో కర్తకును, కారయితకును హా ని వా లు ను.

బాలుని తీవ్రవాదమున కందఱును విస్మితులై పోవు చుండిరి. దాసోజున కేమియుఁ దోఁచలేదు. ఈ సంఘటన మున కాతఁడు కదలిపోవుచున్నాఁడు. శిలాపరీక్షా కుశలుఁ డగు దాసో జెంతగానో చెప్పి బాలుని మార్పఁ జూచెను. కాని ఫలితముమాత్రము శూన్యము.

ప్రధానా చార్యుఁడగు విశ్వరూపస్థపతి కీవిషయము తెలిసినది. ఆయన విశ్రాంతి తీసికొనుచున్న సమయమది. "తన శిల్పమును తెగువ పూని తప్పని చెప్పఁగల ప్రజ్ఞానుభవ శాలి యెవ్వఁడు! అందును బాలుఁడటే యాతఁడు!" ఆయన కా సంఘటనము వింతయై తోఁచినది. ఆ దోషజ్ఞుఁడు బాలుఁడని యలక్ష్యము చేయక యా స్థప తీశ్వరుఁ డట కరుదెంచి వానితో వాదించినాఁడు. గడియల కొలఁది కాలము వాదోపవాదములు సాగినవి. కుమారుఁడు తన ధోరణిని మార్చుకొనఁడు. విశ్వరూపస్థపతి చివర కిట్లన్నాఁడు.

విశ్వ : బాలకా! ఈ శిల్పరచనము బిట్టిదేవ విష్ణువర్ధన మహా రాజుగారి పోషణమున జరిగినది. శిల్పశాస్త్రములో నుద్దండులై విశేషానుభవముగల వారు వీనిని జేసి యున్నారు. నీవు కఱ్ఱతనపు చేష్టగా నీ విగ్రహశిల్పమును వెక్కిరించుచున్నావు. ఇది మహారా జెఱింగిన నీ కప కారము గల్గును. అందును ఈ చలువచన్నిగరాయ మూర్తిని నా చేతిమీఁదుగాఁ దీర్చి యుంటిని. కావున

దీర్ఘదృష్టి కలవాఁడవై నీ వాదము నుపసంహరించుకొనుట మంచిది.

దక్షిణ : ఆచార్యావర్యా ! పలు మాటలను నే నంగీకరింపఁ జాలను. నాకు రాజదండనము కలిగినఁ గలుగుఁ గాక. సత్యమును వాక్రువ్వ వెఱచువాఁడను గాను. ఇందలి దోషమును శాస్త్రసమ్మతముగా నిందఱియెదుటను మహా రాజునకే చూపఁగలను.

విశ్వ : వత్సా! ఇందు దోషమే యున్నచో, ఏ చేతితో వేనకువేలు దివ్యశిల్పములు తీర్పఁబడినవో, ఏ హస్తము సర్వశ్రేష్ఠములగు నీ వేలాపురీ శిల్పములను సృష్టించినదో ఆ నా దక్షిణహస్తమును ఖండించుకొందునని ప్రతిన చేయుచున్నాను. ఇఁక నిందలి దోషమును నిరూపింతువు గాక.

దక్షిణ : ఆచార్యస్వామీ! మంచిగంధమును విగ్రహము నకు నిలువెల్లఁ బూయింపుఁడు. పిమ్మట నిందలి దోష మును నేను నిరూపింతును.

విశ్వరూపస్థపతి పీరప్రతిజ్ఞ కెల్లరును సంచలించిరి. ప్రజలు, శిల్పులు, ఆ యా పెద్దలు నాశ్చర్యచకితులైరి. బాలుని సాహసమున కేమి ముప్పు వాటిల్ల నున్నదో యని కొందఱు జాలిపడుచుండిరి. మహారాజునకు వార్త పోయినది. సకుటుంబియై రామానుజ సహితముగా నాతఁడు విచ్చేసినాఁడు. బుడుతని మాట చొప్పున మంచి గంధమా మూర్తి కంతటను బూసిరి. కొంతవడి కా

శ్రీగంధ మాఱఁజొచ్చెను. సర్వాంగము లందును బూసిన గంధ మాఱిపోయినది. మూర్తి బొడ్డువద్ద పూసిన గంధము మాత్ర మాఱలేదు. ఇంక కొంతసేపటి కాఱు నేమో యని వేచియుండిరి. ఎంతసేపటి కది యాఱనే లేదు. దక్కణాచార్యుఁ డంతట ఉలిని,సుత్తెను చేతఁబూని బొడ్డు దగ్గఱ పేడు డులిచెను. వెంటనే యటనుండి యొక చిఱుకప్ప యెగసి యీవలఁబడెను. పిమ్మటఁ గొంత నీరును బయటకు వచ్చెను. జను లందఱు నాశ్చర్యపడిరి. రాజ ప్రభృతులు నిర్విణ్ణులైనారు. శిల్పులు వెల వెల పోయిరి.

దక్కణ : మహారాజా! శిల్పి చూడామణులారా! ఈ చన్నిగ రాయమూర్తిశిల్పము శాస్త్రసమ్మత మైనదే; లోకా ద్భుతమే! అయిన నేమి, ఇది గర్భిణీ శిల. "శిలాచ్ఛేదనే తక్షణేఽపి మండూకం దృశ్యతే యది, సా శిలా గర్భిణీతి జ్ఞాత్వా తాం వర్జయేత్." అని వైఖానసాగమము చెప్పు చున్నది గదా. ఇట్టి శిలను మూలవిరాట్టున కుపయోగింప రాదు. ఇచ్చటి శిల్పు లెల్లరును మఱొకసారి శిలా లక్ష ణమును శాస్త్రము లందుఁ బరికింపుఁడు.

విశ్వరూపస్థపతి మోమున నెత్తురు చుక్క లేదు. ఆతనికి షష్టిపూర్తి కాఁబోవుచున్నది. ఇప్పటి కాతఁడు నిర్మించిన శిల్పములకు లెక్క లేదు. ఎచ్చటను నాతఁడు వ్రేలు పెట్టి చూపించుకొనలేదు. ఎల్ల శిల్పులు నాయన శిల్పమునకు కైవారములు చేసినవారే. నేఁ డీ బాలకునిచే

పరాజయము వాటిల్లినది. ఆతని మనస్సులో అలనాఁడు సరస్వతీపీఠాధిపతి బ్రహ్మానందస్వామి చెప్పిన భవిష్యత్ ఫలితము స్ఫురించినది. ఈ బాలుఁడు తన కాపుత్రుఁడా యేమి? ఆతఁ డిట్లన్నాఁడు.

విశ్వ : బాలకా! నీ దేయూరు? ఇట్టి వీరకుమారుని గన్న పుణ్యాత్ములు నీ తలిదండ్రుల పేరు లేమి? నీ వెచ్చట శిల్ప విద్యాభ్యాస మొనర్చితివి?

డక్కణ : కళాతపస్వీ! మాది హాసన్ నగరము. సుగృహీత నాముఁడు మహాశిల్పి సార్వభౌముఁడు జక్కణాచార్యుఁడు నా పితృదేవుఁడు. సాధ్వీశిరోమణి సౌపర్ణీ దేవి నా జనని. నా తండ్రి యంతటి శిల్పి అనంతకీర్తిస్థపతి నా గురుమూర్తి. పూజ్యపాదులు నాగలింగస్థపతుల శిల్పవిద్యాగురుకులము నా కళాభ్యాస మందిరము.

కుమారుఁ డీ మాట లనుచుండఁగనే విశ్వరూపస్థపతి నేత్రములు కన్నీటితో నిండిపోయినవి. ఆతని శరీరము వణఁకిపోవుచున్నది. అప్రయత్నముగనే ఆతని చేతిలోని జపమాల జారి క్రిందఁ పడినది. సౌపర్ణీదేవి పే రాతని నిద్రాణమగు హృదయమును తట్టి లేపినది. ఆమె పుట్టింటి వారి గోత్రకర్త సుపర్ణఋషి గూడ ఆయన మనస్సులో మెదలి 'సౌపర్ణి' నావంశపు టాడుపడుచని చెప్పినాఁడు. "ఈ బాలుఁడు తన కుమారుఁడా! ఈతని చేత నేనా బ్రహ్మానందస్వామి తన కపజయము సూచించినది?"

ఆతఁ డీఁక భావింపలేక పోయినాఁడు. విధి విలాసమునకు ముగ్ధుఁ డైనాఁడు. 'కుమారా' యని ఆ బాలుని బిగ్గఁ గాఁగిలించుకొని చాలసే పానందబాష్పములతో నాతని శిరమును దడిపినాఁడు. రాజును బ్రజలును నాశ్చర్యపడు చుండిరి. ఆ ప్రథమ సమాగమములో ఆ పితాపుత్త్రి లొకరి నొకరు చూచుకొని పెద్దతడ వానందసాగరమున నోలలాడిరి. కొంతవడికి డక్కణకుమారుఁ డొక తాటి యాకుపై వ్రాయఁబడిన జాతకమును దండ్రికిఁ జూపి యిట్లనెను.

డక్కణ : నాయనా! నా జననకాలమున దాది మీయొద్దకు విసరిన నిమ్మపండు దురదృష్టవశమున నక్కడనున్న గుండ్రాయి తగిలి వెనుక కేగెను. దానిని మఱల దాది మీచెంగటకు విసరినదఁట. అట్లు చేసినయామె మగబిడ్డ పుట్టినాఁడను సంతోషమునలనను, పనితొందరవలనను జరిగిన సంగతిని మీ కెఱింగింప మఱచినది. ఆ కాల వ్యత్యాసముచేఁ గలిగిన మార్పువలన జాతకము మీకు భ్రాంతి కలిగించినది. ఆ కాలమును సర్దికట్టిన జాతక మిది. దీని ఫలితమును గూడ మీ రారయుదురు గాక.

జక్కణాచార్యుఁ డాజాతకఫలముల నాలోచించి చూచినాఁడు. ఈ జాతకుఁడు తండ్రిని గెలువఁగల ప్రజ్ఞా నిధి యగునని తేలినది. ఇప్పుడు జరిగినదికూడ నదియే కదా!

విశ్వరూపస్థపతియే జక్కణాచార్యుఁడని తెలిసినపిమ్మట విష్ణువర్ధనుని సంతోషమునకు మేరయే లేదు. పదునైదు

సంవత్సరములనాఁడు గృహపరిత్యాగము చేసిన తన శిల్ప గురు స్వామి తనకు లభించినాఁడు. మహారాజొక్కసారి జక్కణాచార్యుని గాఢముగాఁ గౌఁగిలించుకొనినాఁడు. ఆతఁడు జక్కణయే కాకున్న వేలాపురీశిల్ప మింత మహనీయముగా వెలయునా! ఈ సంతోషములో మహారాజునకు శిలాదోషముచే చన్నిగరాయమూర్తి పనికిరాక పోయె ననియు, ప్రతిష్ఠాముహూర్తము సమీపించుచున్న దనియును దోఁపనే లేదు. శాంతలా కీర్తిమతులును ఆచార్యుఁడు లభించినందులకును, ఆయనకుమారుఁ డింతవాడయినందులకును మిక్కిలి సంతసించిరి.

జక్కణ : మహారాజా! దోషభూయిష్ఠమగు శిలను ప్రధాన మూర్తి కుపయోగించి మీకపరాధము చేసినవాఁడను. నన్నిట్లేల బహుమానింతురు ? కానున్న ప్రతిష్ఠా మహోత్సవములకుఁ గూడ నాటంకము కల్పించినవాఁడ నయితిని. అది యట్లుండె. నా ప్రతిజ్ఞానుసార మిప్పుడీ దక్షిణహస్తచ్ఛేదము జరుగవలసియున్నది.

దాసోజు : ఆచార్యస్వామీ! ఈ తప్పులకు బాధ్యులు తాము కారు. శిలాపరీక్షలో బని చేయుచు దోషయుక్తమగు శిలను ప్రధానమూర్తికై తమకు సమర్పించిన నేను దండనార్హుఁడను. మహారాజులు నా యీ నేరమునకుఁ దగిన శిక్షను విధింతురు గాక. తాము చేతిని నఱకుకొన నక్కఱ లేదు. చన్నిగరాయమూర్తిని చెక్కిన శిలను నేనును మంచి గంధము పూసి శోధించి పై బరువు చెక్కిం

చిన పిమ్మటనే తమవద్ద కంపితిని. అయినను ఏదో దుర దృష్టవశమున నీ లోపము వాటిల్లినది.

డక్కణ : ఆచార్యా! మొదట మూగి జాతికి గంధము పూసి మీరు శోధించియుందురు. బరువు చెక్కిన పిమ్మటఁగూడ నట్టి శోధన జరుగవలయును. మూగశిల మందముగా నుండుటచేత మధ్యస్థము లగు నిట్టి దోసఁగు లప్పుడు తెలియఁబడవు. మీరు ద్వితీయ శోధనము జరిపిన నీ లోపము పాటిల్లి యుండెడిది కాదు.

జక్కణ : కావచ్చును. దాసోజూ, లోపము నీదైనను దండ నార్హుఁడవు నీవు కావు. ఈ నిర్మాణ కార్యములో జరుగు నందఱి లోపములకును ప్రధానాచార్యుఁడే బాధ్యుఁడు. నీవు పొరపాటుపడినను నీపై నమ్మికచే పునఃపరిశీలనము చేయకయే శిల నా పని కుపయోగించిన పొరపాటు నాది కాదా? కాఁబట్టి నా హస్తచ్ఛేదము ప్రతిజ్ఞానుసారము జరుగవలసినదే.

దేవోజు : గురుమహాదేవా! మన్నింతురు గాక. ఈ తప్పునకు మొట్టమొదట బాధ్యుడు దాసోజు. రెండవవాఁడను నేను. దాసోజు పిమ్మట శిలాపరిశీలనమును తుదిసారి చేయవల సినవాఁడను నేను. నా బుద్ధికూడ నా సమయమునకు మందగించి యిట్లు జరిగినది. లేకున్న విజయనారాయణ మూర్తి శిలను బరిశీలించినవాఁడను దీని నేల విడిచిపుచ్చు దును! కావున తా మీ విషయమున నెంతమాత్రమును

బొరపాటు పడలేదు. తమచే నిర్మింపఁబడిన మూర్తిశిల్ప మంతయు శాస్త్రసమ్మతముగను, సుందరముగను నున్న దని కుమారశిల్పియే పొగడుచున్నాఁడు గదా! కావున దోష భాగులు తాము కారు.

జక్కణ : ఎట్లయిన నగుఁగాక. ప్రధానాచార్యుఁడను నేను. ఈ పొరపాటు నా యదియే. కావున నా ప్రతిజ్ఞ నెఱవేఱ వ ల సి న దే.

డక్కణ : తండ్రీ! క్షమింపుఁడు. మంద భాగ్యుఁడ నగు నేనీ సంఘటనమునకుఁ గారణ మయితిని. దాసోజు, దేవోజు శిల్పులు చెప్పిన ట్లీ దోషము తమ వలన జరిగినది కాదు. కావున తాము హస్తచ్ఛేదము చేసికొన నక్కఱ లేదు.

జక్కణ : మీ రెల్లరు నా కెగ్గు జరుగునని నివారింపఁజూచు చున్నారే కాని, నన్ను సత్య ప్రతిజ్ఞునిఁ జేయఁ జూచుట లేదు. మీ యందఱి వాదములలోను స్వార్థము దాఁగు కొనియే యున్నది. కావున నేను వాని నంగీకరింపఁ జాలను. నేను చేసిన ప్రతిజ్ఞను పాలించుకొని దైవ స్వరూపమగు సత్యము నారాధించుటే నా కర్తవ్యము.

డక్కణ : నాయనా! పదునైదేండ్లుగా మీ వియోగదుఃఖము ననుభవించుచున్న నా తల్లి కడ మిమ్ము తీసికొని వత్తు నని చెప్పి, పూని వచ్చినాఁడను. అదృష్టవశమున మిమ్ము గలసి కొనిధన్యుఁడ నయితినని సంతసించుచుండ మీ రిట్లు చేతిని నఱకుకొని, మాదుఃఖము నినుమడింపఁ జేసెదరా?

నేను కారణముగా నంగవైకల్యమును బొందిన మిమ్ము దీసికొనిపోయి నా మాతృదేవి ముఖమెట్లు చూడఁగలను? కావున నా ప్రార్థనము నాలించి నన్ను మన్నించి యీ ప్రతిజ్ఞనుండి విరమింపుఁడు.

జక్కణ : సౌపర్ణీదేవి సాధ్వీశిరోమణి. అట్టి శీలవతిని ముందు వెనుకలు విచారింపక శాస్త్రవిశ్వాసముచే శంకించిన పాపిని నేను. పేరు మార్చుకొని పదునైదేండ్లు భార్యాపుత్రాదుల వంచించి తిరిగిన దోషముగూడ నాలోనున్నది. ఆ పాపములచేతనే యిక్కడ నీ పొరపాటు జరిగియున్నది. కావున నాకిట్టి ప్రాయశ్చిత్తము తగినట్టిదే. ఎవ్వరును దీనిని నివారింపఁ బూనకుఁడు. విధివిలాసము నిరంతరాయమై సాగిపోవుఁగాక.

డక్కణ : తండ్రీ! మాతృదేవిని శంకించుటకుఁగూడ మీరు బాధ్యులు గారు. దాదితప్పు కారణముగా నది జరిగినది. ఒరుల తప్పులను మీపై వేసికొని మీరేల దానిఫలితముల ననుభవింపవలయును? మీ యుద్యమము సకారణమని నేను తలంపను. ఇఁక మహారాజులవారేమందురో యట్లు చేయుదము.

మహారాజు : ఆచార్యస్వామీ! కుమారుఁడు చెప్పినదియు, దాసోజు దేవోజులు చెప్పినవియు సమంజసములుగానే యున్నవి. జరిగిన యీ రెండు దోషములకును దా మెంత మాత్రమును బాధ్యులు కారు. కావున తాము హస్త

చ్ఛేదము చేసికొన నక్కఱలేదు. నా ప్రార్థన నాలకించి యీ ప్రయత్నమును మాని, ముందు జరుగవలసిన ప్రతిష్ఠా కార్యమునకుఁ బూనుకొందురుగాక. ఇంతవఱకుఁ జరిగిన దానికి మన మేమియుఁ జేయఁ జాలము. చిరకాలముగా తమయెడఁబాటునకు చింతించి యీనాఁడు సమాగమభాగ్యమునకు మురియుచుండ మమ్మందఱ నేల మఱల విషాద సముద్రములో ముంచెదరు ?

జక్కణ : మహారాజా! ప్రజలకు ధర్మప్రబోధము చేయవలసిన మీరే యిట్లనుచున్నారా ! ఎల్లరి తప్పులకును ప్రధానాచార్యత్వము వహించిన నేనే బాధ్యుఁడను గావలయును. ఈ విగ్రహమున దోషమున్న చేయి నఱికి కొందునని ప్రతినచేసిన వాఁడను నేను. ఆ దోషమెట్టిదైనఁ గానిండు. ఎవరిచే గలిగినదైనఁ గానిండు. బాధ్యత పూని ప్రతిజ్ఞ చేసినది నేనే కదా ! మఱి, నేను నా చేసిన ప్రతినను నిర్వర్తింపక సత్యవచనుఁడ నెట్లు గాఁగలను ? ఉత్తమ శిల్పాచార్యుఁ డెన్ని యోగ్యలక్షణములో కలిగియుండ వలయునని శిల్పశాస్త్రము చెప్పుచున్నది. అట్టి స్థితిలో ఆడినమాటనే జరుపలేకున్న నేను శిల్పికుల కళంకమ నగుదునుగాని శిల్పికులాదర్శ ప్రాయుఁడను గాను. ఇట్టి మహాపరాధ మొనర్చి, విశ్వకర్మేశ్వరుని, శిల్పిలోకమును వంచించినవాఁడను గాఁజాలను. కావున నా ప్రతిజ్ఞ జరిగిపోవలసినదే.

మహారాజు : ఆచార్యస్వామీ! తమ ధర్మదీక్ష యెంత నిశిత మైనది! తా మవతారపురుషులుగా నున్నారు. తమ వీర ప్రతిజ్ఞ, సత్యవ్రతము, సదాచార పరాయణత అత్యద్భుత ములు. యువరాజు కానున్న నరసింహదేవుని తమ పవిత్ర దక్షిణహస్తముతో నక్షతలు చల్లి దీవింపరా? విజయ నారాయణ ప్రతిష్ఠ తమ చేతులమీఁదుగా జరుగవలయునని యాశించితిమే. మాయాశ లన్నియు భగ్నములు కావలసినదేనా గురుదేవా? కావున మమ్మనుగ్రహింపుఁడు. ఈ యైదు దినములు గడచి మహోత్సవములు నెఱవేఱిన పిమ్మట తమ ప్రతిజ్ఞను నెఱవేర్చుకొందురుగాక. మాకీపాటి యవకాశ మిం డు.

జక్కణ : మహారాజా! మీరు మీకుఁ దెలియకుండగనే స్వప్రయోజనపరు లగుచున్నారు. నే నెప్పుడు ప్రతిజ్ఞ చేసితినో యప్పుడే యీ దక్షిణహస్తము తెగిన దానితో సమానమే యయినది. ఇఁక దీని నాశీర్వాదములకుఁగాని, కళానిర్మాణమునకుఁ గాని యుపయోగింపను. ఇప్పుడు జరుగబోవునది బాహ్యమగు హస్తచ్ఛేదము మాత్రమే.

మహారాజు : ఆచార్యా! జీవితమంతయు కళారాధన కోసమై వెచ్చించిన నేను, కడకు మహాకళాస్రష్ట కరచ్ఛేదమున కంగీకరింపఁగలనా? ఒక వంక కళాసృష్టియు, మఱొక వంక కళాసృష్టి కర్తలకు ద్రోహమునా? ఇది సాధ్యమగు పని గాదు. రామానుజాచార్యస్వామీ! మీరైనను ఈ

శిల్పాచార్యుల హస్తచ్ఛేద ప్రయత్నమును నివారించి, మమ్మును, కళాజగత్తును గాపాడ వేఁడుచున్నాను.

రామానుజాచార్యుఁడు : మహారాజా! జక్కణాచార్యుల వారు మనుష్యమాత్రులు గారు. ఆయన శిల్పకళా దర్శ ములనే కాక, మానవాదర్శములను గూడఁ జాటుటకై యవతరించిన విశ్వకర్మేశ్వరుఁడని నాకుఁ దోఁచుచున్నది. నాకు చోళరాజు విధించిన మరణదండనమును దప్పించిన దీ మహానుభావుఁడేయని యిటీవల మా కూరనాథునివలనఁ దెలిసినది. జక్కణాచార్యులవారు పూనుకొనకున్నచో, ఏ నాఁడో చోళుని దురాగ్రహమునకు నేను బలియై పోయెడివాఁడనే. నాచే నింతటి మత ప్రచార కార్యము చేయించిన పుణ్యమును వీరిదే. వీరే పనిగాని, పేరు ప్రతిష్ఠల కోసమై చేయరు. ఈశ్వరాదేశముల నెఱింగి నిర్వర్తించుటే వారి జీవితోద్దేశ్యముగా నగపడుచున్నది. వెక్కండ్లు తిరుపతిలోను, సింహాచలమునందును వారితోఁ గలసి మెలసి పనిచేయుటచేత వారి స్వభావము కొంత యవగతమైనది. ఇట్టి పరమగంభీర స్వభావుని నేనింత వఱకుఁ జూడలేదు. ఇట్టి మహితాత్ముని ప్రతిజ్ఞ కడ్డు చెప్పు సాహసమును నేఁ జేయఁజాలను. వారి పరమ పవిత్ర వర్తన మానవుల కందఱి కాదర్శప్రాయము. ధర్మ సూత్రముల నింత నిశితముగా నాచరించు మహాపురుషు లే కాలమునందైనను, ఏ దేశమునందైనను అఱుదుగా నుందురు ప్రభూ!

అక్కన : మహారాజా! ఆచార్యులవారు సత్యప్రతిజ్ఞులు, దృఢవ్రతులు, ధర్మనిరతులు నని మనము చిన్ననాఁటినుండియు నెఱుంగుదుము. వారిని నివారించుట మన కేగాదు, వారిని సృజించిన దేవునికిఁ గూడఁ జేతఁగాదు. యుగమున కొక్కరో యిద్దరో యిట్టి జగదాదర్శపురుషులు పుట్టి లోకమునకు ధర్మమును జాటి పోవుచుందురు. అట్టివారి ననుసరించి ధన్యులగుటయే లోకుల కర్తవ్యము. ఆచార్యుల వారు హస్తచ్ఛేదముచేసికొన్నను. వారియమోఘాశీస్సులు మనమీఁదఁ బ్రసరించుచునే యుండును. హొయసల సామ్రాజ్యమునకు వారి యాశీర్వాదమే రక్షాకవచము. ఇఁక వారి ప్రతిజ్ఞా నిర్వహణమునకు మన మడ్డు చెప్ప వలదు. ఆచార్యులవారు జరుపవలసిన యీ ప్రతిష్ఠ అంత వాఁడగు ననంతకీర్తిస్థపతి నాహ్వానించి, వారిచేఁ జేయింతము. ఈ లగ్నమునకు విజయనారాయణ ప్రతిష్ఠ మాత్రము జరుపుకొందము. చలువ చన్నిగరాయప్రతిష్ఠ నాపివేయుదము. ఇది దేవరకును నిష్టనుగు ననుకొందును.

రామాను : అనంతకీర్తిస్థపతి యీ ప్రతిష్ఠాకార్య మొనర్చుట మిక్కిలి సముచితము. దేవమూర్తి స్థాపనచేయుటవలననే శిల్పాచార్యునకు స్థపతి నామము కలిగినదని మానసార ఋషీంద్రుఁడుగూడఁ జెప్పియున్నాఁడు. అందును వేద శాస్త్రవేదియు, సదాచారపరుఁడును, జక్కణాచార్యుల వారికి ప్రియశిష్యుఁడును నగు అస్థపతివర్యుఁ డీ కార్యమును నిర్వహింప సర్వవిధముల నర్హుఁడు. అక్కనమంత్రిగారు

చెప్పిన ట్టీ ముహూర్తమునకు, చన్నిగరాయ ప్రతిష్ఠ నాఁపి, విజయనారాయణ ప్రతిష్ఠనే ముగించుదము.

డక్కణ : చలువచన్నిగరాయ ప్రతిష్ఠయు నాఁప నక్కఱ లేదు. ఈలోపల మఱల నట్టిమూర్తిని నేను నిర్మించి యీయఁగలను. మహారాజుల యాజ్ఞ యెనఁజాలును. మీపనులయందు మీ రుండవచ్చును.

డక్కణాచార్యుని యీ మాటల కందఱు నాశ్చర్య పడిరి. "జక్కణాచార్యుఁడే మహాశిల్పిసార్వభౌము డనుకొను చుండ, వారికుమారుఁడు డక్కణాచార్యుఁ డాయనను మించిన వాఁ డైనాఁడు. పులికడుపున మేక పుట్టదు గదా! ఈ పితా పుత్రు లెంత మహనీయులు! జక్కణచే కళా జ్యోతులతో వెలిఁగిపోయిన హొయసలరాజ్యము డక్కణచే నింక నెంతగా వెలుఁగవలయునో" యని ప్రజలు చెప్పుకొనసాగిరి. అక్కన మహామంత్రి యాలోచనమునకు మహారా జంగీకారము చూ పె ను.

జక్కణాచార్యుఁ డందఱియెదుట ఖడ్గముతో హస్త చ్ఛేద మొనరించుకొని తన వీరప్రతిజ్ఞను నెఱవేర్చుకొనెను. ఆతని కరకౌశలమేనాఁడో డక్కణాచార్యునిలోఁ బ్రవేశించినది గదా! ఈ భయంకర దృశ్యమును గాంచి యెల్లరును దల్లడిల్లి పోయిరి. ఎల్లవారి మనస్సులును, ఇహసుఖములను తృణీక రించి ధర్మమును, సత్యమును నారాధింప మొగ్గుచూపినవి. ఇంతకు ముందే శిల్పదర్శనముచే మాఱిపోయిన కీర్తిమతిదేవి యీ దృశ్యమును గాంచి పూర్తిగా ధర్మసంసక్తచిత్తయైనది.

ఆ యమ స్వార్థము, అది కారణముగాఁ గలిగిన దుశ్చింతలు, ఆమె శాంతలా నరసింహదేవులకుఁ దలంచిన యెగ్గులు మాటి మాటికి మనసులోఁ దలయెత్తి యామె శాంతికి భంగము కలిగించుచున్నవి.

మనోవాక్కాయములతోఁ జేసిన దోషములకన్నింటికిఁ గూడ ఫలము లనుభవింపక తప్పదని యాచార్యుల జీవిత సంఘటనము తేటపఱచుచున్నది. కనుకఁ దానిప్పుడు చేయఁ దగినదేమి ? గాఢమగు పశ్చాత్తాపముచే దోషములు శమించు నని పెద్దలు చెప్పుచుందురు. ఇప్పుడు పశ్చాత్తప్తయగుట కన్న నామెకు గత్యంతరము దోఁపలేదు. ఆమె లోలోన చింపలు వేసికొన్నది. తన యపరాధములను క్షమింపు మని భగవానుని వేఁడుకొన్నది. జక్కణాచార్యునివంటి లోకోత్తర పురుషుఁడు నిర్దోషి-యొరుల తప్పులనుగూడఁ దనపై వేసికొని ఫలముల ననుభవించుటకు సర్వత్యాగముచేయుట యామెలోని పూర్తి పరివర్తనమునకు హేతు వైనది. ఆ మహాచార్యునే యామె గురుదేవునిఁగాఁ దన హృదయపీఠమునఁ బ్రతిష్ఠించు కొన్నది. తన చరమ జీవితమును ప్రాణేశ్వరునితోఁగూడ నా గురుమూర్తి చెంగటనే యాయన బోధల ననుసరించియే గడుప నిశ్చయించుకొన్నది.

జక్కణాచార్యుని ధర్మనిష్ఠ, ప్రతిజ్ఞాపాలనము శాంతలా దేవి కింతింతనరాని యాశ్చర్యమును గలిగించినవి. స్త్రీజాతియం దాయనకున్న గౌరవమున కామె యబ్బురం పడినది. "ఒక పతివ్రతను - నిరపరాధను కారణాంతరమున శంకించిన పాప

ఫలమే తనకీ ముప్పు తెచ్చిన''దన్న యాచార్యుని కర్మసిద్ధాంత పరిజ్ఞాన మీతఁ డొక మహాజ్ఞానియను నంశము నామెకుఁ దేఁట తెల్ల మొనర్చెను. భగవద్గీతలో భగవానుఁ డిందు కనియే జ్ఞానికి సర్వోత్కృష్ట స్థానము నొసంగి నాఁడనియు, ''జ్ఞానికి తనకును భేదములేద''ని నాఁడనియు నామె తెలిసికొన్నది. ''నిజముగా నిట్టి మహానీయుఁడు భగవత్తుల్యుఁడన్న నతిశయోక్తి యేలయగు? ఇంతటి కర్మసిద్ధాంత పరిజ్ఞానము, సత్కర్మాచరణ పరాయణత, ఆత్మదోషపరిజ్ఞానము నెవరికుండును? భక్తిజ్ఞాన వైరాగ్యములు కర్మయోగముతోఁ గూడ నాచార్యులవారి జీవితములోఁ బెనవేసికొన్నవి. ఇంత గొప్ప జీవితము నెంద అర్థము చేసికొందురు? నే నెఱింగినంతవఱ కాచార్యుని జీవిత సంఘటనము లన్నియు నర్థవంతములుగానే జరిగిపోయినవి. మతములనుగూర్చి కూడ వారి దెంతటిగంభీర భావము. జైనబౌద్ధములను గూర్చి గాని, శైవ వైష్ణవములను గూర్చిగాని వా రెన్నడైనను నిసుమంతయు వ్యత్యస్తముగాఁ బలికినవారు కారు. విశేషించి తాను శైవుఁడయ్యును వైష్ణవుఁడైన రామానుజులవారి కుపకార మొనర్చి తన్మతవిస్తరణమునకుఁ దోడ్పడినారు. అసలాయన యీ మతముల కతీతుఁడు. మతాతీతమగు నే పరమసంసిద్ధినో పొందినట్లు వారి జీవితాంశములు చాటుచున్నవి.'' ఇట్లు భావించి, భావించి శాంతల తమ కిట్టి యాచార్యుఁడు గురుస్థానముగా లభించినందుల కుప్పొంగి పోయినది.

ఏ వెట్లు జరుగుచున్నను ఇంచుకేనియు సంచలింపని సహజాదేవిగూడ నీలోకోత్తర సంఘటనమునకు మిక్కిలి నివ్వెరపడినది. ఇట్టి మానవు లుందురని యామె యెప్పుడును భావించియెఱుఁగదు. జీవితమొకనిర్దిష్టలక్ష్యము నేర్పఱచుకొని సాఁగింపవలసినదనియు, అందుకు మహాపురుషుల మార్గము లనుసరణీయములనియు నామెకుఁ దోఁచెను. ఐహికములగు నేయల్పప్రయోజనములనో యాశించి, స్వార్థాంధులై సర్వ దుష్కార్యములను జేయ వెనుకాడని వారి జీవితములు వరాహ జీవితములకుఁ దోడఁబుట్టువులని యాతల్లికిఁ దట్టినది. పైకి చలించిన ట్లగపడని సహజ లోలోన నేవేవో కొన్ని దృఢ నిర్ణయములను జేసికొన్నది.

ఉదయించినది మొదలు విశ్వము నంతటిని దన దివ్య కాంతులచే వెలిఁగించి, సాయంకాలము నందుఁ జంద్రాభ్యు దయమున కవకాశము నొసంగ నుపసంహృత తేజుఁడగు సూర్యభగవానునివలె జక్కణాచార్యుఁడు రక్తరంజితుఁడై నాఁడు. "పుత్రా దిచ్ఛేత్ పరాజయమ్." అనునట్లు తండ్రి లోకము నంతటిని గెలిచినను, దన కుమారుని నుండి తా నోటుపడఁ గోరుకొనవలసియున్నది. దీని సారాంశము తన కన్న మిన్నయగు తనయునిఁ గాంచి తాను ధన్యుఁడు కావలయుననుటయే గదా! పై సూక్తి ననుసరించి చూచిన జక్కణశిల్పి బ్రహ్మ కిది విజయమో పరాజయమో తెలియఁ గలదు.

*     *     *     *     *

బాలశిల్పియగు డక్కణాచార్యుఁడు ముహూర్త దినము నకుఁ జన్నిగరాయమూర్తిని సర్వాంగసుందరముగా నిర్మించి నాఁడు. ఈ మూర్తి విష్ణుదేవుని దగుటచేతను, విష్ణువు సత్త్వ గుణస్వరూపుఁడగుటచేతను సాత్త్విక శిలనేయాకుమారుఁ డెన్ను కొని శాస్త్రలక్షణము లందు రూపుదాల్చున ట్లా బింబమును నిర్మించినాఁడు. వేలాపురీ దేవాలయములయందు చన్నిగ రాయ, విజయనారాయణ ప్రతిష్ఠలు రామానుజాచార్యుని తోడ్పాటువలన అనంతకీర్తి శిల్పాచార్యుని చేతిమీఁదుగా ఏ లోపము లేకుండ సాగుచున్నవి. ఈ ప్రతిష్ఠామహోత్సవము లకు సౌపర్ణియు, చాముండేశ్వరియు విచ్చేసిరి. సౌపర్ణి దేవి భర్తృప్రాప్తికిని, కుమారవిజయమునకును మిక్కిలి సంతో షించినది. ప్రాణేశ్వరుని యంగవైకల్య మొక్కటే యామె కించుక కొఱంత. అయినను ఈశ్వరేచ్ఛ కేమి చేయఁగలదు!

దేవప్రతిష్ఠాకార్య మతి జాగరూకతతో నిర్వహింప వలసియుండును. దీనికి నడుపవలసిన తంత్రమెంతయో కలదు. క్షీరాధివాస, జలాధివాస, ధాన్యాధివాసములు, గర్భాలయ విశేశనము, పీఠస్థాపనము, రత్నన్యాసము, అష్టబంధనము, ప్రాణప్రతిష్ఠా దృక్ సంస్థాపనములు, ధ్వజకలశాదుల ప్రతిష్ఠలు మున్నగు కార్యములు విధివిధానమున జరుగవలసియున్నవి. వీనిలో నేత్రోన్మీలన సంస్కార మతి సుకుమారమైనది. కన్నులలో శ్వేతకృష్ణరక్తమండలములు త్రిమూర్త్యాత్మకము లును, సూర్యచంద్రాగ్న్యాత్మకములును నై యుండును. ఇవి సలక్షణముగా లేనిచో పెక్కులు విపరీతఫలములు గలుగు

చుండును. అట్లే దృష్టులలోఁగూడ పలురీతు లున్నవి. విదృష్టి అర్చకులను, యజమానుని చంపి వేయును. ఊర్ధ్వదృష్టి రాజును, రాష్ట్రమును నశింపఁజేయును. అధోదృష్టి లోకపీడను, దుర్భిక్షమును గూర్చును. పార్శ్వదృష్టి యజమాన బంధువులకుఁ గీడు మూడఁజేయును. నాసాగ్రదృష్టి స్థాన నాశమును, ధనక్షయమును గలిగించును. ఇట్టి దోషములు రానీకుండ సమదృష్టినే శిల్పాచార్యుఁడు మూర్తికి కల్పింపవలసియున్నది. దేవతలుగాని, మానవులుగాని, మఱెవ్వరైనఁ గానిండు సమదృష్టివిశిష్టులేసర్వారాధ్యులును, దేశకల్యాణసంధాతలునుగదా!

దేవమూర్తులలోఁ గూడ ఉగ్ర, వీర, శాంత, ప్రసన్నాది భేదము లనేకము లున్నవి. ఏ జాతి మూర్తి కెట్టి దృష్టి నిడవలసినదియు శాస్త్రానుభవశాలులగు శిల్పాచార్యు లెఱుంగుదురు. ఈ విజయనారాయణస్వామి దేశము యొక్క విజయాయురారోగ్యైశ్వర్యములకును, సర్వాభ్యుదయములకును ఉద్దేశింపబడినాఁడు గావున ఈయన శాంత ప్రసన్నమూర్తి; వ రా భ య ప్ర దా త.

అనంతకీర్తిస్థపతి మంత్రపూతచిత్తుఁడై తామ్రశలాకను దీసికొని "సూర్యశ్చ" అను మంత్రోచ్చారణ మొనర్చుచు బింబనేత్రమునందు జ్యోతిర్మండలమును వ్రాసెను. రజత శలాకతో "అగ్నిశ్చ" అను మంత్రమును బఠించుచు కృష్ణ మండలమును లిఖించినాఁడు. స్వర్ణశలాకతో "ఆసత్యేన" అను మంత్రమును జదువుచు శ్వేతమండలమును లిఖించెను. "చక్షు ర్నిర్మితం" అను మంత్రమును, ఇంక నా యా మంత్ర

ములను, బీజాక్షరములను జపించుచు ఊర్ధ్వాధోమధ్య రేఖలను, వామదక్షిణ నేత్ర భాగములను బూర్తి చేసెను. ఈ విధముగా త్రిమూర్త్యాత్మకము లగు రక్త కృష్ణ శ్వేత మండలములను జ్యోతిర్మండలమును నిర్మించి యా దివ్యమూర్తులకు కన్నులు తెఱచెను. తక్కిన కార్యకలాపములన్నియు నిర్వహింపబడి, దైవప్రతిష్ఠాకార్యములు మహావైభవముతో జరిగిపోయినవి.

ఇఁక జరుగవలసినది కుమారుఁడు నరసింహదేవుని యౌవరాజ్యపట్టాభిషేకము. కీర్తిమతి ఈ పట్టాభిషేక కార్య భారమును పూర్తిగా వహించినది. ఇంతవఱకును దన కుమారుఁడు వర్ధమానుఁడు యువరాజు గావలయుననియుఁ దాను రాజమాత గావలయుననియు వాంఛించుచున్న కీర్తిమతి యభిప్రాయ మిప్పుడు సంపూర్ణముగ మాఱిపోయినది. "శాంతలాదేవి పట్టమహిషి. ఆమె కుమారుఁడు నరసింహదేవుఁడును తన పుత్త్రుని కన్నఁ బెద్దవాఁడు. అతఁడు యువరాజగుటే న్యాయ్యము! అంతమాత్రమునఁ దనకును దన కుమారునకును గౌరవము తగ్గునా? శాంతలా నరసింహదేవులు మిక్కిలి మంచివారు. తమను చిన్నచూపు చూడరు. మీఁదుమిక్కిలి వర్ధమాన కుమారున కన్నగారి యెడ భరతునకు శ్రీరామునిపై నున్నట్టి భక్తి ప్రేమ లున్నవి. అతఁడును దమ్ముని సమధిక ప్రేమవాత్సల్యములతో నాదరించుచుండును. అట్టివారి మైత్రీబంధమును అధికారమోహముచేఁ దెగఁగొట్టుట పాపము. ధర్మమును, సత్యమును, న్యాయమును దైవములుగా నారాధించితీరవలసినదే. కాకున్న జీవితమునకు

సాఫల్య మేమి? ప్రతి ప్రాణియుఁ దా నొనర్చిన శుభాశుభ కర్మఫలముల ననుభవింపక తప్పదు. కావున కల్యాణమార్గ ములఁ బయనించుటకే మనుజులు పూనవలయును. తన గురు చంద్రుఁడు జక్కణాచార్యుఁడు చూపిన మార్గమునఁ దాను నడువవలదా?'' ఇట్లు తలంచి కీర్తిమతి హృదయపూర్వకముగా నరసింహదేవుని పట్టాభిషేకోత్సవమున నడుముకట్టి పనులు చేయించినది. ఈ మార్పునకెల్లరు నాశ్చర్యపడిరి. అందఱిలోఁ గూడ వింతయైన యాంతరంగిక పరివర్తనము కలిగినది. ఎవ్వ రును ఎవ్వరికిని ఎగ్గు చేయరా దని తీర్మానించుకొనిరి. ఈ యూహతో మతకలహములు, కులస్పర్ధలు, రాజకీయ వివాద ములు, వ్యక్తిద్వేషములు మానవుల మనస్సులనుండి మటు మా య మై న వి.

నరసింహదేవుని యౌవరాజ్య పట్టాభిషేకోత్సవము వేలాపురిలోని 'కళాభవనము'నందే జరిగినది. అనంతకీర్తిస్థపతి యజుర్వేదములోని ''యేభి శ్శిల్పైః'' అను పట్టాభిషేక మంత్రముతో యువరాజు వర్చస్వి కావలయునని యాశీర్వ దించెను. రామానుజాచార్యుని యమోఘాశీస్సు లందెను. జక్కణాచార్యుఁడు యువరాజు నరసింహదేవునకు,కుమారుఁడు డక్కణాచార్యునకు నభ్యుదయ పరంపరలు చేకూర హృదయ మున సంకల్పించి, దేశము కళాధర్మ విజయముల నందుఁగాక యని దీవించెను. అక్కన మహామంత్రి జక్కణాచార్యుల కళా సేవలను ప్రస్తుతించి, నేఁటినుండియు కళావీరకుమారుఁడు డక్కణాచార్యుఁ డాస్థానశిల్పిగా వరింపఁ బడుచున్నాఁడని ప్రకటించెను. సభ్యులు హర్షధ్వానములు చేసిరి. ''భువనశిల్పి-

## క ళా రా ధ న

కళాదేవుడు—విశ్వకర్మేశ్వరునికి జై!" అనుచు నందఱు నచ్చటి యా దేవుని చిత్తరువుపై పూలుచల్లి, నమస్కరించిరి. ఆ యాస్థానములో నున్న బొప్పన మహాకవీంద్రుఁడు హొయసల సామ్రాజ్యమున విస్తరించిన కళావైభవము నుగ్గడించి, మహారాజేంద్రుని కళాదీక్షను, దాని ఫలితమును గొనియాడి, జక్కణాచార్యునిఁ బ్రశంసించుచు నీ పద్యములను జదివెను.

సీ. "'దొడ్డగడ్డ పురానఁ' దులకించు నైలింప
శిల్ప కల్పనము నీ చేతి భిక్ష
'శ్రవణ బెళగుళ' ప్రసిద్ధ శిల్ప శ్రీల
కాయుస్సు నీ మృదు హస్తముద్ర
అల 'హళేబీడు'నం దందాలు చిందు వై
శాలేశుగుడి నీదు మేలిసృష్టి
'బేలూరు' నగర కళాలక్ష్మి వన్నెలు
చెన్నొందు నీ నేర్పు జీవరేఖ

గీ. పలు పలుకు లేల దక్షిణాపథము నంత
విశ్వరమ్య కళాజ్యోత్స్న వెల్లివిరిసి
వెలుఁగఁ జేసిన యభినవ విశ్వకర్మ!
జక్కణాచార్య! కొను నమస్కారశతము.

చ. "హొయసలరాజ్యలక్ష్మికిమహోజ్జ్వలశిల్పవిభూషణావళుల్
మెయి నెసఁగంగఁ జేసిన యమేయకళాకమనీయమూర్తి! నీ
పయి నవరంజిపూల జడివానలు చిల్కిన విష్ణువర్ధనా
హ్వయుఁడు కృతార్థుఁడోయి! ఋణపడ్డదిలెమ్ము జగమ్ము
వానికిన్!"

నలందా ప్రెస్, తెనాలి.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | 1 | సమీంచినది. | సమీపించినది. |
| 42 | 14 | చాముండేశ్వరి | చాముండేశ్వరి |
| 42 | 14 | త్రోవ | త్రోవ |
| 48 | 8 | దెలయదన్న | దెలియదన్న |
| 56 | 1 | సేనాయకుఁడు | సేనానాయకుఁడు |
| 68 | 8 | షడ్భావముల | షడ్బలముల |
| 96 | 15 | కూరనాథా | కూర్మనాథా |
| 100 | 10 | కోరుకొనని | కోరుకొను నని |
| 101 | 15 | తను | తాను |
| 135 | 7 | దుర్గణములు | దుర్గుణములు |
| 135 | 14 | దృష్టాంతరముగా | దృష్టాంతముగా |
| 144 | 3 | ఆచార్యావర్యా ! | ఆచార్యవర్యా ! |
| 154 | 8 | కూరనాథుని | కూర్మనాథుని |
| 156 | 5 | యాజ | యాజ్ఞ |
| 164 | 9 | ప్రసిద్ధ | ప్రశస్త |

# రచయిత ఇతర కృతులు

| | |
|---|---|
| అమరావతి (పద్యకావ్యము) | 1– 4–0 |
| తోరణము (ఖండకావ్యము) | 0–12–0 |
| ఆత్మదర్శనము (వేదాన్తము) | 2– 8–0 |
| శిల్పదర్శనము (శిల్పము) | 2– 8–0 |
| సిద్దప్ప చరిత్రము (జీవితము) | 2– 0–0 |
| నిరంజన విజయము ,, | 0– 8–0 |
| ఆసియా జ్యోతులు ,, | 1– 0–0 |
| మూడు కావ్యాలు (సమీక్ష) | 2– 0–0 |
| విశ్వకర్మాష్టకమ్ (ధ్యానం) | 0– 2–0 |

ప్రతులకు:

ఆంధ్ర శిల్పకళాపరిషత్తు,

తెనాలి.

కళాదేవుఁడు-విశ్వకర్మేశ్వరునికి జై'' అనుచు నందఱు నచ్చటి యా దేవుని చిత్తరువుపై పూలుచల్లి, నమస్కరించిరి. ఆ యాస్థానములో నున్న బొప్పన మహాకవీంద్రుఁడు హొయసల సామ్రాజ్యమున విస్తరించిన కళావైభవము నుగ్గడించి, మహారాజేంద్రుని కళాదీక్షను, దాని ఫలితమును గొనియాడి, జక్కణాచార్యునిఁ బ్రశంసించుచు నీ పద్యములను జదివెను.

సీ 'దొడ్డగడ్డ పురానఁ' దులకించు నైలింప
శిల్ప కల్పనము నీ చేతి భిక్ష
'శ్రవణ బెళగుళ' ప్రశస్త శిల్ప శ్రీల
కాయుస్సు నీ మృదు హస్తముద్ర
అల 'హాలేబీడు' నం దందాలు చిందు వై
శాలేశుగుడి నీదు మేలిసృష్టి
'బేలూరు' నగర కళాలక్ష్మి వన్నెలు
చెన్నొంద నీ నేర్పు జీవరేఖ

గీ. పల్కుపలుకు లేల దక్షిణాపథము నంత
విశ్వరమ్య కళాజ్యోత్స్న వెల్లివిరిసి
వెలుఁగఁ జేసిన యభినవ విశ్వకర్మ !
జక్కణాచార్య ! కొను నమస్కారశతము.

చ హొయసల రాజ్యలక్ష్మికి మహోజ్జ్వల శిల్ప విభూషణావళుల్
మెయి నెసఁగంగఁ జేసిన యమేయకళా కమనీయమూర్తి ! నీ
వయి నపరంజిపూల జడివానలు చిల్కిన విష్ణువర్ధనా
హ్వాయుఁడు కృతార్థుఁడోయి! ఋణపడ్డది లెమ్ము జగమ్ము వానికిన్!"

